




ముఖచిత్రం : అతాజ

చిత్రకారుడు : వడ్డాది పాపయ్య



# లైఫ్‌బాయ్ ఎక్కడో ఆరోగ్యం అక్కడ

లైఫ్‌బాయ్‌తో స్నానం చేస్తే పరిశుభ్రంగా ఉంటారు మీరు. ఆరోగ్యమైన తాజాదనము అనుభూతి పొందుతారు. లైఫ్‌బాయ్‌తో జీవితం ఆరోగ్యప్రదం. గుర్తుంచుకోండి.




## లైఫ్‌బాయ్
## మురికిలో గల క్రిములను కడిగి వేస్తుంది

# యువ


సచిత్ర మాస పత్రిక

సంస్థాపకులు : చక్రపాణి

సంపుటి 45 | మార్చి 1982 | సంచిక 3


అనేక మాసములుగా, అనేక పర్యాయములు పత్రికలలోనూ, రాజకీయ వర్గాలలోనూ ఊహాగానాలు జరిగిన కేంద్ర మంత్రిమండలి పునర్నిర్మాణం 1982 జనవరి 15 వ జరిగింది. దీనిని పునర్నిర్మాణం అనడానికిగాని విస్తరణ అనిగాని అనడానికి పూర్తిగా వీలులేదు. ఎక్కువగా ఇది పునర్వ్యవస్థ. దీని వల్ల, ఎంతో ఆశలు పెట్టుకొన్న దాదాపు యాభైమందికి ఆశాభంగం కావడం జరిగింది ఏమైనా, అయిదారు మంది కొత్తవారు వస్తే, నాలుగైదు మంది పాతవారు పోవడం జరిగింది. మంత్రుల శాఖలలో మార్పులు జరిగాయి.

మంత్రుల శాఖలలో మార్పులు జరగడం, మన దేశంలో దాదాపు ప్రతి సంవత్సరమూ జరుగుతూ వున్నదే. ఒక విధంగా అది మంచిదే. కొంత మంది మంత్రులకైనా పరిపాలనలో వివిధ శాఖలలో అనుభవం లభిస్తుంది. ఈ పద్ధతిని మంచిది కాదని ఎవరూ అనరు. కానీ, ప్రజా జీవితంతో చాలా ముఖ్యమైన సంబంధంగల ఆర్థికశాఖలో తరచు మార్పులు రావడం, ఆర్థిక విధానంలో మార్పులు జరగడానికి కారణమౌతుంది.

ఏ మంత్రిశాఖలలో మార్పులు జరిగినా ఆర్థికమంత్రి మారడం ఇది వరకు తరచు జరిగేది కాదు. ఒక వ్యక్తి ఆర్థికమంత్రిగా నియమితుడైతే,

సాధారణంగా అయిదేళ్ళు అతడు ఆ పదవిలో వుండడం, అతడి విధానాలను అమలుజరపడానికి చాలా సహాయపడుతుంది. ఏ విధానమైనా పూర్తి మంత్రి మండలి బాధ్యతతో జరుగవలసింది గాని, ఒక వ్యక్తి యిష్టానిష్టాలతో సంబంధించినది కాదని అనవచ్చును. కాని, పూర్తి మంత్రిమండలి అంగీకారంతోనే ప్రతి సంవత్సరమూ ఆర్థిక విధానం ప్రకటింపబడినా, అది కేవలం ఆర్థిక మంత్రి భావాలను అనుసరించే ప్రకటింపబడుతూ వచ్చింది. అంచేత ఒక మంత్రివర్గం పదవిలో వున్నంతకాలమూ, అంటే ఒక పార్లమెంటు అమలులో వున్నంతకాలమూ, ఒకే వ్యక్తి ఆర్థికమంత్రిగా వుంటే, అతడి భావాలను, విధానాలను అమలుజరిపి ఆర్థిక విధానాన్ని కొనసాగించడానికి సావకాశం వుంటుంది. లేకపోతే, ఆర్థికమంత్రి మారినప్పుడల్లా ఆర్థిక విధానాంలో కొద్దో గొప్పో మార్పురాక తప్పదు.

పార్లమెంటుకు ఎన్నికలు జరిగి ఒక పార్టీ ప్రభుత్వం అధికారంలోకి వచ్చిన తరువాత ప్రకటింపబడే బడ్జెటు, ఆ పార్టీ ప్రభుత్వం అమలులో వుండే అయిదేళ్లకూ అమలు వుండేటట్టు ప్రవేశపెట్టాలనీ, ప్రభుత్వపు ఖర్చు, ఆదాయాలలో ఏఏటా మార్పులు వుండవచ్చునుగాని, ఇన్‌కంటాక్సు రేట్లను మాత్రం ప్రతి ఏటా మార్చకుండా అయిదేళ్లకొకసారి మార్చే పద్ధతి వుంటే మంచిదనీ ఎంతో మంది ఎన్నోసార్లు సూచించారు. అలా జరగలేదు. జరగదేమో కూడా.

కాని, ఆర్థికమంత్రిని మాత్రం అధమం అయిదేళ్లు అదే పదవిలో వుంచినట్లయితే, అతడు ప్రారంభించిన విధానాలను అమలు జరపడానికి అతడికి అవకాశం వుంటుంది. అంతేకాదు. ఒకే వ్యక్తి ఆ పదవిలో అయిదేళ్లూ వున్నట్లయితే, అతడి విధానాలలో పెద్ద మార్పులు ఏమీ వుండవు.

జనవరి నెలలో జరిగిన మంత్రిమండలి పునర్వ్యవస్థీకరణలో ఆర్థిక మంత్రి మార్పు జరిగింది. అంచేత, 1982-83 బడ్జెటులో ఏమి మార్పులు వస్తాయో, అంటే పూర్వపు బడ్జెటుకన్న ఎక్కువ సరసంగా వుంటాయో, విరసంగా వుంటాయో అని ప్రజలు కలవరపడడం జరుగుతుంది అయితే, మంత్రిమండలి ఒకే పార్టీకి చెందినదవడంచేతనూ, ఆ పార్టీ నాయకత్వం దృఢంగా నిలిచి వున్నందుననూ, ప్రజలకు బాధాకరమైన మార్పులు 1982-83 బడ్జెటులో వుండకపోవచ్చుననే ఆశకు అవకాశం వుంది.

ఏమైనా, ధరలను కట్టుబాటులోకి తేవడానికి, ద్రవ్యోల్బణాన్ని తగ్గించడానికీ దిట్టమైన చర్యలు ఇప్పుడు అవసరం. ధరల సూచికలను చూస్తే, టోకు ధరలకూ, చిల్లర ధరలకూ మధ్య వ్యత్యాసం చాలా ఎక్కువగా కనపడుతుంది. టోకు వ్యాపారం నుంచి చిల్లర వ్యాపారానికి వచ్చేలోపల ధరలు విపరీతంగా పెరిగిపోవడాన్ని ప్రభుత్వం ఎలాగైనా అరికట్టకపోతే, సామాన్య ప్రజల నిత్యజీవితం దుర్భరమైపోతుంది. ఇప్పటికే అయింది. మరీ దారుణంగా బాధ కలిగించే స్థితి రాకుండా, ధరలను అదుపులోకి తేవడము అవసరం.

ప్రభుత్వ వ్యయం ఎక్కువ అయితే, ధరలు పెరగడం ఎక్కువ అవుతుంది. ఏమంటే, ఎక్కువ డబ్బు చెలామణీలోకి వస్తుంది కనుక. అందుచేత, ధరలను తగ్గించడానికి అనుసరించే విధానాలలో, ప్రభుత్వ వ్యయాన్ని తగ్గించడం ఒక ముఖ్య భాగంగా వుండాలి.

---

# ఆధునిక నీతి కథలు

## తాళ్లూరు నాగేశ్వరరావు

జీవితాన్ని ఓ పర్వతంగా భావించి, ఆ పర్వతంతో 'ఢీ'కొని విజయాన్ని సాధించాలనే నూటిమనిషి పర్వతాలరావు. పుట్టింది పేదకుటుంబంలో. పెరిగింది పదిమంది దయాధర్మాలపైన. ఎందుకంటే, అతని చిన్న వయస్సులోనే తల్లిదండ్రులు పోయారు. అతన్ని తప్ప అతనికి అర్ధరూపాయిఆస్థి కూడా మిగిల్చి వెళ్ళలేదు అతని తల్లిదండ్రులు. కేవలం స్వయంకృషిపైనే, సొంత తెలివితేటలతోనే, యాంత్రికమైన పరిశ్రమతోనే బి.ఏ. దాకా చదివి, అందులో ప్రథమ శ్రేణిలో ఉత్తీర్ణుడయ్యాడు. అయినా ఉద్యోగం కోసం ఎంతో మందిని ఆశ్రయించాడు. ఎన్నో ఇంటర్వ్యూలకు హాజరయ్యాడు. హాజరయిన ప్రతి ఇంటర్వ్యూలోనూ సభ్యుల్ని మెప్పించేడు. అయితే ఒక మహానుభావుడు పర్వతాలరావు విద్యావిషయిక ఔన్నత్యాన్నీ, ఇంటర్వ్యూలో చూపిన సామర్థ్యాన్నీ, అతని స్థితిగతుల్నీ గ్రహించి ఉద్యోగం ఇచ్చాడు లిమిటెడ్ కంపెనీలో కిందిస్థాయి గుమాస్తాగా.

ఆ కంపెనీలో చేరినదగ్గర్నుంచీ పర్వతాలరావు తన సామర్థ్యాన్ని, తెలివితేటల్ని నిరూపించుకోవడానికీ, పై అధికార్ల మెప్పును పొందడానికీ క్షణం వృథా చేయలేదు. ఠంచన్‌గా తొమ్మిదిన్నరకు ఆఫీసుకు వచ్చేవాడు. కుర్చీలో కూర్చున్న దగ్గర్నుంచీ లంచ్ టైమ్‌లో అరగంట తప్ప మళ్ళీ సాయంత్రం అయిదయ్యేవరకూ, ఆ కుర్చీకే అంకితమైపోయేవాడు. ఇచ్చిన పనిని కడు జాగ్రత్తగా అమిత వేగంగా చేసేవాడు. ఆఫీసుటైమ్‌లో ఎవ్వరితో మాట్లాడేవాడు కాదు. ఆఫీసు విధులకు అంత యిదిగా కట్టుబడి, గానుగెద్దులా పర్వతాలరావు పనిచేస్తూ వుండడం తోటి గుమాస్తాలకు కన్నెర్రగా వుండేది. జీవితాన్ని ఆఫీసు విధులకు అంకితంచేసే ఉద్యోగులు ఈ రోజుల్లో వెయ్యికి ఒక్కరు కూడా ఉంటారా? ఉంటే ఆ ఒక్కడే పర్వతాలరావుగా చెప్పుకోవచ్చు.

పర్వతాలరావు పని సామర్థ్యం కంపెనీ మేనేజింగ్ డైరక్టరు దాకా వెళ్ళింది. అతన్ని గురించి రహస్య రిపోర్టులు అనుకూలంగా అందాయి. ఒక

రోజు మధ్యాహ్నం మేనేజింగ్ డైరక్టరు నుంచి పిలుపు వచ్చింది పర్వతాలరావుకు. సహం భయంగానూ, సహం బిడియంగానూ మేనేజింగ్ డైరక్టరు ఎయిర్ కండి షన్డు గదిలోకి వెళ్ళాడు పర్వతాలరావు.

"మిస్టర్ పర్వతాలరావ్ ! మీ గురించి విన్నాను. ఆఫీసు పని సెంట్ పర్సెంట్ వొళ్ళు వంచి పనిచేస్తున్నారని తెలిసింది. ఓ క్షణం కూడా వృధా చేయని మీ సిన్సియారిటీని అభినందిస్తున్నాను."

తనకి మేనేజింగ్ డైరక్టర్ డబుల్ ప్రమోషన్ ఇవ్వబోతున్నంతగా పర్వతాలరావు మొహం మెర్క్యూరి కాంతిలాగా వెలిగింది.

"మీ వయసెంత ?"

"ఇరవై ఏడేళ్ళండీ"

"ఈ వయసుకే ఆఫీసుపనిలో అంత గొప్ప సామర్థ్యాన్ని సంపాయించా రంటే, కంపెనీ వ్యాపారంలో మెలుకువలన్నీ తెలుసుకున్నారంటే సామాన్య మైన విషయం కాదు. మిస్టర్ పర్వతాలరావ్! మీ లాంటి వయసు తక్కువ, తెలివి ఎక్కువ యువకుల్ని చూస్తే మాకో భయం ఏర్పడుతూ వుంటుంది."

పర్వతాలరావు మొహంపై హఠాత్తుగా చిరుచెమట్లు కమ్మాయి. ఆ చెమట్ల ద్వారా అంతదాకా అతని మొహం ఆర్పేసిన దీపమైంది.

"పని బాగా నేర్చుకుని, ప్రావీణ్యం సంపాదించి, వ్యాపార రహస్యాలను తెల్సుకొని, కొన్నాళ్ళు పోయాక మాకు పోటీగా వ్యాపారం పెడుతూ వుంటారు మీలాంటివాను. అందుచేత అలాంటి ప్రమాదం రాకుండా ముందు జాగ్రత్త పడడం మా కర్తవ్యం. మీలాంటివారికి ఉద్వాసన చెప్పడం మా వ్యాపారధర్మం. మీరేమి అనుకోకండి. మా ధర్మాన్ని మేము పాటించాలి. రేపే మీ జీతాన్ని, అలవెన్సులనూ, బోనస్‌నూ తీసుకొని మరోచోట ఉద్యోగం చూసుకోండి." అన్నాడు మేనేజింగు డైరక్టరు ముందున్న ఫైల్లోకి మొహం దూర్చి.

*ఉద్యోగం వెలయాలేగాని ఇల్లాలు ఎప్పటికీ కాదు.*

# జరుగుతున్న చరిత్ర

కాలం నిల్వదు. కాని, దానిని బంధించి తమ పట్టు నెగ్గించుకోవలెనని సర్వాధికార గర్వం కలవాళ్ళు ప్రయత్నిస్తారు. సముద్రాన్ని శాసించి, అలలను అరికట్టవలెనని కింగ్ కాన్యూట్ ప్రయత్నించలేదా? అంతో ఇంతో ఆ వెర్రి ప్రపంచాన్ని శాసించగలమని భావించే అగ్రరాజ్యాల మహానాయకులకు వుండనే వుంటుంది. అందువల్లనే కాబోలు ఇటు రీగన్, అటు బ్రెజ్నేవ్ పోలాండ్ విషయంలో విపరీతంగా సంచరిస్తున్నారు.

వీరుభయులు పోప్ మహాశయునితో కలిసి చర్చించుకొని పోలిష్ ప్రజలకు ఒకమార్గాన్ని చూపించి, వారి సంకటాన్ని దూరంచేయగలరు. ఇందుకై ఒక షరతుకు వారు కట్టుబడవలెను. పైనుంచి ఎవరమూ ఏమీ చెయ్యనక్కరలేదు- పోలాండ్‌లోని అధికార్లు, వర్కర్లు, కర్షకులు, రోమన్ కాథలిక్ చర్చికి సంబంధించిన కార్యనిర్వాహకులు బేషరతుగా కూడి, పోలిష్ ఆర్థిక విషమ పరిస్థితిని సమీక్షించుకుని దానికి విరుగుడు వేసుకోడానికి ఎటువంటి రాజకీయ- ఆర్థిక ప్రక్రియలను వినియోగించుకోవలెనో వాటిని అమలు పరచుకోడానికి అందరం సహకరిస్తాం- అని ఆ ఇద్దరు సంకల్పించుకుంటే పోలిష్ పరిస్థితి చల్లబడుతుంది.

పోలిష్ సమస్యలో ఇమిడివున్నది సూక్ష్మాతిసూక్ష్మమైన కిటుకు. కార్మికులు, కర్షకులు తమ కిష్టంలేనివారిని తొలగించుకొని సమర్థులైనవారిని రంగంలోకి దింపి తమ కార్యకలాపాలను సాగించుకునే స్వేచ్ఛ కావలెనంటున్నారు. పరిపాలన కమ్యూనిస్టు పార్టీ చేయవలసిందేనని అంటున్నారు. జనసముదాయానికి నచ్చిన విధంగా పార్టీని దిద్ది, స్వతంత్ర లేక స్వయంపాలక కార్మిక సంఘాలు, కర్షక సంఘాలు సూచించిన మేరకు పరిపాలన, పరిశ్రమలలో- వ్యవసాయరంగంలో పెత్తనం కొనసాగవలెనని తాత్పర్యం. ఆ విధంగా పరివర్తన తేవడానికై ఘనమైన కృషి జరిగింది. కాని ఎక్కడో ఇంకా పరస్పరం సంశయాత్మకమైన గొడవ మిగిలిపోయింది- మన అస్సాం సమస్యలలో మిగిలిపోయినట్లు!

అస్సాంలో ఉదయించిన సమస్య ఆ పరిస్థితులలో ఎక్కడైనా వచ్చేదే. అందరం అస్సాం ప్రజలపట్ల సానుభూతి కలిగివున్నవారమే. కాని, పాత వాసనాలుగల బెంగాల్- అస్సామ్ వివాదం, ఇతర ప్రాంతాలనుంచి వచ్చి కాపురస్థులై

పోయినవారి బాధ- ఇవన్నీ కలిసి అన్ని పార్టీలను పట్టి కొట్టిస్తున్నవి. ఓపికతో అందరం కలిసి ఏదో విధాన పరిష్కరించుకోక తప్పదు.

పోలాండ్‌లోనూ అంతే.

కాని, పోలాండ్ పేరిట రీగన్ ఖబర్దార్ వాక్యాలను పలికి శాంక్షన్లు విధిస్తే, అవి అమలుజరిగే విధమేదీ? బ్రెజ్నెవ్, పోలిష్ శక్తులు సమాధాన పడకపోతే, మేం వస్తూనే వున్నాం అన వలసిన పనిలేదు. కాపిటలిజంలో కొన్ని సమస్య లెదురైతే కమ్యూనిజంలో మరి కొన్ని సమస్య లుత్పన్నమవుతవి. ఆ సమస్యలకై స్వేచ్ఛగా తర్కించి పరిష్కార మార్గాలను అన్వేషించడం కర్తవ్యం. ఎర్రటి ప్రపంచంలో మును పటి కంటె స్వతంత్రంగా ఆలోచించు కునే ధోరణి, ఎంత పెద్దవారైనా సరే వారి మార్గం తప్పని తోస్తే ఆ మాటను గట్టిగా వెల్లడించడం, ఇప్పుడు ఎక్కువగా గోచరిస్తున్నది. కాని, చాలదు. అందువల్లనే రష్యా పోకడలో ముందు-వెనుకలు కనిపిస్తున్నవి.

సాధారణంగా మతం రాజకీయాలలో ప్రవేశిస్తే చిక్కులు తెచ్చిపెడుతుంది. కాని, పోలాండ్‌లో ఆరాధనకొరకే చర్చి సాధారణంగా వినియోగ మవుతున్నా, ఆ సాధారణ పరిస్థితులలో ప్రజాకోటికి అత్యంత శ్రేయోభిలాషిగా తన నడవడిని దిద్దుకుంటున్నది. అపూర్వం! అఘటనాఘటన సామర్థ్యం ప్రదర్శిత మైనది.

అంతటి సత్ఫలితాలన్నీ చేజారి! సందర్భంలో మార్షల్ లా రాజ్యానికి అవకాశమే లేకుండా చేయవలసినది. పెద్దలనబడేవారి చాతుర్యం, చాణక్యం విఫలమైనవి. నేడు ఎక్కడ ఘర్షణ వచ్చినా, కావలసింది చాణక్యం కాదు, చిత్తశుద్ధి. ఆ గుణసంపదను అలవర్చు కోవలసిందని రాజ్యాలకు ప్రపంచ ప్రజా కోటి పక్షాన మాన్యులు ఎలుగెత్తి చాట వలెను. ఇప్పటి రాజ్యశాసకులకు తమ నడవడిని అందు కనుగుణంగా మార్చు కునే శక్తి లేదని రుజువైతే, వారి స్థానే మరొకరు, సమర్థులైనవారు రావడానికై కృషి జరగక తప్పదు.

దేశదేశాలలో ప్రజలు తరతమ భేదాలతో చిత్తశుద్ధిలేని పాలకవర్గాల లేక పాలకవిధానాల వశమై నలిగిపోతున్నారు. వీరికి విముక్తి ఇక లేదని భావించరాదు. పొగలోనుంచి సెగలోకి వీరు వచ్చిన మాట నిజమే. ఈ సెగలోనుంచి వీరిని తప్పించే విమోచనశక్తి రాకపోదు. శుభస్య శీఘ్రం.

* * *

ఆ సెగ అతి విపరీతంగా ఒక సీమలో సామాన్య జనాన్ని హింసిస్తున్నది. హింస దుర్భరమై ఎవరైనా ఎదురుతిరిగితే

చిత్రహింస బహుమానంగా లభిస్తుంది. నిర్విరామంగా ఈ మహాదారుణానికి గురియైన శ్యామవర్ణులు. జాత్యహంకారంతో విర్రవీగే, అధికార రోగపూరిత బధిరాంధక శవములతో సమానంగా సంచరించే శ్వేతముఖులైన క్రూర మానవుల కూటమి ఈ సీమలలో చండశాసనం చేస్తున్నది.

కారుణ్య భావం గలవారంతా ప్రపంచమంతటా ఆ ఘోరకలిని ఖండించారు. మనందరి పక్షాన మన ప్రధానమంత్రి పల్కింది. 1980 లోగా దక్షిణాఫ్రికాలో చెలరేగే పరమ దుర్మార్గం అంతమై పోతుందని ప్రకటించింది. తథాస్తు!

శ్యామవర్ణుల స్వరాజ్యం గెల్చుకొన్న ఆఫ్రికా సీమలన్నీ పాల్గొన్న సమావేశం జనవరిలో దక్షిణాఫ్రికాలో పోరాడే స్వాతంత్ర్యసమర వీరులను అభినందించడానికై మన రాజధానిలో జరిగింది. మన ప్రధానమంత్రి ఆ సమావేశంలో ప్రసంగించింది. సుభాష్ చంద్రబోస్ (నేతాజీ) అయినా, భగత్ సింగ్ అయినా, సుబ్రహ్మణ్య భారతి అయినా, జయప్రకాశ నారాయణ అయినా ఈ ప్రసంగంలోని ఉద్వేగాన్నీ, సానుభూతినీ ప్రకటించేవారు.

దక్షిణాఫ్రికా ప్రజాసామాన్యపు పోరాటం దౌర్జన్యానికి లొంగదు: ఆ సమరానికి విజయం తథ్యం: ప్రపంచంలోని ఏ ప్రజయైనా దాస్యవిముక్తికై మానవ హక్కులకై గావించే పోరాటానికి భారత ప్రజల - భారత ప్రభుత్వ అండదండలు ఎప్పటికీ వుంటూనే వున్నవి; ఒక్కొక్క ప్రజ తన స్వరాజ్యాన్ని పొందగానే అందరం ఆనందిస్తూ వుంటాము; ప్రస్తుతం యావజ్జీవ శిక్షను అనుభవిస్తూ వుంటే దక్షిణాఫ్రికా ప్రజావిమోచన సంగ్రామ శూరుడైన నెల్సన్ మాండేలాను ఆత్మీయునిగా భావించి నెహ్రూ అవార్డును అంతర్జాతీయ సుహృద్భావం కోసం ఇయన కిచ్చి ఆదరించినాము - నాటికి నూటపాళ్ళు మన దేశీయులంతా తామే ఆ వాక్యాలను పలికినట్లుగా భావిస్తారు, సంశయంలేదు.

* * *

మన దేశంలో ప్రజాస్వామ్య శక్తులు ఘనవిజయాన్ని సాధించినవి. ఇందుకు సాక్ష్యం జనవరి పదవతేదీన మన ప్రధానమంత్రి న్యూయార్క్ (అమెరికా) పత్రికా ప్రతినిధితో ముచ్చటిస్తూ తెలియజేసిన అంశాల సముదాయం.

కౌరవులు నూర్గురు ఒక వైపున, పాండవులు అయిదుగురు ఒకవైపున వుండి కలహించినారు: కాని, గంధర్వు నెదిరించి నూటయిదుగురు ఒకటే ఐనారు - ధర్మరాజు హితవు ననుసరించి!

మన స్వతంత్ర భారత భవితవ్యం దృష్ట్యా, లోకాన్ని మనం ఎదిరించినపుడు అందరిదీ ఒకేమాట!

నమ్ము - నమ్మకపో, మన విశిష్ట వ్యక్తిత్వం, మన జాతీయధర్మం సంపూర్ణంగా అందులో, ఇదివరకెన్నడు కానట్లుగా, ద్యోతకమైనవి. అందువలన, దేశంలోని ప్రజాశక్తులు మన చెవిలో ఇల్లుగట్టుకుని చెబుతూవచ్చిన సంగతులన్నీ నేడు ప్రామాణికంగా మన ప్రభుత్వ ముఖతః బహిరంగమైనవి.

ఇంతకూ, ఆ బహిరంగమైన, విస్పష్టమైన, సర్వ సమ్మతమైన విషయాలేమిటివి? విందాం, పదండి.

* * *

**పవర్** కూటములలో భారతదేశం చేరదు. ఈ వైఖరిని అమెరికా ఆదరించవలెను. అమెరికాకు ఇండియాకు ఘర్షణ ఎందునా వుండవలసిన పనిలేదు. ఈ దేశం కేవలం అమెరికా అభిమాని కాదు, కేవలం సోవియట్ రాజ్యాభిమాని కాదు. ఈ రెంటిలో ఏ దేశానికీ విరుద్ధం కాదు. అత్యధికంగా, విశిష్టంగా ఈ దేశం స్వాభిమాని. అనేక అమెరికన్ పాలక వర్గాలతో వ్యవహరించినది. ఇండియా-అమెరికాల యోగక్షేమాలకై కృషి చేసినది. అమెరికా ప్రభుత్వ కోరిక ననుసరించి ఇండియా సాన్నిహిత్యం వుంటుంది. ప్రజాస్థాయిలో ఉభయసీమల వారి నడవడి పరస్పరం బాగానే వుంటున్నది. ప్రభుత్వ స్థాయిలో ఒడుదుడుకులు కలిగినవి. అమెరికాతో ఇండియాకు మంచి సంబంధాలు, ఆర్థిక సహకారం, విస్తరించే వ్యాపారం కావలెను. సోవియట్ రష్యా కేవలం ఇండియాకు సాయపడలేదు; 77 దేశాల కూటమికి సాయం చేసింది: ఇప్పుడా కూటమిలో నూరు సీమలున్నవి; అందులో ఒకటి ఇండియా. అనేకమైన అంశాలు ప్రపంచ సంస్థలలో చర్చకు వచ్చినపుడు సోవియట్ యూనియన్ను ఇండియా బలపరచలేదు; ఇండియానే ఆరాజ్యం బలపరచింది. అఫ్గాన్ సంకటం వలన పాక్ వారికి ఆయుధాలిస్తే, వాటిని వారు లోగడ చేసినట్లు ఇండియాపైకి వినియోగిస్తే, ఇండియాను ఒక ఆపద ఎదుర్కొంటుంది గదా।

ఇక చైనాతో ఇండియా బాంధవ్యం సంగతి అంటారా, వినండి. ఈ రెండు దేశాలు జగడం మానుకుని, ఈర్ష్యారహితంగా, ఇతోధిక సహకారభావంతో సంచరిస్తే ఆసియా సీమలన్నీ ఎక్కువ స్థిరపడగలవు, దారిద్ర్యం- ఆర్థికంగా వెనుకబడివుండే స్థితులను ఎదిరించి గొప్ప కార్యసాధన చేయగలవు. న్యూక్లియర్ శక్తి అవసరమేకాని బాంబు అక్కరలేదు, దానిని చేయబోయేది లేదు. శాంతియుత ప్రయోజనాలకై ఆ శక్తికి సంబంధించిన ఒప్పందాలు అసమానమైనవిగా వుండకూడదు. ఇండియా పైజా పెద్దది. విభిన్న రూపాలుగల ఏకదేశం గనక దీనికి సరిపడిన రాజ్యపద్ధతి ప్రజాస్వామ్యమే।

పై వాక్యాలను పరిశీలకులు కొందరు

విశితంగా పరిశీలించి న్యూక్లియర్ బాంబు విషయమై వెల్లడియైన వాక్యాన్ని ఆక్షేపించ వచ్చును. ప్రధాని మొరార్జీదేశాయి ఇదే విధంగా అన్నప్పుడు కూడా వారు ఆక్షేపించారు. స్వాభిమానులం అని చెప్పుకుంటూ, మన భవిష్యత్ కార్యక్రమం విషయమై ఇతరులకు సంజాయిషీ చెప్పుకోవలసిన అవసరం ఏమున్నది? అని వారి అభిప్రాయం కాబోలు!

* * *

పాకిస్తాన్ విదేశాంగ మంత్రి మన ఆహ్వానాన్ని అంగీకరించి సంప్రదింపులకై వస్తున్నాడు. ఈ పంక్తులందే లోపల ఆ సంప్రదింపుల పర్యవసానం తెలిసి వుంటుంది. ప్రభుత్వ స్థాయిలోనే గాక, ప్రజాస్థాయిలో భారత-పాకిస్తాన్ సంబంధాలు సన్నిహితం కావడం మంచిదనే అభిప్రాయం రెండు దేశాలలోని బుద్ధిమంతులకు కలిగినట్లు వినికిడి. ఈ ప్రయోగం మంచిదే. భారత-పాక్ మైత్రి ఉభయులకూ శ్రేయస్కరమైనది.

* * *

బాంగ్లాదేశ్‌లో ఆర్మీకి తృప్తి కలగ లేదు. పరిపాలన సాగే విధానంలో న్యాయం, ధర్మం, నీతి వుండవలెనంటే, ఆర్మీ ప్రస్తావన లేకుండా అది సాధ్యం కాదని సర్వసైన్యాధిపతి హెచ్చరించి వుండెను. ఎన్నికలలో కొత్త అధ్యక్షుడు రాగానే, తొమ్మిదిమంది పెద్దలుగ ఒక సలహా సమితి నిర్మాణమైనది. అందులో ఆర్మీ నాయకులుంటారు. కాని ఆ ప్రతిపాదన అంగీకారయోగ్యం కాదని సర్వసైన్యాధిపతి వెల్లడిచేసినాడు.

దేశానికి తగిన రాజకీయ పరిపాలన దేశాన్ని రక్షించే సేన- ఈ రెంటి నడుమ విరుద్ధమైన సంబంధం కానసాగదు. బంగ్లాదేశ్ భవితవ్యానికి అత్యవసరమైన అంశం.

వంగబంధు షేక్ ముజీబుర్ రహమాన్ మీద మహా ఘోరంగా పగతీర్చుకున్న దుష్ఫలితం ఇంకా ఆ దేశాన్ని బాధిస్తూనే వున్నది. వంగబంధు పుత్రిక హసీనా నడిపించే అవామీ లీగ్ (ప్రజా సమితి) ఆ బాధానివారణకై ఏదైనా మార్గాన్ని చూపగవలదేమో చూడవలసి వున్నది.

బాంగ్లాదేశ్ రాజ్యానికి ఇప్పటి సమయంకంటె మంచి అనుకూలమైనది మరొకటి రాదు- మనతోనూ, అంతరంగికంగానూ, చక్కదిద్దుకోవడానికి ఈ తరుణాన్ని జారవిడువరాదు.

మానసం అచ్యుతలక్ష్మీకుమారి



స్కూటర్ ఆగిన శబ్దం విని ఎంబ్రాయిడరీ చేస్తున్న మాధవి సంబరంగా లేచింది

లోపలి కొస్తున్న విజయ్‌కి మొహంనిండా చిరునవ్వులు చిప్పుకుని ఎదురెళ్ళింది మాధవి. ఆమె అందాల మొహం చూడగానే విజయ్‌లో అంతవరకు ఉన్న అలసట, చిరాకు మంత్రంవేసినట్టు ఎగిరిపోయాయి "హాయ్ !"

---

**1981 చక్రపాణి తృతీయ అవార్డు పొందిన నవల**

అంటూ ఉషారుగా ఆమె బుగ్గ మీటాడు విజయ్. ఎన్నాళ్ళనుంచో కలిసి ఉన్నా, నిత్య నూతనమైన అనుభూతి కేవలం అనురాగపూరితమైన అలుమగలకు మాత్రమే పరిమితమేమో!

సోఫాలో ఒకి మూల [illegible] ఎం[illegible]బ్రాయిడరీ దారాలను చిక్కులు పెడుతున్న మూడేళ్ళ బాబిగాడు [illegible] చూడగానే చప్పున వచ్చి కాళ్ళకి చుట్టేశాడు. "[illegible]. బాబీ!" అంటూ [illegible] తెచ్చిన చాక్‌లెట్స్ వాడి కందించి ఎగరేసి పట్టుకున్నాడు విజయ్. బాబిగాడు కిలకిల నవ్వసాగేడు.

ఆ [illegible]డికొడుకుల్ని ముచ్చటంగా చూస్తూ "అప్పుడే మొదలు పెట్టేరా వాడితో ఆటలు? ముందా బట్టలు మార్చి కాళ్ళూ, చేతులూ కడుక్కోండి. కాఫీ [illegible] ఉంటుంది మాధవి.

"వెధవ కాఫీ! వీకిపీ నువ్వు నవ్వుతుంటే వచ్చే ఉషారు, శక్తి ఏ కాఫీలో, ఏ హార్లిక్స్‌లో, ఏ బోర్నవిటాలో ఉన్నాయో చూపించు డియర్! వెధవ కాఫీ లేకపోతే చచ్చిపోతానా?"

"అహా! అలాగే నాల్గురోజులు కాఫీ భోజనం వగైరాలు మానేయండి [illegible] చూస్తూ. అప్పుడు తెలుస్తుంది అవి లేకపోతే బ్రతకగలరో, బ్రతక లేరో"

"ఓ యస్! పందెం కాస్తావా? అయితే అప్పుడు ఆఫీసు మానేసి నేనూ, ఇంట్లో పని మానేసి నువ్వూ ఎదురెదురుగా కూర్చోవాలి."

కొంగు అడ్డంపెట్టుకుని నవ్వాపుకుంది మాధవి.

విజయ్ కాఫీ, టిఫిన్ చేసి కొడుకుని తీసుకుని షికారు బయలుదేరాడు. మాధవి ఆలోచిస్తూనే వంట పూర్తిచేసింది. స్నానం చేసి చీర మార్చుకుని జడేసుకుని ముస్తాబయింది. ఆమెకు హఠాత్తుగా ఇందాక అత్తగారు వచ్చి చెప్పిన విషయం గుర్తుకొచ్చింది. ఆమె ఆలోచనలు అటు తిరగసాగేయి.

ఆమె అత్తవారు ఆ ఊళ్ళోనే ఉన్నారు. ఆమెకు ఒక బావగారు, ఇద్దరు మరదులు, ఇద్దరు ఆడబిడ్డలు, అత్తగారు ఉన్నారు. మామగారు పోయి చాలా కాలం అయింది. మొదట్లో మాధవి కూడా వాళ్ళందరితోనే కలిసి ఉండేది. మాధవిది చాలా సున్నితమైన మనసు. ఎటువంటి కష్టానికి అవమానానికి తట్టుకునే స్వభావం కాదు. ఏ మాటయినా నన్ను కాదులే అని సర్దుకోకుండా ఉండలేదు. అందరూ సామాన్యంగా తీసుకొనే నింద వాక్యమైనా ఆమె మనసుమీద తన ప్రభావం చూపించి ఆమె మనసుని గాయం చేస్తుంది. తనలో తను బాధ

పడడం, కుమిలిపోవడం తప్ప ఎదురుచెప్పే స్వభావం, పోట్లాడగలిగే ధైర్యం ఆమెలో ఏ కోశానా లేవు.

ఆమె మనస్తత్వాన్ని పెళ్ళయిన వారం పదిరోజుల్లోనే గ్రహించ గలిగిన విజయ్ ఆమెతో చాలా సున్నితంగా వ్యవహరించాలని ఎట్టి పరిస్థితుల్లోనూ కష్ట పెట్టకూడదని గట్టిగా అనుకున్నాడు. ఆమె రూపలావణ్యాల వల్లనో, చూచిన వేళావిశేషంవల్లనో ఆమెచేత పూర్తిగా ఆకట్టుకోబడ్డ విజయ్ ఆమెను కట్నం లేకుండానే పెళ్ళిచేసుకున్నాడు. ఆమెను పువ్వులా సుకుమారంగా, అపురూపంగా చూసుకోవాలని కలలు గన్నాడు.

కానీ, అతను అనుకున్నట్టు జరగలేదు. అత్తగారు సుందరమ్మ ఆమె కట్నం తేలేదని ఎప్పుడూ సూటీ, పోటీ మాటలతో సాధిస్తూనే ఉండేది. ఆమెకు పనిపాటలు సరిగ్గా రావని, తమకు రావలసిన లాంఛనాలు సరిగ్గా రాలేదని ఆడ బిడ్డలు ఎప్పుడూ సణుగుతూనే ఉండేవారు. మరిదులకి కూడా ఆమె మీద పెద్దగా ఇష్టమేమీలేదు. తోటికోడలు ఇంటిపనులకు ఆమెతో వంతు వేసుకొనేది. ఒక్కర్తే కూతురుగా, గారాబంగా, అరుచాటు సిందెలా పెరిగిన మాధవికి ఇటువంటి మనుష్యులుంటారని, ఇటువంటి పరిస్థితు లేర్పడతాయని తెలియదు. తండ్రిపోయి హఠాత్తుగా పరిస్థితులు తారుమారయి కట్నం ఇచ్చుకోలేని స్థితిలో విజయ్‌కి అర్ధాంగి అయింది.

ఎదురైన పరిస్థితులకి అసహాయంగా లోలోన కుమిలిపోవడం తప్ప ఏమీ చేయలేకపోయేది మాధవి. మొదట్లో తెలియకున్నా క్రమంగా ఇంటి పరిస్థితి అర్థంచేసుకున్నాడు విజయ్. ఎవ్వరినీ ఏమీ అనకుండానే మాధవితో వేరుకాపురం పెట్టేడు విజయ్. మాధవి ఎంత వారించినా, బ్రతిమాలినా వినలేదు.

దానితో ఇంట్లో అందరికీ మాధవిమీద మరీ కక్ష పెరిగిపోయింది. అత్త గారికి ఆమె బద్ధ శత్రువయిపోయింది. తన బిడ్డని తననుండి విడదీసిన రాక్షసిగా ఆమె మనసులో ముద్రపడిపోయింది. ఆ ఇంటికి వీళ్ళూ, ఈ ఇంటికి వాళ్ళూ వచ్చినా ఏదో చుట్టపుచూపుగా తప్పితే నిజమైన ఆపేక్షాభిమానాలు ఏ కోశానా లేవు. ఇలా జరిగినందుకు మాధవి ఇప్పటికీ బాధపడుతూనే ఉంది.

అయినా ఈ వేరుకాపురం పెట్టిన తరువాత ఎంతో హాయిగా ఆనందంగా, జీవితం ఒక వరంలా ఉంది. విజయ్, మాధవి ఏ అరమరికలూ లేకుండా పాలూ నీళ్ళలా కలిసిపోయారు.

తలుపు కొట్టిన చప్పుడుకి ఉలిక్కిపడి లేచివెళ్ళి తలుపు తీసింది మాధవి. చిన్న మరిది విశ్వం నిలబడి ఉన్నాడు.

"రా విశ్వం!" అంది.

"రావడానికి టైమ్ లేదు వదినా! ఉదయం మీరు వస్తున్నారో లేదో, అమ్మ కనుక్కొని రమ్మంది." అన్నాడు విశ్వం లోపలికి రాకుండానే.

"ఇంకా మీ అన్నయ్యతో చెప్పలేదు విశ్వం! ఆయనతో చెప్పి కబురు చేస్తాను," అంది. విశ్వం వెళ్ళిపోయాడు.

గడియ వేసొచ్చిన మాధవి నిట్టూర్చింది. పెద్దమరిది రామం పెళ్ళి నిశ్చయమైంది. ఆదివారం పెళ్ళి. పెళ్ళికూతురిది ఒక కుగ్రామం. వీళ్ళు ఒక రోజు ముందుగా ఆ ఊరు వెళితేగాని కుదరదు. మధ్యాహ్నం అత్తగారు వచ్చి చెప్పింది. 'మీకు దయఉంటే రండమ్మా! లేకపోతే మా ఖర్మనుకుంటాం. ఇంతే" అంటూ తనింకా ఏ మాటా చెప్పకముందే నిష్టూరాలాడి వెళ్ళింది. ఇప్పుడు మళ్ళీ ఈ కబురు. ఈ విషయం ఆయనతో మాట్లాడనే లేదింకా. ఆయనకు సెలవు దొరకదు. తనైనా వెళ్ళకపోతే అత్తగారు ఏమంటారు? తనను పంపడానికి విజయ్ ఇష్టపడతాడో ఇష్టపడడో.

ఆమె ఆలోచనల మధ్యలోనే వచ్చేశాడు విజయ్.

"వచ్చేశాం డియర్!" అంటూ మాధవిని గట్టిగా వాటేసుకుని బుగ్గ మీద ముద్దిచ్చేశాడు విజయ్. "ఛ! వదలండి. వాడు చూస్తున్నాడు." ముతారంగా విదిపించుకుంది మాధవి.

"అబ్బా! అమ్మ నాది." ఏమనుకున్నాడో బాబిగాడు మాధవి కాళ్ళు చుట్టేశాడు. మాధవి అతని వంక చూసి కొంటెగా నవ్వింది.

"కాదురా! అమ్మ నాది. నీ కొస్తుంది చూడు బుజ్జి పెళ్ళాం. అది నీది."

"ఊ! ఊ! ఊ! అమ్మ నాదీ.." రాగం తీశాడు బాబిగాడు.

మాధవి వాడిని చప్పున ఎత్తుకుంది. "ఏమిటండీ పసిపిల్లాడితో ఇలాగేనా మాట్లాడేది? సిగ్గులేకపోతే సరి." సుతారంగా విసుక్కుంటూ "లేదులే నాన్నా! అమ్మ నీదే. నాన్నను దెబ్బాదేశానుగా!" లోపలికి తీసుకెళ్ళిపోయింది మాధవి.

## 2

బాబిగాడికి అన్నం తినిపించి నిద్రపుచ్చింది మాధవి. వంటింట్లో విజయ్‌కి, తనకీ వడ్డించింది. విజయ్ అన్నం కలిపేడు. మాధవి కూర్చోబో

తున్నంతలో బాబిగాడు ఎందుకో లేచి ఏడుపు మొదలు పెట్టేడు. గబుక్కున లేచి వెళ్ళింది మాధవి. వాడిని జోకొట్టి నిద్రపుచ్చి వచ్చేసరికి ఇంకా విజయ్ అలాగే అన్నంముందు కూర్చుని ఉన్నాడు.

"ఇంకా మీరు అలాగే కూర్చున్నారేమిటి ? అన్నం తినడంలేదూ ?" ఆశ్చర్యంగా అడిగింది.

"ఊహూ ! క్రొత్తగా అడుగుతున్నావేమిటి ? నీకు పెట్టనిది నా కెలా తినబుద్ధి వేస్తుంది ?" అన్నం ముద్దచేస్తూ అన్నాడు విజయ్. అతను అన్నం తినేముందు మొదటి ముద్ద ఆమె నోట్లో పెట్టిగాని తినడు. అది వాళ్ళకి మొద ట్నుంచీ వస్తున్న అలవాటు.

"బాగుంది. ఇన్నాళ్ళూ అయితే మనిద్దరమే కాబట్టి ఎలా ఉన్నా సరిపో యేది. పిల్లలున్న తరువాత వాళ్ళతోపాటు వాళ్ళ అవసరాలు చూడాలి గదా ! ముందు నియమాలే పెట్టుకూర్చుంటే ఎలా ?

"ఏం ఫరవాలేదు డియర్ ! వాళ్ళ అవసరాలు చూసిన తరువాతనే తిందాం. ఈ లోపులో ఆకలికి చచ్చిపోతానా ఏం ?" అన్నంముద్ద ఆమె నోటి కందిస్తూ అన్నాడు.

"ఒకవేళ నేను లేకుండానే పోతే అప్పుడేం చేస్తారు ?" నవ్వుతున్నట్టుగా అంది మాధవి. విజయ్ ఉలిక్కిపడ్డాడు. అతని మొహం గంభీరంగా తయార యింది. "మధూ డియర్ ! అటువంటి మాటలు మన మధ్య ఎప్పుడూ రాకూడ దని నేనిదివరకే చెప్పేను." మాధవి మరేం మాట్లాడలేదు. భోజనాలయిపోయిన తరువాత విజయ్ గదిలోకి వెళ్ళిపోయాడు.

మాధవి వంటిల్లు సర్దుకుని వచ్చేలోపల విజయ్ ఆమెని నాలుగుసార్లు కేకేశాడు.

"అబ్బబ్బ ఏమిటండీ ? ఉన్నకొద్దీ మితిమీరిపోతున్నారు ? పనయిన తరువాత రాకుండా ఎక్కడికైనా పోతానా ఏమిటి ?" విసుక్కుంటూ వచ్చింది మాధవి.

"ఏం చెయ్యమంటావు మధూ ! నేను జయించనిదల్లా ఆ ఒక్క బల హీనతనే. ఆ వెధవ ఆఫీసులో ఎలాగడుపుతానో ఏమిటోగాని, ఇంట్లోఉన్నంత సేపూ నువ్వు నా ఎదురుగానే ఉండాలనిపిస్తుంది." ఆమెని చెయ్యిపట్టి మీదకి లాక్కుంటూ అన్నాడు విజయ్.

"సంతోషించాం గానీ, నే నీరోజు మీతో ఒక సంగతి చెప్పాలి !"

"నేనూ నీతో ఒక సంగతి చెప్పాలి."

"ఏమిటది?" లేచి సరిగ్గా కూర్చుంటూ అడిగింది మాధవి.

"మంచి హిందీ పిక్చర్ ఉంది. ఇప్పుడు మనం సెకెండ్ షోకి వెళ్ళాలి." ఆమె ముంగురులు సవరిస్తూ అన్నాడు.

"అంతేనా? ఇంకేమిటో అనుకున్నాను. సినిమా చూడకపోతే వచ్చే ప్రమాదమేమీ లేదు గాని ముందు నేను చెప్పేది వినండి"

"నో! నో! నువ్వు సినిమాకి 'ఎస్' అంటేనే నేను నువ్వు చెప్పేమాట వినేది. లేకపోతే ఆ హేమమాలిని రాత్రంతా నన్ను అల్లరిచేస్తూనే ఉంటుంది." పెంకిగా అన్నాడు విజయ్.

తాపీగా నవ్వింది మాధవి "మరేం ఫర్వాలేదు. నేను మీ పక్కనుండగా ఆ హేమమాలినికే కాదు మరే సువర్ణమోహినికి కూడా మీ కళ్ళోకొచ్చే ధైర్యం లేదని నాకు బాగా తెలుసు."

"ఏమిటో ఆ ధీమా నీకు?"

"ధీమానే. మావారు అపర శ్రీరామచంద్రులు...."

"నేనేం శ్రీరామచంద్రుడిని కాదు. నేనూ అమ్మాయిలను వెంటేసుకుని తిరగ్గలను తెలుసా?" కవ్వింపుగా అన్నాడు విజయ్.

ఫక్కున నవ్వింది మాధవి. "తిరగండి చూద్దాం. ఒకవేళ మీరు తిరిగినా ఆ అమ్మాయిలకి మీతో మరేం పనుందోలే అనుకుంటాను."

"అయితే నువ్వు నన్నెప్పుడూ అనుమానించవా?"

"కలలో కూడా అనుమానించలేనని మీకూ తెలుసు." అతని క్రాపును అప్యాయంగా సవరిస్తూ అంది మాధవి.

"ఒప్పుకున్నాం దేవీ! త్వరగా సినిమాకి తయారవు." అన్నాడు విజయ్.

"లేదండీ! ఇప్పుడు సినిమాకి బయలుదేరితే తెల్లవారుజామున ప్రయాణం చేయలేము."

"ప్రయాణమా?" ఆశ్చర్యంగా అడిగేడు విజయ్.

"ఔనండి!" అంటూ మరిది పెళ్ళి గురించి అత్తగారు చెప్పివెళ్ళిన సంగతి అన్నీ వివరంగా చెప్పింది మాధవి.

"ఎలా మధూ! నేను రావడానికి వీలవదు. నేను లేకుండా నువ్వొక్కదానివే వెళ్ళగలవా? వాళ్ళందరి దగ్గిరా నీకు ముందే చనువు లేదు."




"వెళ్ళకపోతే బావుండదండీ! మనం విరహం ఎంతోసేపు భరించనక్కర లేదు. మహా అయితే పన్నెండు గంటలు. నేను రేపు ఉదయం వెళితే రేపు ఆఫీసు అయాక రాత్రికెలాగూ మీరు నా దగ్గిరే ఉంటారు. ఆదివారం పెళ్ళి చూసుకుని అందరితోపాటు కలిసి వచ్చేయవచ్చు." పరిహాసంగా అంది మాధవి.

చివరికెలాగైతేం అయిష్టంగానే ఒప్పుకున్నాడు విజయ్. మాధవి ఉదయం వస్తున్నట్టు చెప్పడానికి తల్లిగారింటికి బయలుదేరాడు విజయ్.

## 3

విజయనగరం శ్రీకాకుళం మధ్య ఉందా పల్లెటూరు. పెళ్ళికూతురి తాతగారు నాయనమ్మ పొలాలు చూసుకుంటూ అందరూ పట్నం వెళ్ళిపోయినా ఆ పల్లెటూరిలోనే జరగాలని ఆ వృద్ధుల పట్టు. అన్నిటికీ ఇబ్బందిగా ఉన్నా ఆ వృద్ధుల మాట కాదనలేక ఇరుపక్షాలవారూ అంగీకరించేరు.

జంక్షన్‌లో బస్సు దిగేసరికి పెళ్ళివాళ్ళు ఎడ్లబళ్ళు పంపించేరు. ఆ బళ్ళు చూడగానే మాధవి మనసెందుకో కంపించింది. బళ్ళమీద అందరూ సర్దుకు కూర్చున్నతరువాత బళ్ళు బయలుదేరేయి. మాధవి ఉన్న బండిమీద ఇద్దరు ఆడబిడ్డలు, తోటికోడలు పిల్లలు కూర్చున్నారు. అత్తగారు కొడుకులు ఇంకొక బండిమీద కూర్చున్నారు. సదుపాయాలవీ సరిగ్గా జరగక ఇబ్బందవుతుందని పైవాళ్ళనెవరినీ పిలవలేదు వాళ్ళు.

అటు ఇటు పచ్చని పొలాలు, ప్రశాంతమైన వాతావరణం, మనసుని ఆహ్లాదపరిచే చల్లని చిరుగాలి ఉల్లాసంగా ఉంది అందరికీ. ఒకరిని ఒకరు పరిహాసాలతో, వేళాకోళాలతో, విసుర్లతో, సందడిగా, నవ్వులు కేరింతలతో దారి పొడుగునా సాగిపోతున్నాయి బళ్ళు. వాళ్ళలో వాళ్ళు పరిహాసాలాడుకుంటూ మధ్య మధ్య మాధవిని కూడా ఏదో అంటూనే ఉన్నారు. కానీ మాధవికి అవేమీ విన్పించడంలేదు. ఆమె ఎప్పుడో తన ఊహాసామ్రాజ్యంలోకి వెళ్ళిపోయింది. ఈ చల్లని వేళలో ఈ ప్రశాంతమైన పచ్చని ప్రకృతిమధ్య తన ప్రక్కన విజయ్ ఉంటే ఎంత బాగుండును అని ఆలోచిస్తూందామె. ఎంత మంది మధ్య ఉన్నా ప్రక్కన విజయ్‌లేని మాధవి ఎప్పుడూ ఒంటరిదే.

మామిడితోటలో ఉన్న పెంకుటింట్లో వాళ్ళ విడిది ఏర్పాటయింది. విడిదింటికి చేరేసరికి దీపాలవేళయింది. బడ్డిదీపాలు అలవాటులేక చీదరగా ఉంది. పిల్లల ఏడుపులు, గోల, పలకరించుకోవడాల సందడి, భోజనాల హడావుడి అంతా అయి సద్దుమణిగేసరికి తొమ్మిదయింది టైము. ఈ గడిబిడలో తనకేం సంబంధంలేనట్టు బయట అరుగుమీద కూర్చొని మామిడితోటంతా పరుచుకుని పుచ్చపువ్వులా కాస్తున్న వెన్నెలని చూస్తూ కూర్చుంది మాధవి. ఎదురుగా ఉన్న రెండు కొబ్బరిచెట్ల ఆకులు భూమికి తాకుతూ వెన్నెలని భూమిమీదికి ప్రవహింపజేస్తున్నాయి. పిల్లలకి కూడా అందేలా ఉన్న మామిడి కాయలు వెండిపూత పూసినట్టుగా మెరుస్తున్నాయి. మాధవికి విజయ్‌తో కలసి ఆ వెన్నెల్లో ఆ మామిడితోటంతా తిరిగి రావాలన్పిస్తూంది. ఇంకా రాని విజయ్ కోసం ఆమె మనసు విసుక్కుంటూంది. నిరీక్షణా భారంతో ఆమె కన్నులు వాలిపోతున్నాయి.

మగవాళ్లంతా మామిడిచెట్ల క్రిందకి చాపలు, మంచాలు చేర్చుకుంటున్నారు.

మాధవి దగ్గరకి హడావుడిగా వచ్చింది తోడికోడలు లక్ష్మి.

"చూడు మధూ! ఇప్పుడేమయిందో. ఏ పనికీ పనీ కుదరలేదు. మనం అనుకున్నట్టు ఉదయం బయలుదేరి ఉంటే మధ్యాహ్నం చేరుకుని అన్నీ చూసుకోవడానికి వీలవును. అప్పుడేదో కుదరక మధ్యాహ్నం బయలుదేరి ఈ వేళకి చేరుకున్నాం .."

"కాస్త ఆపు లక్ష్మీవదినా! నువ్వు చెప్పేదేమైనా చిన్నాదిన వింటున్నదంటావా? ఆమె మనసెప్పుడో అన్నయ్యదగ్గర కెళ్ళిపోయింది. ఈ కాస్తలో

అన్నయ్య నెవరైనా ఎత్తుకుపోతారేమోనని భయం పాపం. ఆయనగారు రావాలి. ఈమెగారి మనసు కుదుటపడాలి." చిన్నాడబిడ్డ జయ మాటలకి తిరిగి చూసి నవ్వింది మాధవి.

"హుం!" నిట్టూర్చింది లక్ష్మి. "నీ కేమమ్మా మధూ! అదృష్టవంతు రాలివి. ఇంకా మా మరిది ఇలా మాతో పంపుతాడనుకోలేదు. ఆ టైమ్‌కి మేమే స్కూటర్‌మీద వచ్చేస్తాంలే అని చెపుతాడనుకున్నాను. ఏం మంత్రం వేశావో నువ్వు గీచినగీటు దాటడు మరిది. మొగుడూ పెళ్ళాలంటే అలా ఉండాలి. ఎందుకూ మేమూ ఉన్నాం, ఎన్నాళ్ళయినా ఎప్పుడూ తగువులూ తంటా లూను..." అత్తగారు పిలవడంతో అప్పటికి ఆ వాగ్ధోరణి ఆపి లోపలికెళ్ళింది లక్ష్మి, జయ కూడా అక్కడనుండి వెళ్ళిపోయింది.

నవ్వుకుంది మాధవి. తన అన్యోన్యతమీద వాళ్ళకెప్పుడూ ఈర్ష్యే అని బాగా తెలుసు మాధవికి. అందుకే రాను రాను వాళ్ళ ఈర్ష్యాసూయలను చూచి బాధపడ్డం మానేసి గర్వపడడం అలవాటు చేసుకుంది మాధవి.

"విజయ్ వచ్చేస్తున్నాడు." ఎవరో గట్టిగా అరవడంతో కళ్ళుతెరిచే కలలు కంటున్న మాధవి ఇహలోకంలో వచ్చింది. నిజమే. దూరంగా స్కూటర్ చప్పుడు. ఆమె మనసు స్పందించింది. ఆమె మొహంలో ఆనందం ఉవ్వెత్తుగా పొంగుకొచ్చింది. మరుక్షణం మామిడిచెట్ల మధ్యనుండి రయ్‌మంటూ దూసుకు వచ్చింది స్కూటర్.

కళ్ళనిండా సంతోషాన్ని నింపుకుని ఆతృతగా అటే చూస్తున్న మాధవి శరాఘాతం తిన్నదానిలా హఠాత్తుగా స్తంభించిపోయింది. విజయ్ వెనకాల అతని భుజంమీద సుతారంగా కూర్చుని ఉంది ఒక అందాల బొమ్మ.

"విజయ్‌తో ప్రియకూడా వచ్చిందర్రా!" ఎవరో ఉషారుగా అరిచేరు. మరుక్షణం ప్రియ వచ్చింది, ప్రియ వచ్చింది అనే వార్త గగ్గోలుగా మారి అందరికీ చేరిపోయింది. లోపలేవో పనులుచూస్తున్న సుందరమ్మగారితో సహా అందరూ ఎక్కడివి పనులక్కడ వదిలేసి గబగబా ఆగిన స్కూటర్‌చుట్టూ మూగి పోయారు. అందరూ అతిశ్రద్ధగా, ఎంతో ఆప్యాయంగా ప్రియని పలుకరిస్తు న్నారు. ఖరీదైన తెల్లని షిఫాన్‌చీరలో, ముత్యాల నగల అలంకరణలో, జుట్టుని వదులుగా రిబ్బన్‌కట్టి వదిలేసి అతి అధునాతనంగా దంతపు బొమ్మలా మెరిసి పోతూంది ప్రియ. అందరికీ నవ్వుతూ సమాధానాలు చెప్తూంది. ఆమె ప్రక్కనే నిలబడ్డ విజయ్‌కళ్ళు మాధవికోసం వెదకసాగేయి.

ప్రియని చూసిన సుందరమ్మగారు బుడిబుడి రాగాలుతీస్తూ ఆమె చెంపలు, ఒళ్ళు అప్యాయంగా నిమరసాగింది. "ఎలాంటిదానివి ఎలా అయిపోయావే తల్లీ! ఆ మాయదారి దేవుడు నీ కెంత కష్టం పెట్టేడే. నువ్వసలు వస్తావను కోలేదే ప్రియా! నువ్విలా రావడం నా మనసుకెంత ఆనందంగా ఉందో తెలుసా?...."

"మీ రింకా బయలుదేరరని, మీతో కలిసిరావచ్చని నేను విజయనగరం వచ్చేను అత్తయ్యా! తీరా వస్తే మీరు వెళ్ళిపోయారని తెలిసింది. అప్పుడు ఇదిగో ఈ విజయ్‌బావ ఇంటికి వెళ్ళేను. వాళ్ళయినా ఉంటారేమోనని. బావ ఇంకా అప్పుడే బయలుదేరుతున్నాడు. సమయానికి వచ్చేనులే అనుకుని బావతో కలిసి వచ్చేశాను." అంది ప్రియ.

"పోన్లే తల్లీ! మంచిపని చేశావు. మీ యిద్దరూ ఇలా కలిసి రావడం చూస్తుంటే నా కెంత కన్నుల పండుగగా ఉందో తెలుసా? ప్చ్! ఏమిటో ఆ మాయదారి దేవుడు కానిచ్చేడు కాదుగాని మీ ఇద్దరిదీ ఎంత చూడముచ్చటైన జంటో. ఇంత అదృష్టం దొరకడానికి వాడికి ప్రాప్తి ఉండొద్దూ? వాడో దరిద్రుడు... "

ఈ మాటలన్నీ దూరంగా ఉన్న మాధవికి వినబడుతూనే ఉన్నాయి. ఆమె గుండెల్లో శూలాల్లా దిగుతూనే ఉన్నాయి. ఆమె మనసు కలవరపడి పోతూనే ఉంది. విజయ్, ప్రియ అలా స్కూటర్ మీద రావడం, ప్రక్క ప్రక్కనే నించోవడం ఈదృశ్యాలు ఆమె కెంతో కంటకంగా, భరించలేనట్టుగా ఉన్నాయి. ఛ! అది తప్పు. అంత మాత్రానికే తనిలా ఫీలవకూడదు. మనసుకి నచ్చజెప్పకోచూచింది.

ఈ ప్రియ ఎవరో మాధవికి త్వరగానే గుర్తుకు వచ్చింది. ప్రియ సుందరమ్మగారి అన్నకూతురు. అయనగారికి ప్రియ ఒక్కతే సంతానం. కట్టుకుపోయినంత ఆస్తి. చిన్నప్పుడంతా సుందరమ్మగారి పిల్లలూ, ప్రియా ఒక్కదగ్గరే కలిసి పెరిగేరు. విజయ్‌కి, ప్రియకి ఈడూ, జోడూ బాగుం టుందని ఇద్దరికీ పెళ్ళి జరపాలని అనుకున్నారు. ప్రియా, విజయ్‌లిద్దరూ యుక్తవయస్కులయేదాకా కూడా అలాగే అనుకుంటూ వచ్చేరు. కానీ ఆ సంవత్సరం పొలంగట్ల వద్ద సుందరమ్మ భర్తకి, అన్నగారికి మాటామాటా పెరిగి పెద్ద తగాదాగా మారి, కొట్లాటవరకూ కూడా వచ్చింది. నువ్వెంతంటే నువ్వెంత అనుకున్నారు. ఆ ఊషన పంతానికిపోయిన ప్రియ తండ్రి ప్రియని

ఒక పెద్ద ఆస్తిపరుడికిచ్చి వివాహం చేసేశాడు. ఆ సంవత్సరమే కలరా సోకి అతడు పోయాడు. ప్రియకి తల్లి చిన్నప్పుడే పోయింది. సుందరమ్మగారే ఆమెని పెంచి పెద్దచేసింది. తండ్రి పోయిన తరువాత ఆ ఆస్తి కూడా ప్రియకే వచ్చింది. ఆమెకి ఆస్తికి, ఐశ్వర్యానికి, సుఖభోగాలకి ఏమి కొదువలేదు. కానీ విధే చిన్నచూపు చూసింది. రెండేళ్ళు కాపురంచేశాక, ప్రియ ఒక పాపకి తల్లి అయాక ఆమె భర్త గంగాధరం కూడా ఏదో విషజ్వరం సోకి చనిపోయాడు.

కట్టుకుపోయినంత ఆస్థి, ఆ ఆస్థిని దోచుకోవాలని అనుక్షణం ప్రయత్నించే రాబందులు తప్ప నా అనే దిక్కు లేనిదైంది ప్రియ. ఇక సుందరమ్మ చూస్తూ ఊరుకోలేకపోయింది. తను వెళ్ళి మేనకోడలిని తీసుకొచ్చి నాలుగు రోజులు తన ఇంట ఉంచుకుని ఊరడించింది. మాధవి ప్రియని అప్పుడే చూసింది ప్రియ పరిస్థితికి చాలా బాధపడింది. జాలిపడింది. ఎంతో సానుభూతి కూడా చూపించింది.

## 4

బాబిగాడెందుకో ఉన్నట్టుండి ఏడ్వమన్నాడు. మాధవి ఆలోచనలని కట్టిపెట్టి వాడి దగ్గరకెళ్ళి మీద చెయ్యివేసి ఉలిక్కిపడింది. జ్వరంతో ఒళ్ళు పేలిపోతూంది వాడికి. నిద్రలో మూలుగుతున్నాడు. ఉండుండి ఉలికులికిపడు తున్నాడు. ఆత్రుతగా వాడినెత్తి ఎత్తుకుంది. అసలే చిరాగ్గా ఉన్న మాధవి మనసు ఇప్పుడు మరీ కల్లోలంగా తయారయి అసహనంగా ఉంది.

విజయ్ వచ్చి గంటపైగా అయినా ఇంకా తన దగ్గరకు రానేలేదు. అన్నదమ్ములు, ప్రియ, చెల్లెళ్ళు, తల్లి సమావేశమై కబుర్లాడుకుంటూంటే వాళ్ళతోపాటు తనూ కబుర్లాడుతూ ఉండిపోయాడు. మరో పావుగంట తరువాత విజయ్‌కి, ప్రియకి పెళ్ళివారింటి నుంచి భోజనాలు వచ్చేయి. ధనవంతురాలు, ఆత్మీయురాలు అయిన ప్రియని అందరూ ఎంతో గౌరవంగా, ఆదరంగా, కాలు క్రింద మోపితే కందిపోతుందేమో నన్నంత అపురూపంగా చూడసాగేరు.

భోజనం అయిన తరువాత మాధవి దగ్గరకి వచ్చేడు విజయ్. ఆతడి వెనుకే ప్రియ కూడా వచ్చింది.

"హలో మాధవీ! బాగున్నారా? ఇందాకట్నుంచీ మీ రికక్రింద కూర్చు న్నారా? మీ బాబు పెద్దవాడయ్యేడే!" అంది ప్రియ కనీసం బాబిగాడిని తాకను కూడా తాకకుండానే.

"కానండీ! ఏళ్ళు గడుస్తుంటే పెద్దవాళ్ళుకాక ఇంకా చిన్నగానే ఉంటారా? మీ పాప కూడా పెద్దదయే ఉంటుంది. తీసుకురాలేదా?" అంది మాధవి.

"లేదండి! దానికి నా దగ్గిరకంటే అయాదగ్గిరే చేరిక ఎక్కువ..."

మాట్లాడుతున్న మాధవీ, ప్రియలవంక ఒక్క క్షణం నిశితంగా చూశాడు విజయ్. ఖరీదైన బట్టల్లో, విలువైన ఆభరాణాలతో సహజ సౌందర్యానికి విపరీతమైన ఆకర్షణ కూడా తోడవడంతో దేవకన్యలా వెలిగిపోతున్న ప్రియ ముందు వెంకటగిరి జరీచీరలో పుస్తెలగొలుసూ, నల్లపూసల గొలుసూ, చేతులకి మట్టిగాజులమధ్య రెండేసి బంగారుగాజులు వేసుకున్న మాధవి అతిసామాన్యంగా, వెలవెలబోతున్నట్టుగా ఉంది. కానీ పరీక్షగా చూస్తే ఎవరి మనసైనా ప్రియ నవనాగరీకంలోని ఆకర్షణశక్తికంటే మాధవి నింపుతనంలోని ప్రశాంతత వైపే మొగ్గు చూపుతుంది.

తెల్లవారి ఆదివారం. ఉదయం పదిగంటలకి పెళ్ళి నిర్విఘ్నంగా జరిగి పోయింది. బాబిగాడికి జ్వరం కాస్త తగ్గి ఆడుకోవడంతో మాధవి మనసు కాస్త ప్రశాంతించి తను కూడా పెళ్ళిహడావుడిలో ఉత్సాహంగా పాల్గొంది. ప్రియ వితంతువైనా ఏమాత్రం సంకోచం లేకుండా పెళ్ళి తంతులన్నిటిలోనూ తల దూర్చింది. అంతా తానేఅయి తిరిగింది. ఆమె నెవరూ వారించనూ లేదు ఆమె ఏపని చెయ్యడానికైనా అభ్యంతరమూ పెట్టలేదు. ఆ క్షణంలో అందరూ ఆమె ఒక వితంతువనీ, వితంతువులు పెళ్ళిళ్ళలో దూరంగా ఉండాలనే విష యాన్ని పూర్తిగా మర్చిపోయినట్టున్నారు.

పెళ్ళితంతులు ముగిసిన తరువాత భోజనాల టైమ్ అయింది. ఇక భోజనాల హడావుడి ప్రారంభమై భోజనాలు పూర్తి అయేసరికి మధ్యాహ్నం మూడు గంటలయింది. ఆ మరునాటి ఉదయం బయలుదేరి విజయనగరం చేరేలాగ నిర్ణయించుకున్నారు. భోజనా లయిన తరువాత అందరూ పెళ్ళికూతురి తాలూకు పొలాలు, తోటలు చూడ్డానికి బయలుదేరేరు. మాధవి మాత్రం బాబిగాడికి ఒంట్లో బాగులేకపోవండవల్ల విడిదింట్లోనే ఉండిపోయింది.

## 5

చెట్లనిండా ఎఱ్ఱగా పండిన మిరపచేలు కన్నుల పండువుగా ఉన్నాయి. విశాలంగా, నిశ్శబ్దంగా కనుచూపుమేర వరకూ ఎరుపూ, ఆకుపచ్చ రంగులు







కలబోసినట్టున్న ఆ ప్రదేశం ఎంతో అందంగా ఉంది. అక్కడంతా తానే ఏండి రాజ్యంచేస్తున్న చిరుగాలి కమ్మని పచ్చిమిరప వాసనలను మోసుకొస్తూంది. పొలంగట్లు కాస్త విశాలంగా ఉండి దట్టంగా పచ్చగడ్డి మొలచి చూడగానే అక్కడ కూర్చోవాలనిపించేలా ఉన్నాయి.

చల్లని సాయంకాలం వీస్తున్న చల్లనిగాలితో మరీ చల్లగా ఉంది. పొలం గట్టుమీద అలవోకగా తలక్రింద చెయ్యి పెట్టుకుని పడుకున్నాడు విజయ్. అతనికి దగ్గరగా మొకాళ్ళచుట్టూ చేయి బిగించి మొకాళ్ళ మీద గెడ్డమాన్చి కూర్చుంది ప్రియ. అందరితోనూ కలిసివచ్చిన ప్రియా, విజయ్ లిద్దరూ ఏవో చిన్ననాటి విషయాలన్నీ మాట్లాడుకుంటూ మాటల్లో అందరికీ దూరంగా వచ్చేశారు. వాళ్ళు ఇంకా ఏవో మామిడితోటలవీ చూస్తూ చాలా వెనకబడి ఉన్నారు.

ఇద్దరూ ఇలా దగ్గరగా ఉంటూ చిన్నప్పటి విషయాలు నెమరువేసుకుంటూంటే అప్పటి ఆత్మీయత తిరిగివచ్చిన అనుభూతి ఇద్దరూ పొందసాగారు.

"బావా ! నేను ఇప్పుడే శ్రీకాకుళం వెళ్ళిపోతున్నాను. నాతోపాటు నువ్వూ కూడా రావాలి " ఆజ్ఞాపిస్తున్నట్టుగా అంది ప్రియ.

"బావుంది," నవ్వేడు విజయ్. "లేడికి లేచిందే ప్రయాణ మన్నట్టుంది నీ ప్రయాణం. రేపందరం కలసి విజయనగరం వెళ్ళిపోతాంగా. అక్కడి

నుండి వెళ్ళిపోదువులే శ్రీకాకుళం. అక్కడంతగా నీకు మునిగిపోయే రాచ కార్యాలేమున్నాయి? నువ్విప్పుడెళ్ళిపోతే అమ్మ ఊరుకుంటుందా అసలు?"

"ఏమో! నా కదంతా అనవసరం. నా కిక ఉండాలన్పించడం లేదు. మీ అందరి మధ్యా ఉంటే నా హృదయం ఎంతో బరువుగా, చెప్పలేనంత వ్యధగా ఉంది. ఏడ్చేయాలని ఉంది. నేను త్వరగా ఇంటి కెళ్ళిపోవాలి బావా! కడుపు తీరా ఏడ్చేయాలి ఈ బరువంతా దింపుకోవాలి...."

"ఎందుకు ప్రియా అలా బాధపడతావు? వీళ్ళందరూ నీ వాళ్ళు. నీ వాళ్ళ మధ్య ఉంటే నీకు ధైర్యంగా, ఓదార్పుగా లేదా?" ఆమెవంక సానుభూతిగా చూస్తూ అడిగేడు విజయ్.

"లేదు బావా! అలా లేదు. నేను పోగొట్టుకున్న అదృష్టం నన్ను వెక్కిరిస్తూంది. వీళ్ళలో నీ స్థానం, వీళ్ళతో నీ బంధం ఎవరో బంధువుగా మాత్రమేనని నొక్కి నొక్కి చెబుతుంది. ఇలా వీళ్ళ మధ్య ఈ క్షోభ భరిస్తూ ఉండేకంటే నా చీకటి బ్రతుకులోకి పారిపోవడమే మంచిదన్పిస్తూంది." ఆవేశంగా చెబుతున్న ప్రియకళ్ళు నిండుకున్నాయి.

విజయ్ మనసు ఆమెపట్ల సానుభూతితో, జాలితో నిండిపోయింది. అనునయంగా ఆమె చేతిని తన చేతిలోకి తీసుకున్నాడు.

"ప్రియా! గతం మర్చిపోవాలి. అలా బాధపడుతూ ఎంతకాలం గడుపుతావు? పాప భవిష్యత్తు నీ చేతుల్లో ఉంది. అది ఆలోచించు. నువ్వు మునుపటిలా ఆనందంగా, హాయిగా ఉండాలి ప్రియా! నువ్వు సుఖంగా ఉండడానికి నేనేం చేయగలిగినా చేస్తాను. చెప్పు ప్రియా!"

నీళ్ళు నిండిన ప్రియకళ్ళు ఒక్కసారి తళుక్కుమన్నాయి.

"ఒక్కసారి నువ్వు నాతో రావాలి బావా! అంతే. అంతే నేను కోరేది. నా అనుకునే ఆత్మీయుడి సమక్షంలో నా కష్టసుఖాలన్నీ చెప్పుకోవాలని ఉంది. కరువు తీరా ఏడవాలని ఉంది. వ్యాపారాల్లో జరిగే మోసాలు నీకు చూపించాలని ఉంది. ఈ పాడు ఆస్తికారణంగా నన్నేలాంటి రాబందులు ఏ విధంగా పీక్కుతింటున్నాయో చూపించాలని ఉంది. ఒక్కసారి, ఒక్కసారి ఈ క్షణంలోనే నాతోపాటు రావాలి బావా!" ఎంతో అర్థింపుగా అతని రెండు చేతులూ పట్టుకుని దీనంగా అడిగింది ప్రియ.

తటపటాయిస్తున్నట్టుగా చూశాడు విజయ్. ప్రియని కాదనాలన్పించడం

లేదు. అయినా మాధవిని ఇక్కడ విడిచి ప్రియవెంట వెళ్ళాలని కూడా అన్పించ లేదు.

"ఏం బావా ఆలోచిస్తున్నావు?" ఆతృతగా అడిగింది ప్రియ.

"బాబు ఒళ్లో బాగుండలేదు ప్రియా. మధుని అడగలేదు. ఆమె ఏమంటుందో. మధుని ఒంటరిగా ఇక్కడ వదిలి... "

"ఒంటరిగా ఎందుకుండి బావా? అత్తయ్య వాళ్ళు ఉన్నారుగా. బాబుకు వచ్చినప్పుడు టాబ్లెట్స్ కూడా తీసుకొద్దువు బయల్దేరు బావా! ఇదిగో ఈ పొలాలు దాటితే రోడ్డు. అక్కడ ఏదో బస్సుపట్టుకుని పోదాం. మళ్ళీ రాత్రి పదిమిదీ, కొమ్మెడి కల్లా వచ్చేద్దువు గాని. ఏమంటావు?"

"చెప్పకుండా వెళితే మధు బాధపడుతుంది ప్రియా! ఎంతమంది మధ్య ఉన్నా నేను దగ్గర లేకపోతే ఒంటరిగానే ఫీలవుతుంది"

ప్రియ పట్టుకున్న అతని చేతుల్ని విసురుగా వదిలివేసింది. "ఎంతసేపూ మధు మధు, మధు. అన్నీ సవ్యంగా జరిగితే ఆ మధు స్థానం నాదవవలసింది. ఎంత పరాయిదాన్నయిపోయాను బావా! జీవితమంతా ఆమెకే వెచ్చించిన నువ్వు ఒక్క గంట నాకోసం ఖర్చుపెట్టలేవా? అవును బావా! అందరూ అంతే. ఎవరి భార్య, ఎవరి పిల్లలు వాళ్ళకెక్కువ. వాళ్ళ తరువాతనే నాలాంటి అభాగిని గురించి ఆలోచిస్తారు. నా కెవ్వరూ లేరు బావా! నేను ఒంటరిదాన్ని. నా కెవ్వరికీ అక్కరలేదు." రెండు చేతుల్లో మొహం దాచుకుని హృదయ విదారకంగా ఏడవసాగింది ప్రియ

విజయ్ కంగారుపడ్డాడు. ఎంతో ఆవేదన చెందేడు. అతనా క్షణంలో ఇంకేం ఆలోచించలేకపోయాడు. అనునయంగా, అప్యాయంగా ఆమె భుజం మీద చెయ్యివేశాడు "ఊరుకో ప్రియా! నేను నీతో వస్తున్నాను. సరేనా." అన్నాడు.

"నిజమా?" అన్నట్టు కళ్ళెత్తి చూసింది ప్రియ. అతను ఆమె కళ్ళు తుడిచేడు. ఆ క్షణంలోనే వాళ్ళు రోడ్డుమీదికి వచ్చేసి మాధవితో చెప్పకుండానే శ్రీకాకుళం బస్సెక్కేరు.

## 6

శ్రీకాకుళంలో బస్సు దిగగానే బస్సు స్టాపుకి కొంచెం దూరంగా ఉన్న ప్రియా క్లాత్ సెంటర్‌కి తీసుకువెళ్ళింది విజయ్‌ని ప్రియ. టౌన్ మొత్తంమీద పెద్ద బట్టలకొట్టది. కొట్టంతా తిప్పి చూపించింది. నలుగురు గుమాస్తాలు,

ఇంకా సేల్స్‌మెన్ ఉన్నారు. తన యజమానురాలు ప్రియతోపాటు ఎవరో కొత్త యువకుడు రావడం, ఆమె అతనికి అన్నీ వివరంగా చెప్పడం, అతి శ్రద్ధగా చూపించడంతో అందరిలోనూ ఎంతో కుతూహలం రేగింది.

"ఎలా ఉంది కొట్టు?" రోడ్డుమీదకొస్తూ అడిగింది ప్రియ.

"చాలా బాగుంది. గుమాస్తాలు చాలా మంచివాళ్ళలాగానే ఉన్నారు."

"హుఁ!" పేలవంగా నవ్వింది, "పైకందరూ మంచివాళ్ళే. అతి వినయం చూపిస్తారు. ఈ గుమాస్తాలు గుంటనక్కలు. ఎందికొత్తున్లా ఎంత దోస్తున్నారో. వాళ్ళ లెక్కల్లో ఎన్ని చిక్కులున్నాయో ఆ బ్రహ్మదేవుడికి కూడా అర్థంకాదు. వాళ్ళు చేసేవన్నీ మోసాలు. ఎప్పుడైనా లెక్కలు చూపించమంటే చూపిస్తారు. ఆ లెక్కలు ఎంత గింజుకున్నా అర్థంకావు. ఒకదానికొకటి సంబంధం ఉండదు. ఆ చిక్కులు విడదీసి వాళ్ళని నిలదీసే ఓపిక, అంత సమర్థత నాకు ఉండవు. విపరీతమైన తలనొప్పి వచ్చేస్తుంది. ఎలాగో ఉండనియ్యిలే అని ఆ పుస్తకాలన్నీ మూసేస్తాను. ఆయిల్‌మిల్లు ఉంది చూస్తావా? అక్కడ ఇంతకంటే డబల్."

"వద్దులే. ముందు ఇంటికి వెళదాం. ఇప్పుడు చూసినంత మాత్రం చేసేదేముంది?" నిరాసక్తంగా అన్నాడు విజయ్.

"ఔనులే. ఏదో నా మాట కాదనలేక వచ్చి చూసి వెళ్ళిపోయేవాడివి. చూసి మాత్రం ఏం చేస్తావులే" నిర్వేదంగా అంది ప్రియ.

"నే నందుకోసం అనలేదు ప్రియా! ఇప్పుడు చూసినా ఈ క్షణంలోనే ఏం చేసేయలేంగదా! అన్నీ సక్రమంగా జరగాలంటే కొంత టైమ్ పడుతుంది గదా! ఊఁ! అక్కడ పరిస్థితులేమిటో చెప్పు?"

"ఆ ఆయిల్‌మిల్లుని మావారు, వారి ఫ్రెండ్ కలిసి పెట్టారు. ఆయనున్నంతవరకూ ఆ స్నేహితుడు అన్నీ నమ్మకంగా, సక్రమంగానే చేసేవాడు. ఇప్పుడేవేవో చెబుతాడు. నష్టాలు చూపిస్తాడు. ఏమైనా అంటే నూనెగింజలవీ విపరీతంగా రేట్లు పెరిగిపోయాయంటాడు. పైగా అప్పులు చేయవల్సి వస్తున్నదంటాడు. పైవాళ్ళేమో మీ మిల్లు బ్రహ్మాండంగా నడుస్తున్న దంటున్నారు. నాకేమీ అర్థంకావడంలేదు. ఒకవేపు మా వారి తరపువాళ్ళు నా చుట్టూ చేరడానికి వల పన్నుతున్నారు. వీళ్ళందరూ ఏకమై నన్నొక్కదాన్ని ముంచేస్తారో ననిపిస్తూంది." మౌనంగా వింటున్నాడు విజయ్. మాట్లాడుకుంటూనే ఇల్లు చేరుకున్నారు. ఇంటిని పరిశీలనగా చూడసాగేడు విజయ్. అదే మొదటిసారి

అతని ఇంటిని చూద్దాం. చాలా పెద్ద భవనం అది. అందంగా, విశాలంగా, చాలా అధునాతనంగా ఉంది. అంత ఇంట్లో ఉండేది ప్రియ, పాప, ఆయా. అంతే.

"ఏం ఇంత సేపూ డోర్ కొట్టేసినట్టున్నావ్. లోపలికి రా బాబా!" లోపలి కడుగుపెడుతూ పిలిచింది ప్రియ. ప్రియ వెంట లోపలికెళ్ళాడు విజయ్. ఇంట్లో కూడా ఏ మూల చూసినా ఖరీదైన ఫర్నిచర్‌తో, అందమైన అలంకరణతో అధునాతనంగా ఉంది.

"మమ్మీ!" అంటూ మూడేళ్ళ పాప పరుగున వచ్చి ప్రియ కాళ్ళకి చుట్టేసింది. ఆమె కుచ్చెళ్ళలో మొహం దాచుకుని విజయ్‌వైపు దొంగ చూపులు చూడసాగింది. ప్రియ పాపని ఎత్తుకుంది. పాప తల్లి చెవిలో గుసగుసగా ఏదో అంది.

"ఓ అదా! ఈయన నీకు డాడీ అవుతారమ్మా!" నవ్వుతూ చెప్పింది ప్రియ. విజయ్ ఉలిక్కిపడ్డాడు. ప్రియ అతనివంక ఓరగా చూసింది.

పాపకి వెంటనే తనకి తెలిసిన పిల్లలు ఎలా తమ డాడీలదగ్గర ముద్దుగా ఉంటారో గుర్తుకొచ్చింది. "డాడీ!" అంటూ విజయ్ దగ్గరికి చేరింది. విజయ్ ఆమెని ఎత్తుకున్నాడు.

"ఏం బాబా? తండ్రికోసం అలమటిస్తున్న పిల్లచేత డాడీ అని పిలిపించుకోవడానికి నీకేమైనా బాధగా అనిపిస్తోందా?"

"ఛ, ఛ! అలాంటిదేం లేదు ప్రియా. పసిపిల్లలకి దేవుడిచ్చిన లోటు తీర్చగలగడం మన చేతుల్లో లేకపోయినా, ఈ విధంగానైనా వాళ్ళ మనసులకి ఊరట కలిగించడం మంచి పనే." అన్నాడు విజయ్.

వంటమనిషిని కేకేసి భోజనాల ఏర్పాటు చెయ్యమంది ప్రియ. విజయ్‌కి ఇల్లంతా చూపిస్తూ తన ఆస్తి వివరాలు, వాటాదారులు, దాయాదులు చేస్తున్న మోసాలు, పన్నుతున్న కుట్రలు ఇవన్నీ ఏకరువు పెట్టింది. ఉన్న స్థిరాస్తి కాకుండా బేంక్‌లో కేష్ ఎంతుందో లెక్కలు చెప్పింది. ఇవన్నీ ఆమె తన కెందుకు చెప్తోందో అర్థంకాలేదు విజయ్‌కి. ఏదో చెప్తోందిలే అని వినేశాడు.

భోజనాలయేసరికి టైమ్ తొమ్మిదయింది. విజయ్ మనసు మాధవికేసి లాగుతోంది. ఆమె ఏంచేస్తోందో, బాబుకెలా ఉందోననే ఆరాటంతో అతని మనసు కొట్టుకులాడుతోంది.

ప్రియ విజయ్‌ని తన భర్త గదిలోకి తీసుకొచ్చింది. ఆ గది ఆమె విశ్వం వాడుతూనే ఉంది. శుభ్రంగా, అందంగా ఎక్కడివక్కడ అమర్చి ఉన్నాయి. రేడియోగ్రాము, డ్రెస్సింగ్ టేబుల్, ఫోమ్‌బెడ్ మొదలయినవన్నీ ఉండి అన్ని గదులకన్న ప్రత్యేకంగా ఉంది. కిటికీ కర్టెన్లు, పక్కబట్టలు, సోఫాకవర్లు అన్నీ నీలం రంగువే ఉండి. నీలం రంగు లైట్ డిమ్‌గా వెలుగుతూ చాలా అద్భుతంగా, ఏదో లోకంలో ఉన్నట్టుగా ఉంది. ప్రియ నీలంలైట్ ఆర్పి ట్యూబ్‌లైట్ వేసింది. ఫేన్ ఆన్‌చేసింది. కిటికీ కర్టెన్స్ పక్కకి లాగింది.

గోడలకి రకరకాల ప్రకృతిదృశ్యాల పెయింటింగ్స్ మధ్య ప్రియా, గంగాధరంల పెళ్ళిఫొటో ఉంది. చూడగానే చక్కని జంట అన్పిస్తుంది ఎవరికైనా. పెళ్ళిఫొటోకేసి రెండు క్షణాలు నిదానంగా చూసిన విజయ్ ప్రియవంక పరిశీలనగా చూశాడు

పెళ్ళి ఫొటోలో ఆభరణాలతో, పెళ్ళికళతో, కళ్యాణపు బొట్టుతో నిండుగా ఉన్న ప్రియకి, నాజూకుగా అలంకరించుకుని నుదుటన చిన్న నల్లని చుక్కబొట్టు పెట్టుకుని జుట్టుమొదట బాండ్ పెట్టుకుని, కన్నెపిల్లలా అలంకరించుకున్న ప్రియకి ఎక్కడా పోలిక లేదనిపించింది. ఫొటోలో ఉన్న ప్రియ కంటె ఈ ప్రియ చాలా చిన్నదానిలా, అసలు బరువు బాధ్యతలే లేని చిలిపి పిల్లలా కన్పించసాగింది. కానీ, ఆమె గొంతు విప్పితే పలికేదంతా విషాదమే.

దీర్ఘాలోచనలో మునిగి ఉన్న ప్రియ తేరుకుంటూ "కూర్చో బావా!" అంది బరువుగా. ఏదో చెప్పడానికి ఆరాటపడ్తున్నదానిలా, చెప్పడానికి నోరు పెగలనిదానిలా కన్పించింది ప్రియ విజయ్‌కి. సోఫా అంచున కూర్చున్నాడు విజయ్. ప్రియ అతని ఎదురు సోఫాలో కూర్చుంది.

"బావా! నే నిలా సిగ్గువిడిచి చెప్తున్నానని నన్ను వేరే విధంగా అనుకోకు. చిన్నప్పటి నుండీ నీ దగ్గర నాకు చను వెక్కువ. నేను నా వ్యధనంతా నీ దగ్గర తప్ప ఇంకెక్కడా చెప్పుకోలేను. నన్ను నువ్వేవిధంగా తలచినా నేను మాత్రం ఈ ప్రపంచంలో నాకున్న ఆప్తుడివి నువ్వొక్కడవే అనుకుంటున్నాను. అందుకు కారణం కూడా నీకు తెలుసు. నేను చిన్నప్పటి నుండీ నా మనసులో నువ్వేనన్న అభిప్రాయం గుండెనిండా నింపుకున్నాను. అలాంటి నీ దగ్గర నా మనసు విప్పి చెప్పుకోవడం తప్పంటావా బావా?" నిదానంగా, బరువుగా అంది ప్రియ.

"మనం పరాయివాళ్ళం కాదు. ఒకరి కష్టసుఖాలు ఒకరు చెప్పుకోవడం వల్ల తప్పేముంది ప్రియా? చెప్పు." అన్నాడు విజయ్, ఆత్రుతగా ముందుకి వంగుని.

"బావా! ఆస్తి వివరాలు నీకు చెప్పేను. నే నెలాంటి సుడిగుండాల్లో చిక్కుకున్నానో నీకు చెప్పేను. వెధవ ఆస్తి. అది పోయినా, ఉన్నా నాకు లెక్కలేదు. నాకు కావలసింది జీవితం. బావా! నా జీవితానికొక ఆలంబన కావాలి. నా అనే తోడు కావాలి. నేను హాయిగా, నిశ్చింతంగా తలదాచుకోవడానికి ఒక చల్లని హృదయం కావాలి. నా చుట్టూ పెనవేసుకుని నే నున్నాననే ధీమాని, ధైర్యాన్ని, శక్తిని ఇచ్చే బలమైన హృదయం బాహుబంధనం కావాలి. లేకపోతే నేనీ ఒంటరి బ్రతుకు బ్రతికలేను బావా! అనుక్షణం పీడించే ఒంటరితనంతో, నా చుట్టూ నిండిఉన్న ఈ కారుచీకటిలో పిచ్చిదాన్నయిపోతాను బావా! ఇంత చిన్నవయస్సులో అన్నీ పోగొట్టుకుని కోరికలకి అతీతంగా విరాగిలా బ్రతకడం నాకు చేతకావడం లేదు. నేను కోరికలని జయించలేను. నాలో కోరికలు నాగు పాముల్లా బుసలుకొడతున్నాయి. నేనూ అందరిలా ఆనందంగా సుఖసంతోషా లతో బ్రతకాలి బావా! అప్పుడే నాకు శాంతి. బావా! దయచేసి నన్ను కాము కిగా పరిగణించకోకు. నన్ను అర్థం చేసుకోవడానికి ప్రయత్నించు." ఒక్కొక్క మాటా ఎంతో వ్యధాపూరితంగా, ఆవేశంగా చెప్పిన ప్రియకళ్ళు వేదనా భరితాలయ్యాయి.

బరువుగా నిట్టూర్చేడు విజయ్ "లేదు ప్రియా! నిన్ను అపార్థం చేసుకో వడం లేదు. నీ పరిస్థితిని పూర్తిగా అర్థంచేసుకున్నాను. దీనికి ఒక్కటే పరి ష్కారం ప్రియా! ఎవరైనా సహృదయుడిని చూసి నువ్వు మళ్ళీ పెళ్ళిచేసు కోవాలి ..."

"హు! పెళ్ళా?" పేలవంగా నవ్వింది ప్రియ. "నేను కాముకురాలిని కాదు బావా దొరికిన ఎవరినైనా పెళ్ళి చేసేసుకోవడానికి. అప్పుడు నాన్నమాట కాదనలేక ఈ పెళ్ళి చేసుకున్నాను. నా మనసుకి నేను చేసుకున్న ద్రోహానికి శిక్ష అనుభవిస్తున్నాను. నాకూ మనసనేది ఉంది బావా! ఆ మనసు మట్టిముద్ద కాదు ఎలా తయారుచేస్తే అలా కావడానికి

"ప్రియా! నువ్వేమంటున్నావో నా కర్థంకావటం లేదు." కనుబొమలు ముడిస్తూ ఆశ్చర్యంగా అడిగేడు విజయ్.

"నీకు అర్థంకావడంలేదా బావా? ఇంత విపులంగా చెప్పినా నా మన

పేమిటో నీ కర్థంకావడంలేదా? ఎంత పరాయివాడి వయిపోయావు బావా!"
ప్రియ కళ్ళు నీళ్ళతో నిండుకున్నాయి.

"ప్రియా!" కంగారుగా పిలిచేడు విజయ్.

"బావా! అప్పుడు మన ప్రేమంతా వట్టి బూటకమేనా బావా? మన కన్న కలలన్నీ మరిచిపోయావా? నా రూపు నీ మనసులో పూర్తిగా చెరిగి పోయిందా? పిచ్చిదాన్ని నీఅంత తేలిగ్గా నిన్ను నా మనసులోనుంచి తీసెయ్యలేక ఇంకా నిన్నే ఆరాధిస్తున్నాను. నిన్నే సర్వస్వంగా భావించుకుంటున్నాను. ఈ జీవితమంతా నీకే అంకితం చెయ్యాలని ఆరాటపడుతున్నాను. దయచేసి నా మనసుని మరోసారి చంపకు బావా! నన్ను కాదనకు"

"ప్రియా!" అదిరిపడ్డాడు విజయ్. "ఇదా నీ ఉద్దేశం? చిన్నప్పుడు పెద్దవాళ్ళు ఏదో అన్నారని నిజంగా మనిద్దరం భార్యాభర్తలవుతామను కొని అభిమానించుకుని ఆశ లల్లుకున్నాము. కానీ విధి మరో విధంగా చేసింది. ఇద్దరం పెళ్ళిళ్ళు చేసుకుని ఎవరి జీవితాల్లో వాళ్ళం జీవిస్తున్నాం. నీ జీవితం ఇలా అవుతుందని ఎవరనుకున్నాం? మనతో జీవితం పంచుకున్న భాగ స్వామికి పూర్తి న్యాయంచెయ్యడం మన విధి. మాధవి నన్నెంతో ప్రేమిస్తుంది. ఆమెవల్ల నా జీవితమెంతో హాయిగా, ఆనందంగా ఉంది. ఇప్పుడిలా సవ్యంగా నడుస్తున్న జీవితాల్ని తప్పుదారి పట్టించడం ఎవరికీ శ్రేయస్కరం కాదు. నేను మాధవికి అన్యాయం చెయ్యలేను ప్రియా! నన్ను క్షమించు." నచ్చచెపుతున్నట్టుగా అన్నాడు విజయ్.

"హు! మాధవి. మాధవి ఎవరు? నేను ముందు ప్రేమించేను నిన్ను. నువ్వు ముందు నన్ను ప్రేమించేవు. తరువాతేగా మాధవి వచ్చింది. తాళి కట్టిన బంధం తప్ప అంతకు ముందు ఏ మనుబంధం ఉంది మీ మధ్య? మాధవికి అన్యాయం చెయ్యలేవా? నీకోసం అలమటిస్తున్న నన్నింత క్షోభ పెడుతున్నావే. ఇది అన్యాయం కాదా? అప్పుడు అభిమానించేవు. ప్రేమించేవు. పెళ్ళి కాగానే నన్ను మరిచిపోయి ఆ వచ్చిన భార్యని సర్వస్వం అంటూ ప్రేమించేస్తున్నావు. నీ మనసు ఎంత చంచలం బావా! కానీ నా మనసుకది చేతకావడంలేదే. నేనేం చెయ్యాలి? ఈ క్షోభని నే నేవిధంగా భరించాలి. ఛీ! ఛీ! నే నెంత పిచ్చి దాన్ని! ఎంత దురదృష్టవంతురాలిని! నేను ఏకాకిని, నా కెవ్వరూ లేరు." సోఫాలోనుండి క్రిందికి జారిపోయిన ప్రియ అక్కడున్న టీపాయ్‌కి ఉద్రేకంగా తల కొట్టుకుని పిచ్చిదానిలా ఏడవసాగింది.




విజయ్ ఆందోళనపడ్డాడు. అతడికి ఆమెమీద ఏ మూలో దాగున్న అనురాగం లాంటి అభిమానం చప్పున మేల్కొంది. అతని మనసు అంతులేని కరుణతో, వేదనతో నిండిపోయింది. ఇక అలా చూస్తూ ఉపేక్షించడం అతనికి వశం కాలేదు.

"ఛ! ఛ! ప్రియా! ఏమిటిది? ఇంతమాత్రానికేనా ఈ ఏడుపంతా? ఇప్పుడేం జరిగింది?" ఆమె రెండు భుజాలు పట్టుకుని తనవైపుకి తిప్పుకుని కళ్ళు తుడిచేడు. ఆ స్పర్శకి, ఆ కంఠంలోని ఆత్మీయతకి, మార్దవానికి ఆమె మనసుకి ఎనలేని ఊరట, ఓదార్పు కలిగినట్టయింది. ఓదార్చేవాళ్ళుంటే దుఃఖం మరింత ఉవృతమవుతుంది.

"బావా! నువ్వు నాకు కావాలి. నేను నీకు దూరంగా ఉండలేను బావా! నన్ను దూరంగా నెట్టివేయకు. లోకం తలక్రిందులయినా నిన్ను నేను విడిచి పెట్టను..." ఆమె పలవరింతలకి హఠాత్తుగా అతని పెదాలమీద చిరునవ్వు చిందింది. ఆ చిరునవ్వు ఆమెకు అభయహస్తంలా కనిపించింది. ఆమె చప్పున అతని గుండెల్లో తలదాచుకుంది. ఆర్తిగా అతన్ని పెనవేసుకుంది. ఏదో పరవశత్వం, ఏదో మత్తు ఆమెని పూర్తిగా ఆక్రమించుకున్నాయి.

"బావా! ఈ స్థానం నాకు శాశ్వతం కావాలి. ఎన్నెప్పుడూ ఈ స్థానం

నుండి దూరం చెయ్యగలు. న న్నెవ్వరూ నీనుండి దూరం చెయ్యలేరు." తన్మయత్వంగా ఏదేదో అంటూంది ప్రియ.

ఆ స్పర్శ విజయ్‌లో కూడా ఏదో మైకం కలిగించింది. అతని హృదయం ఏదో సుషుప్తిలోకి జారిపోయింది. అతని చేతులు అప్రయత్నంగా ఆమెచుట్టూ బిగుసుకుని ఆమెని తనలో పూర్తిగా ఇముడ్చుకున్నాయి. అతడిని పూర్తిగా అవరించుకున్న తన్మయత్వంలో అతని పెదవులు అప్రయత్నంగా "మధూ !" అని ఉచ్చరించేయి.

అంత పరవశంలోను మునిగిపోయిన ప్రియకి ఆ రెండక్షరాలు శరాఘాతాలే అయి అదిరిపడి కళ్ళు విప్పింది. సర్పదృష్టలా తలఎత్తి అతని చేతుల్ని బలవంతంగా విడిపించుకుని బయట పడింది ప్రియ. విజయ్‌కి కూడా తను చేసిందేమిటో తెలిసి రెండడుగులు వెనక్కి వేశాడు. "క్షమించు ప్రియా !" అన్నాడు తల దించుకుని.

"లేదు బావా ! క్షమించే తప్పు నువ్వేం చేశావని ! నా ఆలింగనంలో ఉండికూడా నువ్వు మధు పేరు ఉచ్చరించేవంటే నీ మీద ఆమె ప్రభావం ఎంత ఉందో, నువ్వామెని ఎంత గాఢంగా ప్రేమిస్తున్నావో అర్థమవుతుంది. మధు ఎంతో అదృష్టవంతురాలు బావా ! ఆమె తన ప్రేమతో నిన్నింతగా ఆకట్టుకో బట్టే నువ్వు నన్ను ఇంత త్వరగా మర్చిపోగలిగేవు. బావా ! అయినా సరే నిన్ను నేను వదులుకోదల్చుకోలేదు. నువ్వు నాకు కావాలి బావా ! నిన్ను తప్ప ఏ పురుషుడిని నా జీవితంలోకి ఆహ్వానించలేను. అలాగని మాధవినుండి నిన్ను విడదీయాలనే దురుద్దేశం నాకేకోశానా లేదు బావా ! దయచేసి నా మనసులోని సంక్షోభం అర్థంచేసుకో. నువ్వు వారానికి ఒకటి రెండుసార్లు వచ్చిపోతుండు బావా ! అంతకంటే ఇంకేం ఆశించను." కళ్ళు తుడుచుకున్న ప్రియ బరువుగా నిట్టూర్చి అంది.

"లాభం లేదు ప్రియా ! మాధవి ఒప్పుకోదు సరికదా ఈ విషయం తెలిస్తే ఆమె మనసెంతో గాయపడుతుంది. ఆమె ఉద్దేశాలు, ఆదర్శాలు వేరు. భర్త భార్యతోనూ, భార్య భర్తతోనూ తప్ప పైవాళ్ళతో సంబంధాలు పెట్టుకున్న వాళ్ళని ఎంత అసహ్యించుకుంటుందో మాటల్లో చెప్పలేను. ఒక భర్తకి ఒకే భార్య, ఒక భార్యకి ఒకే భర్త అన్న సిద్ధాంతాన్ని ఆమె ప్రాణసమానంగా నమ్ముతుంది ఇది విని ఆమె భరించలేదు ప్రియా ! నా మీద ఆమెకున్న నమ్మకం సడలిపోతే ఆమె బ్రతకలేదు."

"అయితే ఈ విషయాలేవీ ఆమెకు తెలియనివ్వకూడదు బావా! ఏదో పనున్నట్టుగా ఇక్కడకి నువ్వు వస్తూంటే ఏ గొడవా ఉండదు."

"క్షమించు ప్రియా! ఆమెను ఇంతవరకు ఏ చిన్న విషయంలో కూడా ఆమెకి తెలియకుండా మోసం చెయ్యలేదు. ఇకముందు కూడా చెయ్యలేను." దృఢంగా అన్నాడు విజయ్.

ప్రియకి కోపం వచ్చింది. "ఎంతసేపూ ఆమె గురించేగాని, నీ గురించి ఇంత తపించిపోతున్న నా గురించి కొంచెం కూడా ఆలోచించవేం? ఆమెకి తెలియకుండా చెయ్యలేకపోతే ఆమెకి పూర్తిగా నా పరిస్థితి చెప్పు. అంగీకరించ మని ప్రతిమాలు ఎలాగైనా ఒప్పించు. సాటి ఆడదానిగా నాకి సహాయం చెయ్య మను. సాటి ఆడదాని కష్టాన్ని చూచి ఆదుకోని ఆడది అసలు ఆడదే కాదు నా దృష్టిలో."

"ప్రియా! మధుది నవనీతం లాంటి మనసు. ఎవరి కష్టం చూడలేదు. అలాగని ఎంత దేవతలాంటి స్త్రీ అయినా చూస్తూ చూస్తూ ఇలాంటి త్యాగం చెయ్యలేదు."

"నేనేం త్యాగం చెయ్యమన్నాను? నిన్ను పూర్తిగా నాకు దానం ఇచ్చెయ్యమన్నానా? కొంచెం నా గురించి ఆలోచించి తన చేతిలో ఉన్న సహాయం చెయ్యమన్నాను అంతేగా... "

"కానీ మాధవి మనసు చాలా సున్నితం ప్రియా. ఇది భరించలేదు."

"బావా! ఎంతసేపూ మాధవీ, మాధవీ అని చెప్తున్నావు గాని, నీ కిష్టం లేదని తెగేసి చెప్పగలుగుతున్నావా? లేదు. అంటే నీకు కూడా నేను కావాలి. నిజమేనా? నీ మనసుకి నువ్వు ద్రోహం చేసుకోకు...."

ఒక్క క్షణం ఉలిక్కిపడ్డాడు విజయ్. ప్రియ అన్నది నిజమేనేమో. ప్రియమీద లోలోన తనకి ప్రలోభం ఏర్పడుతూంది.

"కానీ ... కానీ.... మాధవిని బాధపెట్టడం నా కిష్టం లేదు ప్రియా!" నెమ్మదిగా, తడబడుతున్నట్టుగా అన్నాడు విజయ్.

"బావా! నా పరిస్థితి కూడా నేను ముందే చెప్పేను నీకు. కావాలంటే మాధవిని నేను కూడా ఒప్పిస్తాను. నువ్వు నాకు దూరమయితే నా బ్రతుకెలా ఉంటుందో, నేననేదానిని అసలు మిగిలిఉంటానో, ఉండనో నాకే తెలీదు. తరువాత ఏం జరిగినా దానికి నువ్వూ, మాధవే బాధ్యులవుతారు. ఏం చేస్తావో

నీ ఇష్టం." ఆతడి ఆలోచనకి అతడిని వదిలేసి ప్రియ అక్కడనుండి లేచి వెళ్ళిపోయింది.

## 7

మాధవి అత్తవారి కుటుంబమంతా సోమవారం ఉదయం బయలుదేరారు. విజయనగరం బస్సు ఎక్కడానికి పొలంగట్లంట నడుస్తూ రోడ్డుమీదకు రావాలి. అందరూ ఉషారుగా ఏవేవో కబుర్లు చెప్పుకుంటూ నడుస్తున్నారు.

మాధవి జ్వరంతో ఒళ్ళు అగ్గిలా కాగిపోతున్న బాబిగాడిని ఎత్తుకుని వాళ్ళతో నడవలేకపోతూంది. అటువంటి నడక అలవాటు లేదు. మధ్య మధ్య తుప్పలవీ శరీరానికి తగులుకుని గీరుకుంటున్నాయి. మూడేళ్ళ బాబిగాడిని మొయ్యడం కూడా చాలా కష్టంగా ఉంది. తన చేతుల్లోనుంచి బాబిగాడిని ఎవరూ అందుకోరు. ఎవరి భుజాలమీద వాళ్ల పిల్లలే ఉన్నారు. విజయ్ ఉంటే తనకి బాధ తప్పును. బాబిగాడిని అతనే ఎత్తుకుండును. విజయ్ మదిలో మెదలగానే కాస్త అణగిఉన్న సంక్షోభం తిరిగి ప్రారంభమైంది మాధవిలో. నిన్న సాయంత్రం పొలాలు చూడ్డానికి వెళ్ళినవాళ్ళందరు తిరిగి వచ్చేశారు. విజయ్, ప్రియా మాత్రం రాలేదు. బాబిగాడికి అప్పటికే ఒళ్ళు సలసల కాగిపోతూంది. తను విజయ్‌కోసం ఆత్రుతగా ఎదురుచూడసాగింది.

తనను చూసి అదవడుచులు, తోటికోడళ్లు ఎందుకు గుసగుసలాడుకుంటున్నారో, ఎందుకు నవ్వుకుంటున్నారో మొదట తనకి అర్థంకాలేదు. క్రమంగా అర్థమైన తను నిర్వీర్యపోయింది.

ఈ విషయం అత్తగారు సుందరమ్మకి కూడా తెలిసింది. "పిచ్చి సన్నాసులు. వాళ్ళ మనస్సుల్లో ఎన్ని ఆశలున్నాయో. ఇలా కలిసి మెలిసి తిరగాలని ఎంతగా అనుకున్నారో. మా అన్న పాపిష్టివాడు కావిచేశాడు కాదుగాని, లేకపోతే చిలకాగోరింకల్లా ఉందురు. పోనీ, ఇప్పుడయినా అలా తిరిగిరావాలనుకున్నారు." చాలా తేలిగ్గా నవ్వుతూ అందామె.

వింటున్న మాధవికి ఒళ్ళు కతకతలాడిపోయింది. తన విజయ్ అలా చేశాడంటే నమ్మలేకపోతూంది. విజయ్ ప్రియ వెంట వెళ్ళడానికి మరేదో కారణాన్ని వెదకసాగింది. వాళ్ళందరి అనుమానాలు, ఊహాగానాలు నిజం కావన్పిస్తూంది. అయినా, అయినా ఏదో అనిర్వచనీయమైన వ్యథ గుండెను బ్రద్దలు చేస్తూంది.

ఔను, కాదు అనే సంఘర్షణతో ఆమె మెదడు కాగిపోతూంది. ఉన్న చోటనే కదిలే ఓపిక లేనట్టు స్థాణువులా కూర్చుండిపోయింది.

"రాయిలా ఎందుకలా కూర్చుండిపోయావు? ఇప్పుడేం కొంప మునిగిపోయిందని. ఏదో ఆశ తీరక అలా తిరిగిరావడానికి వెళ్ళేరు. తెల్లారేసరికి వాడు నీ దగ్గరే ఉంటాడులే. భోజనానికి లే." అంది సుందరమ్మ.

చివ్వున తలెత్తి చూసింది మాధవి ఆ కళ్ళలో కన్పించే సంఘర్షణ, ఆవేదన చదవగలిగే శక్తి ఆమెకి లేదు. మాధవి ఎవరికీ సమాధానం చెప్పలేదు. అక్కడి నుండి కదలేదు. ఆ రాత్రంతా బాబిగాడికి జ్వరం కన్ను తెరవనివ్వలేదు. ఆ జ్వరానికి మందూ లేదు కనీసం తెచ్చిచ్చే దాతకూడా లేదు. భర్త గురించిన వ్యధలో, బిడ్డ గురించిన ఆందోళనతో మాధవికి ఆ రాత్రంతా జాగరణే అయింది.

పొలంగట్టుమీద కాలుజారడంతో పరధ్యానంగా నడుస్తున్న మాధవి ఉలిక్కిపడింది. ఆమె అందరికీ చాలా వెనకబడి ఉంది.

చిన్న మరిది విశ్వం ఆమె గురించి వెనక్కి తిరిగివచ్చేడు.

"వెనకబడిపోయావు వదినా! బాబునిలాతే ఎత్తుకుంటాను." చనువుగా ఆమె భుజంమీద బాబుని తీసుకున్నాడు.

"అబ్బా! జ్వరం చాలా ఎక్కువగానే ఉందే." అన్నాడు. మాధవికి అప్రయత్నంగా కళ్ళలో నీళ్ళు తిరిగేయి. ఆమెకి ఎప్పుడెప్పుడు విజయనగరం చేరతానా? ఎంత తొందరగా బిడ్డని ఆస్పత్రికి తీసుకువెళతానా అని హృదయం వేగిరపడుతూంది.

"ఛ! బాబు కిలా ఉంటే అన్నయ్య అలా ఎలా వెళ్ళిపోగలిగేడు? అన్నయ్య చేయవలసిన పని కాదిది. రానియి అడుగుతాను." కోపంగా అన్నాడు విశ్వం.

"వద్దు విశ్వం. ఆయ న్నేమీ అడగొద్దు. అందరూ అనుకొనేది నిజం కాదేమో! ఆయన ప్రియపెంట వెళ్ళడానికి ఇంకేమైనా కారణం ఉందేమో! అనవసరంగా ఆయన్నడిగితే బాధపడతారు." స్థిరంగా అంది మాధవి.

"వదినా!" ఆశ్చర్యంగా చూశాడామెవైపు విశ్వం.

అందరూ రోడ్డుచేరి విజయనగరం పోయే బస్సుకోసం నిలబడి వెయిట్ చెయ్యసాగేరు. ఐదునిమిషాల తరువాత శ్రీకాకుళం నుండి విజయనగరం పోయే బస్సు వచ్చి ఆగింది.

అందులోనుండి విజయ్ దిగేడు. అందరి కళ్ళూ అతనికేసి ఆసక్తిగా చూడసాగాయి. అతడి కళ్ళు మాధవికోసం వెదికేయి. ఆమె అతడిని పరీక్షగా చూడసాగింది.

"చూడన్నయ్యా బాబుకెంత జ్వరమో!" విశ్వం బాబుని విజయ్ కందించేడు. ఎవరో కొరడాతో చెళ్ళున వీపుమీద చరిచినట్టుగా త్రుళ్ళిపడ్డాడు విజయ్. బాబుకి జ్వరమన్న సంగతి అంతవరకు అతనికి జ్ఞాపకమే లేదు. ఆరాటంగా బాబునందుకుని గుండెకత్తుకున్నాడు.

అందరూ హడావుడిగా విజయనగరం బస్సు ఎక్కేరు. మాధవి విజయ్ ప్రక్కనకాక ఆడవాళ్ళ మధ్య కూర్చుంది. ఆ జనంలో విజయ్‌కి మాధవి ప్రక్కన కూర్చోవాలన్నా వీలుకాలేదు.

## 8

బస్సు దిగీదిగగానే బాబుని ఆస్పత్రికి తీసుకువెళ్ళిపోయాడు విజయ్. బస్‌స్టాప్‌నుంచి అందరూ రిక్షల్లో బయలుదేరారు. అత్తవారింటికి వెళ్ళడానికి మనస్కరించని మాధవి తన రిక్షని తిన్నగా తన ఇంటికేసి పోనివ్వమంది.

తలుపు తాళంతీసి లోపలికొచ్చిన మాధవి నిస్సత్తువగా సోఫాలో కూచ్చుండిపోయింది. ఆమె మనసంతా ఎంతో శూన్యంగా, భారంగా ఉంది. ఆమెలోని శక్తంతా ఎవరో బలవంతంగా లాగేసుకున్నట్టుగా నిస్సత్తువగా అయిపోయింది.

బాబుకి ఇంజక్షన్ చేయించి టాబ్‌లెట్స్ తీసుకుని వచ్చేడు విజయ్. నిద్రపోతున్న బాబుని పడుకోబెట్టేడు. మాధవి ప్రక్కకి వచ్చి కూర్చున్నాడు. "మధూ! ఏమైనా మాట్లాడు మధూ! ఎందుకలా మౌనంగా ఉన్నావు?" అన్నాడు. మాధవి అతనివంక తలెత్తి చూసింది.

"కాఫీ తీసుకొస్తానుండు. అన్నట్టు నా స్కూటర్..."

"హాఁ! స్కూటర్. అదికూడా గుర్తుందా మీకు? పెళ్ళికూతురు, పెళ్ళికొడుకు దానిమీద షికారు బయలుదేరారు." విసురుగా చెప్పింది మాధవి.

"మధూ! ఇటు చూడు." ఆమె భుజాలుపట్టి తనవేపు తిప్పుకున్నాడు విజయ్. "నీకు చాలా కోపంవచ్చింది కదూ?"

మాట్లాడలేదు మాధవి. అతనిలో ఎక్కడైనా కల్మషం కనిపిస్తుందేమోనన్నట్టు పరీక్షగా చూడసాగింది.




"నాకు తెలుసు. నేనలా ప్రియవెంట వెళ్ళినందుకు నీకు చాలా కోపంగా ఉంది." అపరాధిలా అన్నాడు విజయ్.

"ప్రియవెంట వెళ్ళినందుకు కాదు. అడవిలాంటి ఆ ప్రదేశంలో బాబుని, నన్ను మా ఖర్మకి అలా వదిలేసి వెళ్ళిపోయినందుకు... "

"నీకు మాటమాత్రంగా కూడా చెప్పకుండా వెళ్ళిపోవడం పొరపాటే మధూ! నన్ను క్షమించు. నేను ప్రియవెంట ఎందుకు వెళ్ళానో తెలుసుకోవాలనిలేదా?"

"మీరు దాన్నిగురించి చెప్పకపోతే గదా తెలుసుకోవాలన్న ఆరాటం కలగడానికి. మీ రెలాగూ చెప్తారని నాకు తెలుసు."

"మధూ!" అతని మనసు కృంగిపోసాగింది. "తప్పకుండా చెప్తాను. కానీ ఇప్పుడు చెప్పలేను." నెమ్మదిగా అన్నాడు.

మాధవికి లోలోన ఎంత ఉత్కంఠ ఉన్నా "అలాగే! ఇప్పుడేం తొందర?" అంది పైకి.

ఆ రోజు అన్యమనస్కంగా నే విజయ్ ఆఫీసు కెళ్ళివచ్చేడు. అస్థిమితంగానే మాధవి కూడా వంటావార్పులు చేసింది బాబిగాడికి జ్వరం కాస్త తగ్గుమొహం పట్టింది.

ఆ రాత్రి ఎలాగైనా తన మనసులో జరుగుతున్న యుద్ధమంతా చెప్పేయా

లనుకున్నాడు విజయ్. బాబిగాడివి నిద్రపుచ్చి విజయ్ ప్రక్కకి వచ్చి కూర్చుంది మాధవి. విజయ్ లేచి ఆమెకి దగ్గరగా కూర్చుని ఆమె చేతిని తన చేతుల్లోకి తీసుకుని ఆప్యాయంగా నిమరసాగేడు.

"మధూ ! నేను చెప్పేది జాగ్రత్తగా వినాలి నువ్వు. నన్ను మాత్రం అపార్థం చేసుకోకూడదు." మెల్లగా మొదలుపెట్టేడు విజయ్.

"నే నెప్పుడైనా మిమ్మల్ని అపార్థం చేసుకున్నానా ? చెప్పండి."

"ఎన్నో చిక్కుల్లో, కష్టాల్లో ఉన్న వ్యక్తికి, జీవితమంతా అంధకార బంధురమైన వ్యక్తికి మనవల్ల ఆ జీవితం ఆనందదాయకం అవుతుందని తెలిసి చేయూతనివ్వడం, ఆదుకోవడం తప్పా ? దానివల్ల మనకి కొన్ని చిక్కులు ఏర్పడతాయని తెలిసి ఆ సహాయం చేయడం మానుకోవడం ఉచితమంటావా ? చెప్పు మధూ ? ఏమి చెయ్యడం ఉచితం ?"

అతను చెప్పేది ఎవరి గురించో అర్థంకాలేదు మాధవికి. అతడు ఆమె వంకే ఉత్సాహంగా, ఆరాటంగా చూడసాగేడు.

"మీరు చెప్పేది ఎవరి గురించి ?" సందేహంగా అడిగింది మాధవి.

"ఎవరి గురించైనా నీ సమాధానమేమిటి మధూ ?"

"కష్టాల్లో ఉన్నవాళ్ళకి మనవల్ల మేలు కలుగుతుందని, వాళ్ళ కష్టాలు కొంచెమైనా తొలగుతాయని తెలిసిన తరువాత మనకి చేతనైన సహాయం చెయ్యడమే ఉచితం." స్థిరగంభీరంగా అంది మాధవి.

గుండెలనిండా ఊపిరి పీల్చుకున్నాడు విజయ్. మెల్లగా ప్రియతో తను పొలంగట్టుమీద మాట్లాడింది మొదలుపెట్టి శ్రీకాకుళం వెళ్ళి అక్కడామెతో మాట్లాడినంతవరకు ప్రతి అక్షరం చెప్పేడు. ప్రియ అభ్యర్థ ఆమె మాధవిని ఒప్పించమనడం అంతా పూసగుచ్చినట్టు చెప్పేడు. ఆమె నిర్ణయం ఏమిటో చెప్పమన్నాడు.

మాధవి నెత్తిమీద పిడుగులు పడసాగేయి. ఆమె హృదయంలో అగ్ని పర్వతం బ్రద్దలయింది. ఉలుకూ పలుకూ లేకుండా అచలనంగా ఉండిపోయింది. అది ఆమె కలలో కూడా ఊహించని పరిస్థితి.

"మధూ మధూ !" కంగారుగా ఆమె భుజంమీద చెయ్యివేసి కుదిపేడు విజయ్. ఆమె అప్పుడే నిద్రలోనుండి మేల్కొన్నదానిలా అతనివంక క్రొత్తగా కళ్ళు విప్పార్చుకుని చూడసాగింది.

"మీరు. .మీరు ఏమంటున్నారు? అసలు మీరు నా విజయేనా? అంటే.... వాళ్ళు...వాళ్ళనుకున్నవన్నీ నిజమేనా? అయితే ఇన్నాళ్ళూ మీ మనస్సులో ఉన్నది ప్రియేనా? నేను కాదా? నన్నిన్నాళ్ళూ మోసం చేశారా? నాతో మీకున్నది వట్టి శరీరక సంబంధమేనా? మీ మనసులో స్థానం ఏర్పరుచుకున్నది ప్రియేనా? నన్నెంత వంచించేరు. నేనిది భరించలేను. మీ మనస్సులో స్థానంలేని నేను బ్రతకలేను. ఇనాళ్ళూ నేను మీతో శరీరకంగామాత్రమే కాపురం చేశాననుకుంటే నా మీద నాకే అసహ్యం వేస్తూంది. ఇన్నాళ్ళూ ఎందుకింత నాటకం ఆడేరు? నన్ను ప్రేమిస్తున్నట్టు ఎందుకు నటించేరు?" మాధవిలో ఆవేశం, దుఃఖం పోటీ పడుతూ సముద్ర కెరటాల్లా పొంగుకు రాసాగాయి. రెండు చేతుల్లో తలదూర్చి రోదించసాగింది మాధవి.

"మధూ! ప్లీజ్! మధూ! నువ్విలా బాధపడకు. నేను చెప్పేది విను నా మనసులో స్థానమెప్పుడూ నీదె. దయచేసి నమ్ము..." ఆమె చేతుల్ని విడ దీయబోయాడు విజయ్.

"నమ్మను. నమ్మను. నన్నింకా నమ్మించడానికి ప్రయత్నించకండి. పిచ్చిదాన్ని మిమ్మీద పిచ్చి ప్రేమతో వాళ్ళందరి మాటలూ నమ్మలేదు మీకు నా మీదే ప్రేమ ఉంటె అక్కడ ఆ పరిస్థితుల్లో నన్నలా వదిలేసి ఆమె వెంట వెళ్ళి పోరు. కన్నబిడ్డ ప్రమాద పరిస్థితిని కూడా ఆలోచించనీయనంతటి బలీయమైన స్థానం ఉంది మీ మనసులో ఆమెకి ఇప్పుడంతా అర్థమైపోతూందండీ. భగ వంతుడా! నన్నెందు కిలా ఉంచేవు. నా మనసునెందుకు ముక్కలు చేస్తున్నావు? నాలో ఎందుకింత ప్రేమ నింపేవు? ఆ ప్రేమకి ఎందుకింత విఘాతం కలిగిస్తు న్నావు? నేనేం పాపం చేశాను." తల బాదుకుని హిస్టీరియా వచ్చినదానిలా విలపించసాగింది మాధవి. విజయ్ అనునయించబోయాడు. ఏదో చెప్పబో యాడు. కానీ మాధవి ఏమీ వినిపించుకోలేదు. అతనిని విసురుగా తోసివేసింది.

ఆమె బాధని, ఆ ఏడుపుని చూడలేకపోతున్నాడు విజయ్. మాధవి తన నెంత ప్రాణప్రదంగా ప్రేమిస్తుందో తనకు బాగా తెలుసు. తను చెప్పింది శాంతంగా విని తన అభిప్రాయం చెప్తుందనుకున్నాడు గాని తను చెప్పిన విషయం ఆమె మనసుకింత గొడ్డలిపెట్టవుతుందని అనుకోలేదు.

దుర్భరమైన దుఃఖభారాన్ని, భరించలేని మానసిక సంక్షోభాన్ని తట్టుకో లేని మాధవి ఏడ్చి ఏడ్చి స్పృహతప్పిపోయింది.

# 9

పది లంఖణాలు చేసినదానిలా తయారయింది మాధవి. ఆమె హృదయ వీణాతంత్రులు తెగిపోయాయి. మనసు మూగబోయింది. ఆమె నోటంట మాట రావడమే అరుదయిపోతుంది. నిశ్శబ్దంగా రోజులు గడిచిపోతున్నాయి. భార్యాభర్తల మధ్య మౌనమే రాజ్యం చేస్తుంది. ఆమె ముభావాన్ని, ఆమె దూరాన్ని భరించలేకపోతున్నాడు విజయ్.

కాఫీ తీసుకొచ్చి టీపాయ్‌మీద పెట్టి వెనుతిరిగిపోతున్న మాధవి భుజం మీద చెయ్యివేసి ఆపేడు విజయ్.

"మధూ! ఎందుకిలా నన్ను దూరం చేస్తున్నావ్? నువ్వు నాకు దూరంగా ఉంటే భరించలేకపోతున్నాను." ఆవేదనగా అన్నాడు.

"హృదయాలే దూరమయిన తరువాత ఇక మన మధ్య దూరంకాక మిగిలిందేముంది?" పేలవంగా అంది మాధవి.

"హృదయాలు దూరమయ్యాయా? లేదు మధూ! లేదు నా హృదయంలో ఉన్నది నువ్వే. ఆ స్థానం నీకు తప్ప మరెవ్వరికీ లేదు. నేను నిన్ను తప్ప మరెవ్వరినీ ప్రేమించలేను. నన్ను నమ్ము."

"నమ్మలేను." తల అడ్డంగా తిప్పింది మాధవి.

"నమ్మలేవా? ఏ ఆధారంతో నమ్మలేవు? ప్రియతో నేను శ్రీకాకుళం వెళ్ళినందుకేగా నమ్మలేకపోతున్నావు? చెప్పు ప్రియా ఏం చేశాను నేను? ప్రియతో జరిగింది నీకు చెప్పకుండా దాచేనా? నీకు తెలియకుండా ఆమెతో సంబంధం పెట్టుకున్నానా? ఏం చేశానని నమ్మలేవు? ఆమె మీద చిన్నప్పటి అభిమానం ఉన్నమాట నిజమే. ఆ అభిమానంతో ఆమె కష్టసుఖాలు విన్నాను. ఆమె కోరికని నీకు చెప్పేను. నువ్వు అంగీకరిస్తే ఆమెకి కూడా అందరిలా సుఖసంతోషాలు ఇవ్వాలనుకున్నాను. నీ కిష్టంలేకపోతే ఆ విషయం క్లియర్‌గా చెప్పొచ్చుగా. ఇలాగా శిక్షిస్తావు నువ్వు?" ఆవేశంగా అడిగేడు విజయ్.

"హుం! ఎంత మామూలుగా చెప్పేరండి మీరు! ఆమె కోరికని ఏ బాధా పడకుండా అంగీకరించడానికి, నా ఆనందాన్ని పంచి ఇచ్చేయడానికి నేను దేవతను కాను. మానవాతీతురాలిని కాదు. మామూలు మనిషిని. ఒకరి సంతోషం కోసం త్యాగం చెయ్యడానికి ఇది వస్తువు కాదు పంచి ఇవ్వడానికి తినే పదార్థం కాదు. జీవితం. నా జీవితాన్ని ఆమె కిచ్చేస్తే నేనే విధంగా బ్రతకాలండి?

చెప్పండి. నేనెలా బ్రతకను ?" మాధవి గొంతు గద్గదమయింది. కళ్ళు నిండుకున్నాయి.

"మాధవీ ? ఇలా చెప్పేస్తే ఏ గొడవా లేదుగా. నీ కంటే నాకెవ్వరూ ఎక్కువ కాదు. నిన్నిలా చూడలేకుండా ఉన్నాను మాధవీ, దయచేసి నన్ను దూరంగా ఉంచకు నేను బ్రతకలేను మధూ ! ఇక ఆ ప్రియ విషయం ఎత్తను. సరేనా" అమె కళ్ళు తుడిచి ఆమెను అక్కున చేర్చుకున్నాడు విజయ్. మాధవి అతనికి ఆర్తిగా అల్లుకుపోయింది.

నిర్మల నదీజలంలో గులకరాయి పడితే లేచే అలల్లాంటివి మాధవి మనసులో లేచి ఆమె మనసుని అల్లకల్లోలితం చేస్తున్నాయి. ఆమె మనసులో అనుమాన బీజం నాటుకుంది. విజయ్ ఎంత చెపుతున్నా, మాధవి ఎంత తీసేయాలనుకుంటున్నా దాన్ని ఆమె పెకిలించలేకపోతుంది. ఆమె ఎంత ప్రయత్నించినా మునుపటి మాధవి కాలేకపోతుంది. విజయ్‌తో అంతకుమునుపులా కలిసిపోలేకపోతూంది. విజయ్ అంతకు ముందులా ఏం జరగనట్టు ప్రవర్తిస్తున్నా మాధవి మాత్రం దాన్ని మరచిపోలేకపోతూంది. ఇన్నాళ్ళ అన్యోన్యత, అనురాగం వాళ్ళలో క్రమంగా లోపిస్తున్నాయి. దీనికి విజయ్ బాధపడ్తున్నాడు. కానీ ఏం చేయలేకపోతున్నాడు

రాత్రిందిగళ్ళు మాధవిలో ఎకతెరిపి లేని ఆలోచనలు తొలిచేస్తున్నాయి. ఆమె ఆలోచనల నిండా ప్రియ-విజయ్‌లే.

## 10

మూడు నెలలు గడిచిపోయాయి. మాధవి మానసిక క్షోభలో ఏ మార్పూ లేదు. ఒక్కోసారి ఒక్కోవిధంగా ఉంటూందామె. విజయ్ దగ్గరగా ఉన్నప్పుడు అతడామెను తన గుండెల్లో చేర్చుకుని అనునయించినప్పుడు, నచ్చజెపుతున్నప్పుడు అతడు తనవాడనుకుంటుంది. ఆ క్షణంలో ఆమె మనసు శాంతిగా ఉంటుంది. ఏ పనుల తొందరవల్లనో అతను కాస్త దూరంగా ఉన్నప్పుడు, ఆమెని పలకరించడానికి తీరికలేక ఉన్నప్పుడు ఆమెలో తిరిగి సంక్షోభం ప్రవేశిస్తుంది. అతడు తనను కావాలనే దూరం చేసుకుంటున్నాడనిపిస్తూంది. ఎప్పుడైనా చిరాగ్గా కనిపిస్తే అది తనమీద అయిష్టత అనుకుంటోంది. ప్రియ కోసం అలమటించే విజయ్ అందుకు అడ్డుగా ఉన్న తన మీద చిరాకు చూపిస్తున్నాడనుకుని విపరీతంగా బాధపడుతుంది.

ఒకసారి చాకలికి బట్టలువేస్తూ అతని పేంటుజేబులో చెయ్యిపెట్టి చూసిన మాధవికి ప్రియ రాసిన ఉత్తరం దొరికింది. దాన్ని చూడగానే ఆమె త్రుళ్ళిపడింది. చాకలికెలా బట్టలువేసి పంపించిందో ఆమెకే గుర్తులేదు. తలుపులు వేపేసి వచ్చి అదురుతున్న గుండెలను చిక్కబట్టుకుని ఆ ఉత్తరం మొదటి నుండి చివరిదాకా ఆరాటంగా ఒక్క ఊపున చదివేసింది. మళ్ళీ మళ్ళీ ఎన్ని సార్లు చదివిందో లెక్కలేదు. ఆమె ఒళ్ళంతా కంపించసాగింది. మొహమంతా చెమటలు పట్టసాగింది. మళ్ళీ ఉత్తరంలోకి చూసింది పిచ్చిదానిలా.

"నా ప్రాణంలో ప్రాణమైన బావకు,

ప్రియ వ్రాయునది. బావా! నీకోసం ఎంత తపించిపోతూ ఎన్ని ఉత్తరాలు రాశానో నీకు గుర్తులేకపోవచ్చు. కానీ రాసిన ప్రతి ఉత్తరంలోనూ నా మనసునంతా ఏకరువుపెట్టి రాసిన నేను మర్చిపోలేను. రాసిన ప్రతీ ఉత్తరానికి నీ సమాధానం ఒకటే మాధవి అంగీకరించదని. నిన్ను ఒక్కసారి కన్నులారా చూడాలని, నువ్వు రావాలని, నీ చల్లని స్పర్శలో నా తనువంతా పులకించిపోవాలని ఎంతో ఆకాంక్షతో ఉత్తరాలు రాస్తున్నాను గాని, నీ చచ్చు సమాధానం ఆశించి కాదు.

నా మనసేమిటో తెలిసిన తరువాత కూడా నన్ను చూడకుండా నువ్వెలా ఉండగల్గుతున్నావో గాని నిన్ను చూడకుండా మాత్రం నేనుండలేకపోతున్నాను. ఒక్కక్షణం ఒక యుగంలా ఉంది నాకు. ఎప్పుడెప్పుడు నీ చేతుల్లో వాలిపోదామా అని భరించలేని తపనగా ఉంది

మాధవి అంగీకరించదని తెలిసి కూడా ఆమె అంగీకారం కోసం కాలయాపన చెయ్యడం వట్టి తెలివితక్కువ. ఆమె అంగీకారం లేకుండా నే నేం చెయ్యలేను అనే పి అదర్శం వట్టి ఫూలిష్‌నెస్! ఆమెకి నువ్వింత విలువనివ్వబట్టేగా ఆమెకా అహంకారం! ఏ ఆడదైనా మగాడు విలువ ఇచ్చి అణగిమణగి ఆమె అభిప్రాయాల ప్రకారం నడచుకుంటుంటే అలాగే విర్రవీగుతుంది ఆమెకి ఎదురు తిరిగి, ఆమెను లెక్కచెయ్యకుండా ఉంటే ఏం చేస్తుంది? ఏం చెయ్యగలుగుతుంది? కొన్నాళ్లు బాధపడినా తరువాత రాజీపడిపోతుంది. ఆమెను నువ్వేం మోసంచెయ్యలేదే, అన్యాయం చెయ్యబోవడంలేదే. ఎందుకు నీకు సంకోచం. ఇన్నాళ్ళకి మన తీరని ప్రేమని పండించుకొనే తరుణం వచ్చిన తరువాత ఎందుకని కాలయాపన చేస్తున్నావు? ఇక్కడ వ్యాపారాల్లో చిక్కులు అధికమైపోతున్నాయి. నీకోసం నా మనసు పిచ్చెక్కిపోతుంది. నువ్వు త్వరగా

వచ్చి ఈ వ్యాపారాల్ని సరిచెయ్యి. వాకు కాస్త తెరిపినియ్యి. నన్నీ ఉచ్చుల మధ్యనుంచి బయటికి తియ్యి. నీకోసం చకోరిలా ఎదురుచూస్తున్న నన్ను ఏలుకో! రా బావా! త్వరగా రా! మన ప్రేమని పండించు. నీ చేతుల్లో ఉంచిన నా జీవితాన్ని ధన్యత చెయ్యి.

నీకోసం ప్రతిక్షణం ఎదురుచూసే నీ ప్రియ"

నిర్జీవంగా మారిపోయిన మాధవిలో సముద్రమథనం ప్రారంభమైంది. తన కెలాగూ ఆకలిలేకపోయినా కనీసం బాబిగాడికైనా అన్నంపెట్టాలనే ధ్యాసే ఆమెకి కలగలేదు.

చీకటిపడిపోయినా లైటు వేసుకోలేదు మాధవి. బాబిగాడు ఆకలికి ఏడ్చి ఏడ్చి ఆమె ఒళ్ళోనే నిద్రపోయాడు. ఆరోజు ఆఫీసునుంచి ఆలస్యంగా ఇంటికొచ్చిన విజయ్ చీకటిగా ఉన్న ఇంట్లో లైటు వేశాడు. కళ్ళు తెరుచుకునే నిద్రపోతున్నట్టు కూర్చున్న మాధవిని చూసి కంగారుపడ్డాడు. "మధూ! మధూ" అంటూ భుజంమ్మీద తట్టి పిలిచాడు. అతని పిలుపుకి ఈ లోకంలోకి వచ్చిన మాధవి ఉలిక్కిపడింది

"బాబేమిటి ఇలా నిద్రపోయాడు?" అంటూ వాడిని తీసుకువెళ్ళి మంచం మీద పరుండబెట్టేడు.

"మధూ! ఏమిటి మధూ? ఏం జరిగింది? ఎందుకలా ఉన్నావు?" వచ్చి ఆమె ప్రక్కన కూర్చుంటూ అడిగేడు విజయ్ ఆమె కళ్ళు విప్పారు తని అతనివంక వెఱ్ఱిదానిలా చూడసాగింది. హఠాత్తుగా అతనిదృష్టి ఆమె చేతిలోని ఇంకా రెపరెపలాడుతున్న ప్రియ రాసిన ఉత్తరంపై పడింది. అతను ఉలిక్కి పడ్డాడు. మాధవి కూడా దృష్టి అటు త్రిప్పింది. ఆమెకు ఏడుపు రాసాగింది. కానీ ఉవ్వెత్తుగా లేచిపడుతున్న రోషం ఆ ఏడుపు పైకిరానివ్వలేదు.

"ఇది నువ్వు ... నువ్వు చదివేవా?" తడబాటుగా అడిగేడు విజయ్.

ఆమెలో ఆవేశం పొంగిపొరలిపోతుంది "ఔను. చదివేను. ఎన్నాళ్ళ నుంచి సాగుతుంది ఈ నాటకం?"

"నాటకమా?"

"ఏం కాదా? కాకపోతే విశృంఖలంగా పెళ్ళాన్నే ప్రేమించేవాడయితే ఈ ఉత్తరాల సంగతి నా కెందుకు చెప్పలేదు?" తీవ్రంగా అడిగింది.

"నువ్వు బాధపడతావని మధూ! అంతే. ఏవో సమాధానాలు రాసి ప్రియ మనసు మరల్చుకొనేలా చేద్దామనుకున్నాను. నా మాట నమ్ము."

"ఆపండి." గట్టిగా అరిచింది. "ఇంకా నన్ను నమ్మించాలని ప్రయత్నిస్తున్నారా? ఎంత సమర్థులు మీరు! ఇక్కడ నా దగ్గిర నువ్వుతప్ప నాకింక లోకంలేదు. ప్రియ సంగతి ఇక ఎత్తను అని నచ్చజెప్తూ అటు ఉత్తరాలు రాసుకుంటూ మీ ప్రేమాయణాన్ని సాగించుకుంటున్నారు. నా ప్రాణంకంటే ఎక్కువుగా మిమ్మల్ని ప్రేమించిన నన్ను ఇంత మోసం ఎందుకు చేస్తున్నారండీ?"

"నేను నిన్ను మోసం చెయ్యాలనుకోవడంలేదు మధూ! అవతల ప్రియ గురించి ఆలోచిస్తున్నాను. ఆమె నాకు పరాయిది కాదు. నేను కాదంటే ఆమె ఏ అఘాయిత్యం చేస్తుందోననే సందిగ్ధంలో నేనేం చెప్పలేకపోతున్నాను. ఇది నిజం." గంభీరంగా అన్నాడు విజయ్.

"హుం! భర్తపోయి ఏడాదన్నా గడవందే పరాయివ్యక్తితో అక్రమ సంబంధం పెట్టుకోబోతున్న ఆడదాన్ని గురించి మీ కెలా ఏహ్యత కలగడం లేదండీ?" జుగుప్సగా అంది మాధవి.

"మధూ!" వారింపుగా పిలిచేడు విజయ్. "ప్రియ గురించి అలా తక్కువగా మాట్లాడకు. ఆమె నాతో పెట్టుకోవాలనుకున్నది అక్రమ సంబంధం కాదు. ఆమె నన్ను ప్రాణాధికంగా ప్రేమించింది..."

"హుం! ప్రేమ" వ్యంగ్యంగా నవ్వింది మాధవి "అది నిజంగా ప్రేమే అయితే అది హృదయానికి సంబంధించింది. ఆ ప్రేమ ప్రేమించిన మనిషి ఉన్నతిని కోరుకుంటుంది గాని అతడిని భార్యనుండి విడదీసి అతని జీవితాన్ని కల్లోలితం చెయ్యాలనుకోదు. తన కోరికలు తీర్చుకోవడానికి ఆ ప్రేమని సాధనంగా తీసుకోవాలనుకోదు. ప్రేమ ముసుగు వేసుకొని తీర్చుకోవాలనుకున్న కామవాంఛ అది. ఛీ! ఛీ! తలుచుకోవడానికే అసహ్యంగా ఉంది."

"షట్అప్!" కఠినంగా అరిచేడు విజయ్. మాధవి ప్రియని అలా హీనంగా మాట్లాడుతుంటే అతనికి కాస్త కోపం వచ్చింది. "నన్ను నువ్వెంత ప్రేమించేవో, ప్రియకూడా అంతగానే ప్రేమించింది. నువ్వుండవలసిన స్థానంలో ఉండడానికి కలలు కంది. నామీద నీ కెంత హక్కు ఉందనుకుంటున్నావో తనుకూడా అంతే హక్కు ఉంటుందనుకుంటూంది. అయితే తాళికట్టించుకున్న అధికారంతో నువ్వు నన్ను శాసించగల్గుతున్నావు. అంతే. ఆ అధికారం ఉంది గదా అని అవతల వ్యక్తి ప్రేమను కించపరచి మాట్లాడకు. అది మాత్రం




బాగా జ్ఞాపకం ఉంచుకో." తీవ్రంగా హెచ్చరించిన విజయ్ అక్కడినుండి వెళ్ళిపోయాడు. మాధవి శిలాప్రతిమే అయింది.

## 11

విజయ్ మనసేమిటో మాధవికి పూర్తిగా అవగతమైపోయింది. ప్రియ తనకి అహంకారమంటూ రాసిన ఉత్తరానికి ఏ మాత్రం కోపం రాలేదు విజయ్‌కి. ప్రియని తను కాస్త నిందించేసరికి అతను సహించలేకపోయాడు. అతని కెంతో ఆగ్రహం వచ్చింది. దీన్నిబట్టే అర్థమైపోతుంది ప్రియకి అతని మనస్సులో ఎంత పటిష్ఠమైన స్థానం ఉందో. అతనే అంటున్నాడు ప్రియకి తనమీద హక్కు ఉందని. కేవలం తాళికట్టడంవల్లనే తనకా హక్కు సంక్రమించిందని. నిజమే తనే పరాయిది. ప్రియ విజయ్‌కి అతనివాళ్ళకి ఎంతో కావల్సింది. చిన్నప్పటి నుండీ కలిసిమెలిసి పెరిగింది. ఆమె శ్రీమంతురాలు. ఆమె మీద ఉన్న అభిమానం, ప్రేమ తనమీద ఎందుకుంటుంది....?

ఈ విధంగా సాగేవి మాధవి ఆలోచనలు. విపరీతమైన ఆలోచనల భారంతో ఆమె రాత్రింబగళ్ళు ఏదో లోకంలో ఉంటున్నట్టుండేది. ఇంట్లో నిత్యకృత్యాలు మామూలుగానే జరిగిపోతున్నాయి. కానీ, భార్యాభర్తల మధ్య మాటలే కరువయిపోతున్నాయి.

మరో నెలరోజులు దొర్లిపోయాయి. ఏమీ తెలియనానికి మాధవి ఇలా పనికి మాలిన ఊహాగానాలతో తనను సాధిస్తూ తనకి దూరంగా ఉండటంతో విజయ్‌కి కూడా కాస్త పంతం వచ్చి అప్పటించి తనూ ఆమెని అంటీముట్టనట్టుగానే ఉన్నాడు ఈ నెల రోజులు. ప్రియ ఉత్తరాలకి జవాబులు వ్రాయటం మానుకున్నాడు. చిన్నప్పుడు ప్రియపట్ల తనకి మొలకెత్తిన ఆకర్షణ తనలో ఇంకా అలాగే ఉన్నమాట నిజమే. ఆ ఆకర్షణ ప్రియ తనను [illegible]గానే తనకి కూడా ఆమెపట్ల కోరికని కలుగజేసింది. అది వట్టి కోరిక మాత్రమే. ప్రియలేకపోతే తను బ్రతకలేదు అనుకొనేటంత బలమైన వాసన మాత్రం కాదు. వాళ్ళ మధ్య ఉన్న బంధుత్వం, ఆమె మీద ఏర్పడిన అభిమానం ఆమెను కష్టాల్లోనుండి ఆదుకోమంటున్నాయి. ఆమె పరిస్థితుల్ని సరిదిద్దమంటున్నాయి.

కానీ, వీటన్నిటికి మాధవి అంగీకరించలేదు. ప్రియ కోసం మాధవిని వదులుకోలేడు. ప్రియని ఆదుకోవడానికి తన జీవితనౌకని, సంసార నావని సుడిగుండాల్లోకి లాక్కునే అవివేకి కాడు. ఎంత చెప్పినా మాధవి నమ్మలేక పోతూంది. తన మనసుని కుదుటపర్చుకోలేక పోతూంది. ఉన్నకొలది విరాగిలా తయారవుతూ తనని పరాయివ్యక్తిలా చూస్తున్న మాధవిని చూడలేకపోతున్నాడు. ఈ పరిస్థితిని భరించలేకపోతున్నాడు. మాధవితో తిరిగి తన జీవితం ఇదివరకటిలా చిగురించాలని, ఆనందం పండాలని ఆరాటపడ్తున్నాడు. కానీ మాధవి తనని చూపులతోనే దూరంగా నిలబెడుతూంది.

బాబిగాడి ప్రక్కనే పడుకున్న మాధవికేసి ఆలోచనలతో నిద్రకి దూరమయిన విజయ్ దీక్షగా చూడసాగేడు. తమ మంచాలు వేరయి చాలా రోజులయింది. అలా చూస్తున్న విజయ్‌కి ఆమెమీద వాంఛ కలగసాగింది. ఇన్ని రోజులు ఎప్పుడూ ఎడబాటు లేదు తమ మధ్య. ఆమెను కౌగిలించుకోకుండా, ముద్దివ్వకుండా ఒక్కరోజు కూడా లేదు తను. పెళ్ళయిన దగ్గరనుంచీ తామిద్దరూ ఏకంకాని రోజులు వ్రేళ్ళమీద లెక్కపెట్టవచ్చు. అంతటి మధురమైన జీవితం తమది. ఆలోచిస్తున్నకొద్దీ అతనిలో విరహం పెరిగిపోతూంది. మెల్లగా లేచి ఆమె ప్రక్కకి చేరేడు. ఉద్రేకాన్ని అణచుకోలేక విజయ్ ఆమె పెదాలపై గట్టిగా చుంబించేడు. ఉలిక్కిపడి కళ్ళు విప్పింది మాధవి.

"ఏమిటిది ?" తీక్షణంగా అడిగింది మాధవి, దూరంగా జరుగుతూ.

"ఎందుకిలా నన్ను దూరంచేస్తున్నావు మాధవీ ?"

"దూరంచేసింది నేనా? మీరే మీ మనసులో నుండి నన్ను దూరం చేశారు..."

"లేదు మాధవీ! నే నెప్పుడూ దూరం చెయ్యలేదు. నువ్వు నా కెప్పుడూ కావాలి మాధవీ! నీకోసం నే నెలా వేగిపోతున్నానో చూడు." అమెను ఆవేశంగా మీదకి లాక్కున్నాడు. ఆమె ఊపిరి సలపకుండా ముద్దులుపెట్టి ఉక్కిరి బిక్కిరి చేశాడు. ఆమె విసుగ్గా అతడిని త్రోసేసింది.

"దయచేసి వెళ్ళిపొండి. నా మనసు బాగుండలేదు."

"కానీ, నాకు కావాలి నేనిక ఆగలేను." మైకంగా ఆమెమీదకి రాబో యాడు.

"ఛీ! ఛీ!" ఆమె ఛీత్కరించింది. "మీరు మనిషిగా గుర్తుపెట్టుకొని మనిషిగా ప్రవర్తించండి." తీవ్రంగా అంది మాధవి

"మధూ!" దిగ్భ్రాంతిగా పిలిచేడు విజయ్. అతడిలోని మైకం దిగి పోయింది. ఉద్రేకం చల్లారిపోయింది వస్తున్న ఆగ్రహాన్ని బలవంతంగా అణచుకున్నాడు.

"మధూ!" ఏమిటి నీ ఉద్దేశం? మన జీవితాన్ని ఏం చేద్దామనుకుంటు న్నావు!" తీక్షణంగా అడిగేడు.

"అది నే నడగవలసిన ప్రశ్న!"

"నేను చెప్పవలసిందంతా ఎన్నో రోజులనుండి నీకు చెబుతూనే ఉన్నాను కానీ నీకు నామీద నమ్మకం లేదు. జరిగినవేవో జరిగిపోయాయి. ఇప్పుడ యినా జీవితాన్ని చక్కదిద్దుకోవడానికి ఎందుకు ప్రయత్నించవు? నీకు నచ్చని పని నేను చేయనుగా. నన్ను శాసించి ఎందుకు ఒక జీవితాన్ని, సంసారాన్ని సక్రమంగా నడిపించవు?"

"ప్రేమ హృదయంలో సహజంగా జనిస్తుంది. ఎవరిమీద ఆ ప్రేమ జనిస్తుందో వాళ్ళకే ఆ ప్రేమ పొందే హక్కు ఉంటుంది. అధికారంతో శాసించి, బ్రతిమాలి, ఏడ్చి, రాగాలు తీసి ఆ ప్రేమ కావాలని పాకులాడ్డం, ఆ మనసు బల వంతంగా తనవైపు తిప్పుకోవాలని ప్రయత్నించడం నా కసహ్యం." ఖరాకండీగా చెప్పేసింది మాధవి.

"మధూ!" తెల్లబోయాడు విజయ్.

ఆ మరునాటి ఉదయం మాధవి తల్లికి సీరియస్‌గా ఉందని టెలిగ్రామ్ వచ్చింది. ఆలోచించే వ్యవధి కూడా లేకుండా విజయ్ మాధవిని ట్రయిన్

ఎక్కించి వచ్చేడు. మాధవికి వా అంటూ మిగిలిన ఒకే ఒక తల్లికి ఏం జరుగుతుందోనని విజయ్ మనసు ఆందోళనపడసాగి ది.

## 12

మాధవి తల్లి సావిత్రమ్మకి ఆస్తమా కంప్లయింట్ ఉంది. ఆ రోజు బాగా కంగారు చేస్తే ఇరుగుపొరుగువాళ్ళే ఆమెను హాస్పిటల్లో చేర్చి మాధవికి టెలిగ్రామ్ ఇచ్చేరు. మాధవి వెళ్ళేసరికి ప్రమాద పరిస్థితి తప్పి కాస్త సర్దుకుంది ఆమెకి. అయినా ఆమె కొన్నాళ్ళపాటు హాస్పిటల్లోనే ఉండాలన్నారు డాక్టర్లు మాధవికి వెంటనే తిరిగిరావాలన్పించక అక్కడే ఉండిపోయింది ఆమె వెళ్ళిన మూడో రోజునే ఆమె తల్లి ఆరోగ్యం గురించి ఆందోళన వ్యక్తం చేస్తూ ఉత్తరం రాశాడు విజయ్. మాధవి జవాబు రాయలేదు. అయినా మళ్ళీ ఉత్తరం రాశాడు విజయ్,

మాధవి మనసులో తిరిగి ఆలోచనలు ప్రారంభమయ్యాయి. విజయ్‌కి దూరంగా వచ్చేయడంతో అతనిమీద కాస్త కోపం తగ్గి అతని గురించి మంచిగా ఆలోచించసాగింది. విజయ్‌కి తనపట్ల తననుకున్నంత అలక్ష్యం లేదేమో! అతను చెప్పేదంతా నిజమేనేమో. నేను ప్రేమించింది నిన్నే తప్ప మరెవరినీ కాదు అని అతను ఎన్నోసార్లు చెప్పినా తను అనుమానంతో నమ్మలేదు. అతను ముందెప్పుడూ తను ఊహించని సంఘటన జరగడంతో తను నమ్మలేకపోయింది. దానికి తోడు అత్తగారు, తోటికోడలు, ఆడపడుచు మాటలు కూడా తన మనసు మీద బాగా పనిచేశాయి. నిజంగా తనమీద అతనికి ప్రేమే లేకపోతే తను అనుమానంతో అన్నిసార్లు కసిరికొట్టినా తన కెందుకు నచ్చచెప్పాలని ప్రయత్నిస్తాడు? తను ఉత్తరాలు రాయకపోయినా ఎందుకు అంత ఆత్రుతగా ఉత్తరాలు రాస్తాడూ? అతను నిజంగా ప్రియే కావాలనుకుంటే ఆమె అన్ని ఉత్తరాలు రాసినప్పుడు ఎందుకు ఆమె దగ్గరికి వెళ్ళిపోడు? వెళ్ళిపోగలిగితే తనేం అడ్డు లేదుగా. అంత శ్రీమంతురాలు అంత మోజుగా రాస్తే ఏ మగవాడు ఆమెకోసం వెళ్ళిపోకుండా ఆగగలడు? తన విజయ్ గనుకనే ఆమె ఉత్తరాలకి లొంగిపోక తనను బుజ్జగించి, తనను మామూలుగా చెయ్యడానికి ప్రయత్నించేవాడు. తనే అహంకారంతో తన విజయ్‌ని కసిరికొట్టింది. విజయ్ మనస్సెప్పుడూ తనదే. ఆ మనసులో వేరెవరూ స్థానం ఏర్పరచుకోలేరు. తను త్వరగా విజయ్ దగ్గిరకి వెళ్ళిపోవాలి.

కానీ, కానీ, అతను ప్రియవెంట బాబు స్థితి కూడా మర్చిపోయి శ్రీకాకుళం వెళ్ళిపోవడం, తమ వాదనలో ప్రియకి కూడా తనమీద హక్కు ఉందనడం, ఆమెని కించపరచవద్దని హెచ్చరించడం, ఆమెని తనకి ఉత్తరాలు రాయవద్దని కచ్చితంగా ఆమెకి రాయలేకపోవడం, వీటిని తను ఎంత ప్రయత్నించినా మర్చిపోలేకపోతూంది. ఇవే మాటిమాటికి ఆమె మనసుకి గుచ్చుకుని గాయం చేస్తున్నాయి. ఆమె ఎన్నో విషయాల్లో చాల విశాలంగా ఉన్నా ఈ విషయంలో మటుకు చాలా స్వార్థపరురాలు తన భర్త తన ఒక్కదానిని మాత్రమే ప్రేమించాలి. మానసికంగా, శారీరకంగా తనని మాత్రమే కోరుకోవాలి తన బిడ్డలకి మాత్రమే అతడిని తండ్రిగా పిలిచే అధికారం ఉండాలి. అతని మనసు మీద మరో ఆడదాని నీడ కూడా పడడానికి ఆమె ఒప్పుకోదు. పడితే సహించలేదు. అటువంటి పరిస్థితే సంభవిస్తే ఆమె జీవితాన్నయినా వదులుకుంటుంది గాని రాజీ మాత్రం పడదు. తొందరపడకుండా ఇంకా కొన్నాళ్ళు తన భర్త మనసుని పరీక్షకి పెట్టడానికే నిర్ణయించుకుంది మాధవి....

## 13

అప్పుడే ఇంటికొచ్చిన విజయ్ బట్టలు మార్చుకుంటూండగా ఎవరో కుర్రాడు వచ్చి పిలిచేడు. "నేను సుందరమ్మగారి పక్కింటి అబ్బాయినండీ! మిమ్మల్నెందుకో మీ అమ్మగారు అర్జంటుగా రమ్మంటున్నారు." అన్నాడా అబ్బాయి.

విజయ్ తిరిగి బట్టలు వేసుకుని బయలుదేరాడు. వీధి గుమ్మంలోనే నవ్వుతూ స్వాగతమిచ్చిన ప్రియను చూడగానే నివ్వెరపోయాడు.

"ఏం మహానుభావా! జడుచుకున్నావా?" అంది వెక్కిరింతగా ప్రియ.

"నువ్వేం దయ్యానివా? భూతానివా జడుచుకోవడానికి?" అంటూ లోపలికి నడిచేడు విజయ్. అతడిని తల్లి చాలా ఆదరంగా పలకరించింది. ఇల్లంతా చాలా సందడిగా ఉంది. వంటింట్లో పిండివంటల ఘుమఘుమలు తేలి వస్తున్నాయి. ఇదంతా ప్రియ వచ్చిన సంతోషం అనుకున్నాడు విజయ్. పిల్లలు యాపిల్స్, సపోటాలు తెగ తెచ్చుకుని తింటున్నారు. వాళ్ళకి అవే కాకుండా ఏవో కానుకలు కూడా తెచ్చినట్టుంది ప్రియ. అందుకే వాళ్ళ మొహాలు దేదీప్యమానంగా వెలిగిపోతున్నాయి.

"ఎప్పుడొచ్చేవు ప్రియా?" ఇంటి వాతావరణాన్ని పరిశీలిస్తూనే అడిగేడు విజయ్.

"ఇప్పుడేతే! ఎందుకొక్క నది తిట్టుకుంటున్నావా?"

"బావుంది. మధ్య నేను తిట్టుకోవడ మేమిటి మీ మేనత్తగారింటికి నువ్వొస్తే?"

"బొనురా. అది నా మేనకోడలే. చూడరా ఈ చీర. కొడుకులు మీరుండి కూడా నా కిటువంటి చీర కొన్నారా ఎప్పుడైనా? అది నా మేనకోడలు కాబట్టి ఇనాళ్ళకి నేను కోరుకున్న చీర కొనితెచ్చింది. దానికి నేనన్నా, మన కుటుంబమన్నా ఎంత అభిమానం! నవనీతం లాంటి మనసు దానిది. ఏమిటో భగవంతుడే దానికి అన్యాయం చేశాడు గాని...." చేతిలో చీర చూపించిన సుందరమ్మ నిట్టూర్చుతూ అంది.

"అన్నయ్యా? ఇప్పుడే ఆఫీసు నుంచి వచ్చినట్టున్నావు. స్నానం చేస్తావా?" రెండో చెల్లెలు జయ వస్తూ అంది.

విజయ్ బుర్రలో వెయ్యి ఆలోచనలు పరుగెడుతున్నాయి. ఎన్నో ప్రశ్నలు తలెత్తుతున్నాయి. చాలా చిరాగ్గా కూడా అన్పించింది. మాట్లాడకుండా జయ వెంటవెళ్ళి స్నానంచేసి వచ్చేడు.

అతను వచ్చేసరికి తల్లి టిఫిన్, కాఫీ సిద్ధంచేసి పెట్టింది. అతనేమీ అనకుండా తినసాగాడు.

"ఏమిటో బిడ్డకి నా చేత్తో తిండి పెట్టుకుని ఎన్నాళ్ళయిందో!" అతనివంక ఆప్యాయంగా చూస్తూ అంది సుందరమ్మ.

"అన్నయ్యా! పది నెలాగూ లేదుగా! తను వచ్చేవరకూ నువ్విక్కడే ఉండకూడదూ? ఎవరూ లేనివాడిలా హోటల్లో తినడం ఏమిటి?" పెద్ద చెల్లెలు అంది.

"హు! అంత అదృష్టమా నా మొహానికి. పిదలాచేస్తే ఆవిడగారు వచ్చిన తరువాత వీడినేమయినా ఉంచుతుందా అసలు?" సుందరమ్మ అంది.

ప్రియ ఫక్కున నవ్వింది. "హాం! నాకయితే వాళ్ళావిడంటే చాలా భయంలాగుంది."

"మరింక అడక్కమ్మా! నువ్వే అన్నావుగా, వాళ్ళావిడకి భయపడే వీడు ఉత్తరాలు కూడా రాయడంలేదని. నేను పెడిదేతప్పు ముద్దు ఎత్తని బిడ్డని కొంగున కట్టేసుకుంది. వాడి మొహం చూడ్డానికే నాకు కరువు చేసేసింది. అన్నదమ్ములు, అక్కచెల్లెళ్ళు అంటే పడిచచ్చేవాడు. ఇప్పుడు వీడికి




వాళ్ళ పొడే గిట్టడంలేదు. కని, పెంచిన మేమింత పరాయివాళ్ళమయిపోయాము. ఇప్పుడు వాడికి పెళ్ళాంతప్ప లోకం లేదు."

"అమ్మా!" అసహనంగా అరిచేడు విజయ్. తల్లిమాటలు అతని మనసుకి ముల్లు గుచ్చుతున్నట్టున్నాయి.

"ఇష్టంవచ్చినట్టు మాట్లాడకమ్మా! మా ఇద్దరి మధ్య ఉన్న అనుబంధం మీ కెవరికీ అర్థంకాదు. నేనే వేరుకాపురం పెట్టేను గాని, ఇందులో ఆమె తప్పేం లేదు.

"వాళ్ళావిడమీద ఈగను కూడా వాలనిచ్చేట్టులేడే. లోకంలో మీ ఇద్దరే అపురూప దంపతులు. కదూ బావా? వీళ్ళెవ్వరూ భార్యాభర్తలు కారు. వీళ్ళెవ్వరికీ మీ కున్నలాంటి అనుబంధం లేదు," ప్రియ అంది. విజయ్ మొహం కోపంతో ఎఱ్ఱబారింది.

ఇదంతా విజయ్ వదిన లక్ష్మికి నచ్చలేదు. "ఒక్కొక్కళ్ళకి ఒక్కొక్క లాంటి అనుబంధా లుంటాయి. అవి అందరికీ అర్థంకావు. అతడిని పనిగట్టుకుని పిలిచింది ఇందుకా అత్తయా! జరిగిపోయిన సంగతులన్నీ ఇప్పుడెందుకు త్రవ్వుకోవడం?" అందామె.

ఈలోపున విజయ్ అన్నయ్య కృష్ణ, తమ్ముడు రామం, విశ్వం బయట నుండి వచ్చేరు. అందరూ ప్రియని, విజయ్‌ని పలుకరించేరు. భోజనాలయిన

తరువాత ఎవరి గదుల్లోకి వాళ్ళు వెళ్ళిపోయారు. ప్రియ ఆడవాళ్ళతో మాట్లాడుతూ వంటింట్లో ఉంది. పుస్తకం చదువుకుంటున్న విజయ్ దగ్గరికి వచ్చింది సుందరమ్మ.

"ప్రియ ఎంత బాధపడుతుందో తెలుసా విజయ్?" అంది.

ఆశ్చర్యంగా తలెత్తాడు విజయ్. "ఎందుకమ్మా?"

"ఎందుకేమిటి? తను నీకు రమ్మని ఎన్ని ఉత్తరాలు రాసినా ఒక్కసారి కూడా వెళ్ళలేదట. ఆ తరువాత నువ్వు జవాబులు కూడా రాయడం మానుకున్నావట. లంకంత అస్థి, ఆడకూతురు. అందులో ఉన్న చిక్కులూ, గొడవలూ ఏం తట్టుకోగలదు. దానికి అయినవాళ్ళం మనం తప్ప ఎవరున్నారు? మనం కాకపోతే దానిని ఎవరాదుకుంటారు? వాళ్ళ నాన్న ఉన్నప్పుడు దాన్నెంత గారాబంగా పెంచేడు. కాలు క్రిందపెట్టనిచ్చేవాడా? దాన్ని బంగారం ఎత్తుగా చూచేడు. మనకి అదృష్టంలేక అది మనకు దక్కింది కాదు గాని, అలాంటి దానికి ఎన్ని చిక్కులు! అది మానసికంగా ఎంత బాధపడ్తూందో తెలుసా? ఏదో అందరిలో నువ్వుకాస్త తెలివైనవాడివని, తన గొడవలన్నీ నువ్వే సరిదిద్దగలవని నీకు రాసి బ్రతిమాలితే మా ఆవిడ ఒప్పుకోదు అని రాస్తావా? దాని మనసు ఎంత బాధపడ్తుంది? చిన్నప్పటి నుంచీ కలిసిమెలిసి పెరిగిన తనకంటే, రక్త సంబంధం కంటే నిన్నగాక మొన్న వచ్చిన భార్య ఒప్పుకోవడం ముఖ్యమా? అని అది ఎంతేడుస్తూందో తెలుసా? చిన్నప్పటినుండీ నీ మీద కాస్త ప్రత్యేకమైన అభిమానం కూడా పెంచుకుంది. ఆ చనువుతోనో, అధికారంతోనో నిన్ను అడగ్గలిగింది గాని, వేరెవరినైనా అడగ్గలిగిందా? ఏదో రెండు రోజులు వెళ్ళి దాని వ్యాపారం అదీ చూసి ఆ సమస్యలేవో విడగొడితే నీ పెళ్ళానికి జరిగే నష్టం ఏముంది? నీకు పెళ్ళిచేస్తే నువ్వో ఇంటివాడివవుతావనుకున్నాను గాని ఇలా అయినవాళ్ళందనీ వదులుకుంటావనుకోలేదు." మెత్తగా చీవాట్లేసింది సుందరమ్మ. విజయ్ ఏమీ మాట్లాడలేదు.

తరువాత "నేను సినిమాకి వెళ్ళాలనుకుంటున్నాను, వస్తానమ్మా!" అంటూ లేచేడు విజయ్.

"నేనూ వస్తాను బావా!" అంది ప్రియ ఇవతల కొస్తూ.

"నేను ఫ్రెండ్స్‌తో కలిసి వెళ్ళాలనుకుంటున్నాను."

"మీ ఫ్రెండ్సేమీ నన్నెత్తుకుపోరులే. నేనూ వస్తాను."

"పోనీ తీసుకెళ్ళరా! అదంత ముచ్చటపడుతుంటేను." అంది సుందరమ్మ. ఆమె కళ్ళలో ఆజ్ఞ ఉంది. విజయ్ మౌనం వహించేడు.

"రెండు క్షణాలు" అంటూ లోపలికెళ్ళిన ప్రియను చూడగానే యువకుల గుండెలు ఝల్లుమనిపింపేటంత ఆకర్షణీయంగా అలంకరించుకుని వచ్చింది. నల్లని బార్డర్‌మీద చక్కని డిజైన్ ఉన్న తెల్లని ఫారెన్ నైలెక్స్ చీర పాము పొరలా అతి పల్చగా ఉంది. స్లీవ్‌లెస్ జాకెట్టు ఆమె దేహసౌందర్యాన్ని తేట తెల్లంచేస్తూంది. చెవులకి ముత్యాల లోలకులు, మెడలో ముత్యాలహారం, కుడి చేతికి ఖరీదైన వాచీ, నుదుటిమీద ఇరుప్రక్కలా కత్తిరించుకున్న జుట్టు రింగులు తిరుగుతూ, నల్లని చుక్కబొట్టుతో దేవకన్యలా మెరిసిపోసాగింది ప్రియ. ఆమె రాసుకున్న ఖరీదైన సెంటు ఫర్లాంగు దూరంవరకు వ్యాపిస్తూంది.

ఆమెను చూడగానే విజయ్‌తోపాటు సుందరమ్మ కూడా క్షణంసేపు కళ్ళు తిప్పుకోలేకపోయారు. విజయ్‌వెంట బయల్దేరిన ప్రియని నయనానంద కరంగా చూడసాగింది సుందరమ్మ.

సినిమా చూస్తున్న విజయ్ మనసు సినిమాలో లగ్నంచేయలేకపోయాడు అతడి ప్రక్కన కూర్చున్న ప్రియ ఒంటినుండి వచ్చే సెంటు ఘుమఘుమలు అతడి మనసుకి మైకం కలిగించసాగింది మెదడులోనున్న విచక్షణాజ్ఞానాన్ని క్రమంగా అతనినుండి దూరంచేయడానికి ప్రయత్నించసాగింది ఆమె ఒళ్ళు అప్పుడప్పుడు అతనికి మెత్తగా తాకుతూ శరీరానికి ఒక విధమైన మత్తును, కలవరాన్ని కలిగించసాగింది. స్థిమితంగా కూర్చోలేకపోయాడు విజయ్.

సినిమా అయిన తరువాత విజయ్ స్కూటర్ తల్లిగారింటి వైపుకు పోనివ్వబోయాడు "అబ్బ! అక్కడికొద్దు బావా! ఇల్లు చిన్నది. మనుషులు ఎక్కువ. నాకు ఊపిరి ఆడనట్టుగా ఉంటుంది. మీ ఇంటికి పోనివ్వు" అతని మెడచుట్టూ చేతులు వేస్తూ మార్దవంగా అంది ప్రియ.

అతడు మనసులోనే ఉలిక్కిపడ్డాడు. తటపటాయించసాగేడు. "అబ్బ! ఏమిటి బావా ఆలోచన? నాకు నిద్రొస్తోంది త్వరగా పోనివ్వు." అంది. విజయ్ మరేం ఆలోచించకుండా స్కూటర్ తన ఇంటివేపు తిప్పేడు.

## 14

"మొత్తానికి మీ ఆవిడని చాలా అభినందించాలి." అంది ప్రియ ఇంటినంతా పరిశీలనగా చూస్తూ.

"ఎందుకని ?" ఇద్దరు మార్చుకోబోతూ అడిగేడు విజయ్.

"నిన్ను తన గుప్పెటలో చక్కగా ఇరికించుకుంది. తనమాట జవదాటకుండా చేసుకుంది " చనువుగా అతని చొక్కా గుండీలు విప్పుతూ అంది. ఆమె అంత దగ్గిరగా ఉంటే అతనిలోని నిగ్రహం కొంచెం కొంచెం జారుతున్నట్టుగా ఉంది.

"నువ్వు కాస్త దూరంగా ఉంటే మంచిది." అన్నాడు తనే దూరంగా జరుగుతూ. ప్రియ సమ్మోహనంగా నవ్వింది.

"ఏం మీ ఆవిడకి తెలుస్తుందని భయమా ?"

"నాకేం భయంకాదు ఆమె నన్ను తన గుప్పెటలో ఇరికించుకోవడం, తన మాట జవదాటకుండా చేసుకోవడం కూడా కాదు. అదంతా నేనామెకిచ్చే గౌరవం. ఆమెకు నా మనసులో ఇచ్చే స్థానం "

"పెద్ద బావా ఇలా కాకపోతే ఇంకెలా చెప్పుకుంటావులే. ఆమె అంటే నీకంత భయం కాబట్టే ఆమెకంత అహంకారం. తనమాట కాదనవనే గర్వం. నిన్ను తన చెప్పుచేతల్లో ఉంచుకోగలననే అహంభావం "

"ప్రియా ! అసలు నువ్వొచ్చిన కారణమేదో చెప్తే బాగుంటుంది." అసహనంగా అడిగేడు విజయ్.

"నే నొచ్చిన కారణం నీకు తెలీదా ? మీ ఆవిడ లేదని తెలిసే వచ్చేను. నిన్ను నా వాడిని చేసుకోవడానికే వచ్చేను. అత్తయ్యకి కూడా మన ఇద్దరం ఒకటవడం ఇష్టమే. పెద్దలకి కూడా సమ్మతమయినప్పుడు ఇంకా ఏమిటి నీ అభ్యంతరం ?" అతని విశాలమైన ఛాతీమీద మునివ్రేళ్ళతో రాస్తూ అడిగింది ప్రియ.

చాలారోజులనుండి స్త్రీ సాంగత్యానికి దూరమయిన విజయ్ శరీరం ప్రియ సాన్నిహిత్యంలో, ఆమె ఆకర్షణలో వాంఛాపూరిత మయిపోతూంది. మనసు తనకు తెలియకుండానే కోరికకి లొంగిపోతూంది. అయినా అతనిలోని అతి శక్తివంతమైన వివేకం అతనిలోని నిగ్రహాన్ని సడలిపోనివ్వడంలేదు.

"ఆలోచించుకో బావా ! నన్ను నిరాశపర్చకు. నా మనసుని చిత్రవధ చెయ్యకు. చూడు నా శరీరం నీ కోసం ఎలా తపించిపోతూందో. నా ఈ అందం, ఈ యవ్వనం అంతా నీ కోసమే పదిలంగా దాచుకున్నాను. ఈ రాత్రిని వృధా చెయ్యకు. నన్ను నీలో కలుపుకో. నా మనసుని, శరీరాన్ని శాంతింపజెయ్యి."

విపరీతమైన కోరికతో కైపెక్కిన ప్రియ సిగ్గు సంకోచం అన్నీ వదిలేసి ఆవేశంగా అతని గుండెమీద వాలిపోయింది.

విజయ్ ఆమెని రెండు చేతులతోనూ పట్టుకుని దూరంగా విలవేశాడు. "ప్రియా! క్షణికావేశానికి లోనై మన ప్రాణస్నేహితుల్ని నమస్కారింపజేసుకోవడం ఉచితమైన పని కాదు నన్ను రెచ్చగొట్టకు. పవిత్రతకి మాధవి ప్రాణమిస్తుంది నేను మధుకి ద్రోహం చెయ్యలేను. దయచేసి దూరంగా వెళ్ళు." అన్నాడు తనలో చెలరేగుతున్న కంపనని,సంచలనాన్ని బలవంతంగా అణచివేస్తూ.

ప్రియ అభిమానం దెబ్బతింది ఆమెలో ఆగ్రహం తాటి ప్రమాణాని లేచింది. "ఏమిటీ? నువ్వు మాధవికి ద్రోహం చెయ్యలేదా? ప్రేమించి, నీ కోసం అభిమానం వదులుకొని వచ్చిన నన్ను తిరస్కరించడం ద్రోహంకాదూ? అసలు కారణం అదికాదు. ఇన్నాళ్ళూ మధుకోసం, మధుకోసం అంటూంటే నిజమే అనుకున్నాను. కానీ నువ్వు సంకోచించేది మధుకోసం కాదు. నాలాంటి ఆడది కోరివస్తే నపుంసకుడయినా వెనుకంజ వెయ్యలేడు. నువ్వు ఇలా చేస్తున్నావంటే, నీలో ఏ మాత్రం వాంఛా కలగడంలేదంటే నువ్వసలు మగాడివే కాదు. నీ కసలు ఏమీ చేతకాదు. నీకు భార్యమీద ఉందనే ప్రేమ, నీ పవిత్రత నీ ఆదర్శం ఇవన్నీ నీ చేతకానితనం కప్పిపుచ్చుకోవడానికి వేసుకున్న ముసుగులు. నీలాంటి చేతకానివాడిని, మగతనమే లేనివాడిని నమ్ముకోవడం, అన్నీ అర్పించాలనుకోవడం నాది బుద్ధి తక్కువ. ఛీ ఛీ"

"ఏమన్నావ్?" అంతులేని ఆగ్రహాన్ని పళ్ళబిగువున అపుకుంటూ ఆమె రెండు భుజాలు గుచ్చి పట్టుకున్నాడు విజయ్. ఆమె మాటలతో అతని పురుషాహంకారం విపరీతంగా దెబ్బతింది. పూర్తిగా రెచ్చిపోయాడు విజయ్. అతని లోని వివేకం, విచక్షణ అతనికి తెలియకుండానే ఎగిరిపోయాయి. తను మగవాడో కాదో ఆ క్షణంలోనే తెలియజెయ్యాలనే పట్టుదల హెచ్చింది అతడిలో "నేను మగవాడినే కాదా? నాకు చేతకాదా? నీ కిప్పుడే చూపిస్తాను. నేను మగవాడినో కాదో, నాకు చేతనవునో కాదో." ఆవేశంగా ఆమెని తనమీదికి లాక్కుని ఉక్కిరిబిక్కిరి చేస్తూ కసిగా నలిపేయసాగేడు. ప్రియ విజయగర్వంతో మనసులోనే నవ్వుకుంది. ఆమెకి కావలసినది అదే.

ఏ బలహీనపు క్షణంలో విజయ్ ప్రియకి అధీనమయిపోయాడో ఆ క్షణంలోనే అతని మనసులోని మాధవిరూపు క్రమంగా మరుగునపడడం ప్రారంభించింది.

# 15

మనిషి కోరికకి బానిస కాకపోవాలి. ఒకసారి కోరికకి బానిసయిన తరువాత, దిగజారడమంటూ ప్రారంభించిన తరువాత ఇక ఆ మనిషికి లోకమే గుర్తుండదు. ఉచితానుచితాలు క్రమంగా మర్చిపోతాడు. ప్రియ ఆకర్షణలో పూర్తిగా మునిగిపోయాడు విజయ్. ఇప్పు డతడికి ప్రియే లోకం. పది రోజులు అతనికి ప్రియతో పదిక్షణాల్లా గడిచిపోయాయి. సినిమాలు, షికార్లు ఎక్కడ చూచినా వాళ్ళే అయి తిరిగేరు. విజయ్‌లో ఈ పరివర్తన సుందరమ్మకి చాలా సంతోషం కలుగజేసింది.

అతడు మొదటిసారిగా ప్రియకి వశమయిపోయిన తరువాత మాధవిని తలుచుకుని చాలా బాధపడ్డాడు.

కానీ ప్రియ దాన్ని చాలా తెలివిగా మాపివేసింది. "మానసికంగానే కాదు ఇప్పుడు శరీరకంగా కూడా నీకే అంకితమయిపోయాను. నా జీవితాన్ని చక్కదిద్దవలసిన బాధ్యత ఇప్పుడు నీమీద ఉంది. నా బతుకుని నవ్వులపాలు చేస్తావో, వెన్నెలబాట చేస్తావో నీ ఇష్టం." అంటూ కర్తవ్యం గుర్తుచేసింది.

మాధవికి అహంకారమని, అభిజాత్యమనీ అవనీ ఇదనీ వీలున్నప్పుడల్లా అతడికి మాధవి మీద విముఖత కలుగజేయడానికి ప్రయత్నించేది. తల్లి మాటలు కూడా కొంత తోడయ్యాయి.

అతని మనసులో నుండి మాధవి తాత్కాలికంగా అడుగునపడిపోయి ఆ మనసు మీద ప్రియ ప్రభావం బాగా పనిచేయసాగింది. విజయ్ కుటుంబ సభ్యులందరికీ ప్రియ మళ్ళీ తమలో కలుస్తూండడం ఆనందం కలుగజేసింది, కానీ విజయ్ వదిన లక్ష్మికి మాత్రం ఇదంతా చాలా అన్యాయంగా తోచింది. ప్రియ అంటే కంపరం ఏర్పడింది. ఆమె ఇక్కడ పరిస్థితులేమి రాయకుండా మాధవిని ఉన్నపళంగా బయలుదేరి రమ్మని ఉత్తరం రాసింది. ఏ విధంగానైనా మాధవికి అన్యాయం జరక్కూడదని ఆమె తపన. మాధవి వస్తే తన బతుకుని చక్కదిద్దుకుని ప్రియకి బుద్ధిచెప్పగలదని నమ్మకం.

మాధవి తల్లి సావిత్రమ్మ హాస్పిటల్ నుండి ఇంటికి వచ్చేసింది. ఇప్పుడామెకి బాగా తగ్గింది జబ్బు. మాధవికి కూడా ఇక బయల్దేరి వచ్చేద్దామనుంది. అంతలో తోడికోడలు లక్ష్మి అర్జంటుగా రమ్మని రాసిన ఉత్తరం అందింది. ఏం జరిగిందో, తన విజయ్ ఎలా ఉన్నాడోనని ఆందోళనపడింది మాధవి. తను అతని విషయంలో చాలా మూర్ఖంగా ప్రవర్తించి అతన్ని చాలా బాధ

పెట్టిందేమో ! విజయ్ ఆ బాధతో, తన వియోగంతో వేళకి సరిగా తిండి తిప్పలు తినక ఒంటికేమైనా తెచ్చుకున్నాడేమో. మాధవి మనసు ఎడతెరిపిలేని ఊహలతో తల్లడిల్లింది. ఆ క్షణంలోనే ఆమె భర్తమీద అన్ని శంకలూ వదులుకొని, అతనిపట్ల హృదయపూర్వకమైన ప్రేమతో బయలుదేరింది.

## 16

సోఫాలో ప్రియఒళ్ళో తలపెట్టుకుని పడుకున్నాడు విజయ్. ప్రియ గోముగా కబుర్లు చెబుతోంది. విజయ్ పరవశంగా వింటున్నాడు ఉన్నట్టుండి ప్రియ తలవంచి ఆమె పెదాలు గాఢంగా చుంబించేడు విజయ్ "ఛీ ! పాడు." కొంగుతో తుడుచుకుని బుంగమూతి పెట్టింది.

"నిన్ను చూస్తే ఎవరైనా పెద్ద మనిషివని అనుకుంటారుగాని ఇంత అల్లరి వాడివి, రసికుడివి అనుకోరు" అంది ప్రియ

"ఎవరు అనుకోకపోయినా ఇప్పుడు నువ్వు తెలుసుకున్నావుగా నేను రసికుడినో కాదో." అన్నాడు విజయ్ ఆమె బుగ్గ గిల్లుతూ.

"ఇన్నాళ్ళూ ఈ ప్రేమంతా ఎక్కడ దాచుకున్నావు ? నాకోసం రాకుండా ఎలా ఉన్నావు బావా ?" అతని తలలో వేళ్ళు దూర్చుతూ అంది.

"నాకోసం ఇంతగా తెగించే మరదలవు నువ్వని తెలియక...."

అతని మాటలింకా మధ్యలోనే ఉండగా "నాన్నా !" అన్న బాబిగాడి కంఠం అతి దగ్గరగా వినిపించేసరికి ఇద్దరూ ఉలిక్కిపడ్డారు. వాళ్ళ మైకం దిగిపోయింది.

"ఎలా వచ్చేవురా నువ్వు ?" తేరుకుంటూ లేచి కూర్చుని అడిగేడు విజయ్.

"అమ్మ కూడా వచ్చింది. అగో అక్కడుంది" వేలు పెట్టి గుమ్మం వంక చూపించేడు బాబిగాడు.

ప్రియా, విజయ్ లిద్దరూ ఒక్కసారిగా తలలు తిప్పి గుమ్మంలోనే ఆగిపోయిన మాధవికేసి చూసి షాకతిన్నారు.

మాధవి గుడ్లప్పగించి ఇటే చూస్తోంది. ఆమెకు సర్వం అర్థమయిపోయింది. నోట్లో నుండి చిన్న శబ్దంకూడా రావిదానిలా, రెప్పవేయలేనిదానిలా బొమ్మలా బిగుసుకుపోయింది. ఆమె గుండెలు బ్రద్దలయిపోయాయి. ప్రేమించే హృదయం ముక్కలయిపోయింది తలమీద సమ్మెటపోట్లు ప్రారంభమయ్యాయి. ఆమెలో సర్వశక్తులూ ఉడిగిపోయాయి. నిలుచునే శక్తి

కూడా లేదు. కళ్ళు చీకట్లు కమ్ముసాగేయి. నరాలు కూడా నిస్సత్తువయిపోయిన మాధవి తూలిపడబోయింది. ఎలాగో నిగ్రహించుకొని గుమ్మం ఆసరగా చేసు కొని కూలబడిపోయింది. ఆమెలో ఏడవడానికి గాని, ఆగ్రహం చూపించడానికి గాని అసలు ఓపికే లేదు.

ఆమె పరిస్థితినంతా చూస్తూ ఆమె మొహంలోని భావసంఘర్షణనంతా చదువుతున్న విజయ్ కంగారుగా ఆమె దగ్గరికి వెళ్ళేడు ఆమెను పట్టుకొని లేవదియ్యడానికి ఏదో తెలియని సంకోచంగా, అపరాధం చేసినట్టుగా అన్పించి తటపటాయిస్తూ ఆగిపోయాడు.

"మధూ!" అని పిలవడానికి కూడా అతనికి నోరు పెగలడంలేదు.

ఆమె ప్రియ వంక, విజయ్‌వంక మార్చిమార్చి చూడసాగింది. క్రమంగా ఆమె మనసు కుదుటపడుతూ గట్టిపడసాగింది. ఆమె చూపులకి స్థిరత్వంవచ్చి మొహం గంభీరంగా తయారయింది. ప్రపంచం తలక్రిందు లయిపోయేటప్పుడుండే భావం, బేలతనం ఇప్పుడామెనుంచి దూరమయ్యాయి. తనవంకే బిక్కు బిక్కుమంటూ చూస్తున్న బాబిగాడిని చెయ్యిపట్టి దగ్గిరకి లాక్కుంది. మెల్లగా లేవబోయింది.

"ఏం జరిగింది మధూ! ఎందుకలా పడిపోయావు. లే." ఆమెను లేవడానికి చెయ్యి అసరా ఇవ్వబోయాడు విజయ్.

"ఇంకా చచ్చిపోలేదు లెండి. మరేం కంగారుపడొద్దు." అంటూ లేచి నిలుచుంది మాధవి. ఆమెకు మెల్లగా నచ్చజెప్పాలనుకుంటున్నాడు విజయ్ కానీ ఎలా చెప్పాలో తెలియడంలేదు.

"లోపలికి రా మాధవీ!" ప్రియ పిలిచింది. తన ఇంటికి తననే ఆహ్వానిస్తున్న ప్రియను చూసి మనసులోనే నవ్వుకుంది మాధవి.

మాధవి లోపలికి వచ్చింది. తన చేతులతో తను అన్నీ అమర్చిపెట్టుకున్న వస్తువుల కేసి దీక్షగా చూడసాగింది. అవన్నీ తనకు పరాయిసొత్తు అయినట్టుగా, వాటికిప్పుడు యజమానురాలు ప్రియ అయినట్టుగా అన్పిస్తోంది. తన పడకగదిలోకి వెళ్ళింది. అక్కడ కూడా అన్నీ పరికించిన మాధవికి అక్కడ క్షణంకూడా నిలవాలన్పించలేదు. తక్షణం బయటకి రాబోయింది. విజయ్, విజయ్ వెంట ప్రియ లోపలికొచ్చేరు.

"అలా కూర్చో మాధవి నీతో మాట్లాడాలి." అన్నాడు విజయ్.



"తరువాత మాట్లాడుకోవచ్చు. ముందు మధుని స్నానంచేసి కాఫీ, టిఫిన్ తీసుకోనివ్వండి." ఎక్కడలేని ఆప్యాయతని ఒలికిస్తున్న ప్రియవంక ఏహ్యంగా చూసింది మాధవి.

"నాకిప్పుడవేమీ అక్కరలేదు. మీరేం మాట్లాడతారో నాకు తెలుసు. అయినా చెప్పండి వింటాను. ఇక్కడ మాత్రం కాదు. హాల్లో కూర్చుందాం రండి." తొణుకూ బెణుకూలేకుండా నిశ్చలంగా అన్న మాధవి హాల్లోకి దారి తీసింది.

ఆమెకేసి సూటిగా చూడలేకపోతున్నాడు విజయ్.

"ఇందుకు నువ్వు బాధపడతావని తెలుసు మధూ! అయినా నువ్వు

మమ్మల్ని అర్థంచేసుకుని రాజీపడతావని, మన జీవితాల్ని సాఫీగా సాగనిస్తావని ఆశపడ్తున్నాను." కళ్ళెత్తి చూసింది మాధవి అతనికేసి. ఆ కళ్ళలో వ్యంగ్యం కనిపించిం దతనికి. చూపులు త్రిప్పుకున్నాడు.

"ఒక బలహీనమైన క్షణంలో ప్రియని కలుషితం చేశాను నేను. అందుకు అవకాశం ప్రియే కల్పించినా, ఆమెమీద నాకుండే ఆకర్షణ కూడా అందుకు దోహదంచేసింది. ఏది ఏమైనా నావల్ల కలుషితమైన ప్రియని ఆదుకో వలసిన బాధ్యత నామీదుంది. ఆమెను అన్యాయం చెయ్యలేను. ఇందుకు నన్ను నువ్వు క్షమించాలి "

మాధవి కళ్ళలోకి ఆగ్రహం మెల్లగా రాసాగింది.

విజయ్ మళ్ళీ కొనసాగించేడు. "నేను మీ ఇద్దరితోనూ జీవితాన్ని కొనసాగించా లనుకుంటున్నాను. ఇందుకు నీ సహృదయం, సహకారం, అంగీ కారం కావాలి "

"హుం!" పేలవంగా నవ్వింది మాధవి. "మీరు చెప్పింది చెయ్యడానికి నేను మనిషినండీ, జంతువును కాను. జంతువులు చూడండి ఎన్నిటితోనో సాంగత్యం చేస్తాయి. ఆ చేసినవాటిని గుర్తుకూడా పెట్టుకోవు. దేనిమీదా ప్రత్యేకమైన అభిమానం ఉండదు. వాటి ముఖ్యోద్దేశం ఏమిటంటే ఏదో విధంగా, దేనితోనో ఒకదానితో వాటి దాహం తీరిపోవడమే. కామక్రియ జరిగి పోవడమే. అంతవరకే అవి ఆలోచిస్తాయి "

"ఆపు." క్రోధంగా అరిచింది ప్రియ. "అంటే మేము నీ దృష్టిలో జంతువులమా? నువ్వొక్కదానివిఫ్లే మనిషివా? నీకెంత అహంకారం! మా ఇద్దరి మధ్యవున్న ప్రేమకి నువ్వింత హీనమైన అర్థం కల్పిస్తావా? అతడు నా స్వంత బావ. అతడిని ప్రేమిస్తాను. అతడికి అన్నీ అర్పిస్తాను. నా వాడిని చేసుకుంటాను. నాకా హక్కు ఉంది. కాదనడానికి నువ్వెవరు మధ్య. నీకే కాదు నాకు కూడా ఇప్పుడు బావమీద అధికారం ఉంది." ఆవేశంతో ఊగి పోతూ అంది ప్రియ.

స్థిరగంభీరంగా నవ్వింది మాధవి. "నీ హక్కుని, అధికారాన్ని కాదనటం లేదే. నీకు ఈ బావ ఒక్కరిమీదే కాదు, ఇంకా నలుగురు బావలున్నారు. వాళ్ళందరిమీదా హక్కులు, అధికారాలు ఉన్నాయి. ఒకరి తరువాత ఒకరిగా వాళ్ళందరినీ ప్రేమించొచ్చు. వాళ్ళందరికీ అన్నీ అర్పించుకోనూవచ్చు."

"ఏమన్నావ్ !" అపుకోలేని ఆగ్రహంలో చెయ్యెత్తింది ప్రియ. వెంటనే విజయ్ ఆమె చేతిని గట్టిగా పట్టుకున్నాడు.

"అవకాశం వచ్చింది కదా అని అసభ్యంగా మాట్లాడకు మధూ !" హెచ్చరికగా అన్నాడు విజయ్.

"సభ్యత, అసభ్యత అవి అసలు ఎలా ఉంటాయో తెలుసా మీకు ? సంసార గృహంలో ఇటువంటివి సాగించడం అసభ్యత కాదూ ?" కంపరంగా అడిగింది మాధవి

"ఛీ ! ఛీ ! చూడు బావా ! ఎలా మాట్లాడుతుందో. ఇదంతా ఆమెకు నువ్విచ్చిన అలుసు కాదూ ? భర్తపోయి, ఆదరించేవాళ్ళు పోయి నేనెలా అలమటిస్తున్నానో ఈమెకేం తెలుసు ? నా అనే మగతోడులేక పిసరంత ఆపేక్షకోసం, ప్రేమకోసం, వయసు బరువుతో కోరికలుపెట్టే బాధలో నేనీ ఇంటికి వచ్చి నీతోడు కోరుకున్నానని చూడు ఎంత అసభ్యంగా మాట్లాడుతుందో. ప్రేమాభిమానాలు కరువై పోయి వాటికోసం తపించే ఆడదానిని సాటిఆడదానిగా గుర్తించి అర్థంచేసుకోవడానికి ఎంత విశాలహృదయం ఉండాలి. ఈమె అసలు ఆడదై తేగా " ప్రియ ఆగ్రవేశాలతో అరవసాగింది.

"ఔను. నిజమే. నేను ఆడదాన్ని కాదు. నాకు విశాలత్వం, సహృదయం లేదు. నువ్వు చాలా విశాలహృదయురాలివి కాబోలు. భర్తలేని ఆడవాళ్ళకందరికీ నువ్వు నీ భర్తని దానం ఇచ్చేస్తూ, భార్యలేని మగవాళ్ళందరికీ నీ భర్త నిన్ను దానం ఇచ్చేస్తూ చాలా విశాలంగా బ్రతికినట్టున్నారు."

"షటప్ !" తీవ్రంగా అరిచింది ప్రియ. నిప్పులు కక్కుతున్న కళ్ళతో చూస్తూ "నా గురించి ఒక్కమాట కూడా మాట్లాడకు నువ్వు. నిన్నింతగా బ్రతిమాలుకోవలసిన పనిలేదు మాకు. మేమేమీ తప్పు చెయ్యలేదు. మా మధ్యనున్న ప్రేమ నీ కర్థంకాదు. ప్రేమ నేరం కాదు."

"ప్రేమ !" వ్యంగ్యంగా నవ్వింది మాధవి పదేపదే ప్రేమ అనే పదం నీ నోటినుండి వస్తూంటే నాకు వినడానికి చాలా అసహ్యంగా ఉంది. మీ అవినీతి సంబంధానికి ప్రేమ అనే పేరుపెట్టి దాన్ని అపవిత్రం చెయ్యకండి. పాపం, నిన్ను కట్టుకున్నవాడిని తలుచుకుంటే జాలేస్తూంది. ఈ బావ కోసం ఇంత ప్రేమ నీలో పొంగిపోతూంటే ఆ కట్టుకున్నవాడు బ్రతికి ఉన్నన్నాళ్ళూ ఎలా ఊరుకోగలిగేవు ? అతని జీవితంలో అతనికి ఏమివ్వగలిగేవు ? అతనున్నన్నాళ్ళు అతనిమీద ప్రేమ, అతని ఆస్థిమీద ప్రేమ. అతను పోయిన

తరువాత బావమీద ప్రేమ. కట్టుకున్నవాడు దూరమయితే అతని తాలూకు జ్ఞాపకాలతో, ఆ అనుభూతులు మనసులో పదిలంగా దాచుకోవడం, అతడు పోయినా అతడికి ద్రోహం చేయలేకపోవడం, అది అది ప్రేమకి చిహ్నం. అంతేగాని వాడు పోగానే ఎవరిమీదో ప్రేమంటూ సిగ్గు, అభిమానం వదులుకొని అభిసారికలా పరుగుపెట్టడం ఆ ప్రేమ ఆ విధంగా వెల్లడించుకొవడం ప్రేమ కాదు. కట్టుకున్న భర్త పోగానే అతని ఆస్తిని అనుభవిస్తూ, అతని భార్యగానే చలామణి అవుతూ తిరిగి అతనికే ద్రోహం చెయ్యడానికి నీకు సిగ్గులేదూ ? ఇక ఈయనగారు పెళ్ళాం ఎదురుగా నువ్వు తప్ప నాకు ప్రపంచంలేదు, నా మనసు నిండా ఉన్నది నువ్వే అని ప్రేమసూత్రాలు వల్లించి ఆ పెళ్ళాంకాస్త కనుమరుగవగానే ఇంకో ఆడదానికి వశమయిపోయి ఆమెదగ్గిర కూడా అవే సూత్రాలు వల్లించే చంచల స్వభావులు, ఈయనొక పెద్ద ప్రేమ స్వరూపం. అసలు ప్రేమ పేరెత్తే అర్హతే మీకు లేదు. మీరు వట్టి కామపిశాచాలు "

క్రోదావేశాలతో ఊగిపోతున్న మాధవి చెంప చెళ్ళుమంది. అమిత ఆగ్రహంతో తనవంకే చూస్తున్న విజయ్ చేసినపని అదని గ్రహించింది మాధవి. ప్రియ ఒకవైపు కుతకుత ఉడికిపోతోంది.

ఆ దెబ్బకి కళ్ళల్లో గిఱ్ఱున నీళ్ళు తిరిగిన మాధవి వాళ్ళవంక తీక్షణంగా చూడసాగింది. ఆమె కళ్ళు సానపెట్టిన కత్తి అంచులా మెరుస్తున్నాయి. వాళ్ళు ముగ్గురూ బుసకొడ్తున్న పాముల్లా ఒకర్నొకళ్ళు వంక వొకళ్ళు చూసుకుంటున్నారు. వాళ్ళని చూసిన బాబిగాడు భయంతో కెవ్వుమన్నాడు.

వాడిని తీసి గుండెల కత్తుకుంది మాధవి. విజయ్ మెల్లగా తనను తను కుదుటపర్చుకున్నాడు

"చాలా హద్దుమీరి మాట్లాడుతున్నావు మాధవీ ! ప్రియ గురించి ఇష్టం వచ్చినట్టు మాట్లాడే అధికారం నీకు లేదు" అన్నాడు.

"హద్దుమీరి మాట్లాడుతున్నానా ? హద్దంటూ అసలు ఒకటుందా ? ఆ హద్దు మీరు చెరిపేయబట్టే నేనూ హద్దుమీరి మాట్లాడవలసి వచ్చింది."

బలవంతంగా శాంతం వహించేడు విజయ్ కోపావేశాలతో ఊగిపోతున్న ప్రియకి మాధవిని ఎన్నో అనాలని ఉంది. కానీ ఏమీ అనలేకపోతోంది. ఏమన్నా అది తిరిగి తనకే తగుల్తుంది మరి.

మాధవి లేచి తన బట్టలు, తన వస్తువులు, అన్నీ తీసి తన వెంట తెచ్చుకున్న సూట్‌కేసులో సర్దుకోసాగింది. విజయ్ ఉలిక్కిపడ్డాడు.

"ఏమిటి మాధవి? ఎందుకివన్నీ సర్దుతున్నావ్ ?"

"నే నిక్కడ నుండి వెళ్ళిపోతున్నాను." తను చేస్తున్న పనేమాత్రమూ ఆపకుండా, వెనుదిరిగైనా చూడకుండా అంది.

"ఎందుకని?" అతని కనుబొమ్మలు ముడిపడ్డాయి.

"ఎందుకనా? తెలియనట్టడగకండి. ఒక పురుషుడూ, ఒక స్త్రీ మాత్రమె కలసి బ్రతకాలనే నా ఉద్దేశం మీకు తెలుసు. జంతువుల్లా బ్రతకడం నాకు నచ్చదని నే విందాకే చెప్పేను. ప్రేమబంధంతో ఒకరి కొకరు అంకిత మయిపోయిన మీ మధ్య అడ్డుపుల్లలా ఉండడం నా కిష్టంలేదు. అందుకే నేను తప్పుకుంటున్నాను." నిశ్చలంగా తన నిర్ణయం తెలియజేసింది మాధవి. తుళ్ళిపడ్డాడు విజయ్. అతని మనసులో కల్లోలం రేగింది. మొహం పాలిపోయింది.

"మాధవీ!" ఆమె రెండు భుజాలమీద చేతులువేసి ఆపేడు విజయ్. "ఇది నీకు న్యాయంకాదు. ఈ ఇంటిలో స్థానం ముందు నీది. తరువాతే ప్రియది. నువ్వు వెళ్ళడం నా కిష్టంలేదు. బాబు గురించైనా ఆలోచించు" ప్రాధేయపడ్తున్నట్టుగా అడిగేడు విజయ్

మాధవి తన భుజాలమీద ఉన్న అతని చేతులవంకా, అతనివంకా కంపరంగా చూసింది. "ముందా చేతులు తియ్యండి" అంది తీవ్రంగా.

చప్పున వదిలేశాడు విజయ్. "పరాయి స్త్రీని ముట్టుకున్న ఆ చేతులతో నన్ను తాకితే నన్ను నేనే దహించుకోవాలన్పిస్తుంది. నే నింకేమీ వినదల్చుకో లేదు. స్థానమంటూ కోల్పోయిన తరువాత ఆ కోల్పోయిన స్థానం మొదటిదో, రెండవదో ఆలోచించుకోవడం శుద్ధ దండుగ. బాబు పేరుచెప్పి నన్నాపలేరు. ఎందుకంటే వాడి గురించి ఆలోచించేది, ఆలోచించబోయేదీ నే నొక్కదాన్నే. మీరు మాత్రం కాదు నన్నాపాలని ప్రయత్నించకండి" స్థిర గంభీరంగా అంది మాధవి. ఆమెలో తిరుగులేని నిర్ణయం దృఢంగా ఉంది ఆమె కంఠం ఖంగున చెప్పినట్టయింది విజయ్‌కి.

"మధూ! ఇన్నాళ్ళూ నన్నెంతో ప్రేమించేవు. నేను లేనిది క్షణం కూడా ఉండలే ననేదానివి. నేను ఎప్పుడయినా ఇంటికి రాకపోతే ఆరోజు భోజనం, నిద్ర కూడా మానేసి ఎదురుచూచేదానివి. ఆ ప్రేమంతా ఏమయింది? అది ప్రేమ కాదా? వట్టి నటనా? చెప్పు మధూ! అలాంటి నువ్వు నాకు దూరమయి ఎలా బ్రతకగలవు?" ఆఖరి అస్త్రంగా అడిగేడు విజయ్.

"అది ప్రేమో నటనో మీ మనసు నడగండి." పేలవంగా నవ్వింది మాధవి. "చూడండీ! తనెంతగానో ప్రేమించే భార్య తనని కాదని పరాయి వ్యక్తి పొందుకోరి వెళ్ళిందనుకోండి. అప్పుడా భార్యని భర్త మునుపటిలా ఇంట్లో ఉంచుకోగలడా ఏం జరగనట్టు ఎప్పటిలా ప్రేమించగలడా? ఆమెలో తిరిగి జీవితాన్ని పంచుకోగలడా? చెప్పండి. మగవాడి మనసుకుండే కోపం, ద్వేషం, ఆగ్రహం, అభిమానం, పౌరుషం, కసి అన్నీ ఆడదాని మనసుకి కూడా ఉంటాయండీ, తప్పుచేసిన భార్యని భర్త ఎలా క్షమించి ఆదరించలేదో తప్పుచేసిన భర్తని ఆ భార్య కూడా అలాగే క్షమించలేదు. ఆ భర్తతో మన స్ఫూర్తిగా కాపురం చెయ్యలేదు. ఆడదానికైనా, మగవాడికైనా నీతి నియమం, ఒక్కటేనండి."

"ఓహో! మహా గొప్ప నీతిసూత్రాలు బోధించడానికి దిగివచ్చేవు. ఈ నీతి క్రొత్తగా నీ నోటినుండే వింటున్నానుగా మరెక్కడా వినలేదు. భార్య తప్పుచేస్తే ఏ భర్తా క్షమించడు. అది నిజమే. అది సహజం కూడాను అది పురుషునికున్న అధిక్యత. కానీ, భర్త తప్పుచేస్తే దండించే అధికారం, ఏమని అడిగే హక్కు భార్యకి లేదు. అతడిని కాదంటే ఆమెకి జీవితమే లేదు. అతడు ఎందరితో తిరిగొచ్చినా భార్యకి అతడి పాదాల దగ్గిర తప్ప మోక్షం లేదు. యుగయుగాల నుండీ వస్తున్న కథ ఇదే. అది మార్చడానికి ఇన్నాళ్ళకి ఈవిడగారు బయలుదేరింది. ఎక్కడో నీలా అహంకారంతో విఱ్ఱవీగేది, మొగుడంటే లక్ష్యంలేనిది తప్ప ఇంకెవరూ నీలా మాట్లాడరు" అప్పటికి అవకాశం దొరికిన ప్రియ కసిగా అంది

"నిజమే. అనాదిగా వస్తున్న ఆడదాని కథ అదే. అందుకే రానురాను పురుషులు మరీ నీతిబాహ్యులుగా తయారయ్యారు. అప్పటి ఆడదానికి భర్త నుండి దూరమయితే గౌరవం లేదు. రక్షణలేదు. తనను తను పోషించుకోవడం చేతకాదు. తన ఉదరపోషణకోసమైనా తప్పనిసరిగా ఒకరిమీద ఆధారపడవలసి వచ్చేది అలాంటి భర్తతో ఆమె ఎంత మనసుని, అభిమానాన్ని చంపుకుని, పౌరుషాన్ని ఎంతగా అణచుకుని కాపురంచేసేదో, మనసులో క్షమించుకోలేని భర్తతో, అనుక్షణం అసహ్యించుకునే భర్తతో బలిపశువులా ఎంత బలవంతంగా కాపురం చేసేదో నీలాంటి ఎవ్వరూ అర్థంచేసుకోలేరు అంతేగాని ఆమెకు మనసు లేకా కాదు, ఆ మనిషికి అభిమానం రోషం లేకా కాదు

కానీ ఇప్పటి స్త్రీకి ఆ దుస్థితి పోయింది. ఎట్టి పరిస్థితుల్లోనూ మనసుని

చంపుకుని బ్రతకనక్కరలేదు. మనసు చంపుకుని బ్రతకడం నాకూ చేతకాదు. నన్ను నేను పోషించుకునే శక్తి, నా బిడ్డ భవిష్యత్తును చక్కగా తీర్చిదిద్దగల ధైర్యం నాకున్నాయి. వస్తాను" గంభీరంగా, నిర్మలంగా చెప్పిన మాధవి ఎవరి సమాధానంకోసం ఎదురుచూడకుండా బాబిగాడిని ఎత్తుకుని, సూట్‌కేస్ చేత్తో పట్టుకుని విసవిస నడచి వెళ్ళిపోయింది.

"మాధవీ!" ఆక్రోశం లాంటి విజయ్ పిలుపు ఆమెకి వెనుక నుంచి వినిపించినా ఆమె ఆగలేదు. దిగ్భ్రమ నుండి తేరుకోలేనట్టుగా నిలబడిపోయాడు విజయ్. అతని హృదయం నుండి ఒక భాగాన్ని కర్కశంగా కోసి వేరుచేసినట్టుగా బాధపడ్డాడు విజయ్.

"వెళ్ళనివ్వు బావా! ఆ పొగరు ఎన్నాళ్ళో అదీ తేలుతుంది. మగ అండ లేకుండా ఎన్నాళ్ళుండగలదు? మళ్ళీ నెల తిరిగేసరికి నీ కాళ్ళదగ్గిరకి పరిగెట్టుకు రాకపోతే అప్పుడడుగు" కసిగా అంది ప్రియ.

## 17

రెండునెలలు గడిచినా మాధవి నుంచి ఉత్తరం కూడా రాలేదు. ఈ రెండు నెలలలోనూ అప్పుడప్పుడూ ప్రియ ఇంటికి వెళుతూ ఆమె వ్యాపారాలు, లావాదేవీలూ అన్నీ చూస్తూనే ఉన్నాడు విజయ్. అతడిని ఒక్క క్షణం కూడా విడవకుండా వెన్నంటే ఉంటుంది ప్రియ.

మాధవి తల్లిగారింటికే వెళుతుందని తెలుసు విజయ్‌కి. ఆమెకీ ప్రపంచంలో తల్లితప్ప ఎవ్వరూ లేరు. ఆ తల్లి కూడా పెద్ద ఆస్తిపరురాలేమీ కాదు. సొంత ఇల్లు మాత్రం ఉంది. తనున్న ఇంటినే కొంతభాగం అద్దెకిచ్చి కాలక్షేపం చేస్తుందామె. ఏదో పౌరుషంతో వెళ్ళిపోయినా అక్కడ మాధవికి, బాబుకి పోషణ జరగడం చాలా కష్టమని తెలుసు విజయ్‌కి. ఎంత ప్రియ ఆకర్షణకి అతడు కట్టుబడిపోయిఉన్నా అతడి మనసులో మాధవి రోజులో ఎప్పుడో ఒకసారి మెదులుతూనే ఉంది.

విజయ్ ఆ నెలజీతం మొత్తం మాధవికి పంపించేడు కానీ, ఆ డబ్బు వెంటనే తిరిగొచ్చేసింది. 'నేను మీ నుండి ఏమీ ఆశించడంలేదు. నా స్వశక్తి మీద నాకు నమ్మకముంది.' అని ఒక్క ముక్క మాత్రం రాసిపడేసింది మాధవి.

విజయ్‌కి చాలా అవమాన మనిపించింది ఆ తిరస్కారం

"ఆమె నిన్ను ఎంత లెక్క చెయ్యకపోయినా. నువ్వొక మనిషివనే దృష్టితోనే ఆమె చూడకపోయినా నీకు మాత్రం ఆమెమీద శ్రద్ధపోలేదు బావా! ఆమె అంత నిర్లక్ష్యం చూపిస్తుంటే ఇంకా నీకు ప్రాకులాడ్డానికి అభిమానంగా అన్పించడంలేదూ? అసలు నీకుండే ఈ బాధ, ఈ తపన ఆమెకుండవలసింది. ఏం చూసుకొనట ఆమెకింత పొగరు ఇంత గర్వం?" అతడి ఆగ్రహానికి అజ్యం పోసింది ప్రియ.

అతడికి ప్రియ మాటలు నిజమే నన్పించాయి. "తనను తిరస్కరించి, తన డబ్బు ఖాతరు లేనట్టు త్రిప్పికొట్టిన మాధవి ఏం సాధించాలనుకున్నదో, వెనుక పైసా ఆధారం లేకుండా ఎలా బ్రతకాలనుకుందో, ఆమె అహంకారమేమిటో చూడాలన్పించింది. లక్షాధికారిణి అయిన ప్రియకి తన పట్ల ఉండే లక్ష్యంలో, గౌరవంలో మాధవికి నూరోవంతు కూడా లేదనిపించింది. ఆమె తనకు తానుగా తన పట్టుదలని, మూర్ఖత్వాన్ని వదులుకుని తన దగ్గరికి వస్తే తప్ప తను ఆమెను కనీసం తలవను కూడా తలవకూడదని గట్టిగా నిర్ణయించుకున్నాడు.

ఇప్పుడతనికి ప్రియవాక్కే వేదవాక్కు అయింది. ఉద్యోగానికి రాజీనామా ఇచ్చేసి ప్రియవెంట శ్రీకాకుళం వెళ్ళిపోయాడు. ఆరు నెలలపాటు ప్రియా, విజయ్ లిద్దరూ కలిసి దేశంమీద తిరిగివచ్చేరు. ప్రియ తన పరిచయస్తులతో, స్నేహితులతో విజయ్‌ను తను పునర్వివాహం చేసుకున్నట్టుగా పరిచయంచేసింది. నిజానికి ఆమె అలా విజయ్‌ని తనను పెళ్ళిచేసుకొమ్మని కోరనేలేదు. విజయ్ కూడా దానికంతగా ప్రాముఖ్యం ఇవ్వలేదు.

ప్రియతోపాటు అన్నీ తిరిగొచ్చేడు విజయ్. ఆరు నెలలూ ఆరు క్షణాల్లా గడిపేశారిద్దరూ. ప్రియ యొక్క బిజినెస్‌లో తలదూర్చేడు విజయ్. తమకొక యజమానంటూ ఏర్పడడంతో, అతడు ఎప్పటికప్పుడు లెక్కలవీ చూసుకుంటూ అన్ని విషయాల్లోనూ చాలా స్ట్రిక్ట్‌గా ఉండడంతో గుమాస్తాలలో కూడా చాలా భయభక్తులు ఏర్పడ్డాయి.

వ్యాపారాన్నంతా తన చేతుల్లోకి తీసుకున్న విజయ్ ఎంతో సమర్థవంతంగా అన్ని పనులూ నిర్వహించసాగేడు. అవిరామంగా కృషిచేసి వ్యాపారాన్ని బాగా వృద్ధిచేశాడు.

మొత్తం ఆస్తిమీద అప్పు తీసుకువచ్చి ఆయిల్ మిల్లులో షేర్ పెట్టిన పార్టనర్‌కి అతని వాటాసొమ్ము చెల్లించేసి మొత్తం ఆయిల్‌మిల్లంతా ప్రియ పేరమీదనే ఉండేలా చేశాడు. ఎన్నాళ్ళనుంచో వ్యాపారం చేస్తున్న అనుభవం




ఉన్నట్టుగా ఎంతో చాకచక్యంగా, అతి సమర్ధవంతంగా రేయింబవళ్ళు కృషిచేసి అప్పటిలోనూ ఎంతో అనుభవం గడించేడు. అతి తక్కువ వ్యవధిలోనే అప్పు కూడా తీర్చేశాడు. ఆస్తిని రెట్టింపుచెయ్యాలనే పట్టుదలతో ఉన్నాడు. ఇదంతా ప్రియకి చాలా సంతోషం కలిగించింది.

విజయ్ బిజినెస్‌లో మునిగిపోవడంతో ఏమీ తోయ్యని ప్రియ తాత్కాలికంగా వదిలిపెట్టిన మహిళామండలిలో మళ్ళీ చేరింది. ధనవంతురాలూ, ఉత్సాహవంతురాలు అయిన ప్రియ మళ్ళీ మహిళామండలిలో చేరడంతో మహిళామండలి సభ్యులందరూ చాలా సంతోషించేరు. త్వరలోనే ఆమెకొక ప్రముఖ స్థానం కల్పించేరు. ఇక ప్రియకి కావలసినంత కాలక్షేపం. కోరుకున్నంత సందడి. ఉదయం లేచింది మొదలు స్నేహితురాళ్ళు, పార్టీలు, క్లబ్బులు, మీటింగులు, సినిమాలు, షికార్లతో రాత్రి పన్నెండు గంటలుదాకా కూడా హాయిగా బయటే గడపొచ్చు. బోర్ కొట్టే ఇంట్లో అసలు ఉండే ఇబ్బందేలేదు.

ఇప్పుడు ప్రియా, విజయ్ కలసి గడిపే సమయం చాలా తక్కువయిపోయింది. ఏ రాత్రి ఒంటిగంటకో ఇద్దరూ చేరితే గదిలో కలుస్తారు. లేకపోతే ఒక్కోరోజు అదీ ఉండదు. విజయ్ వచ్చేటైమ్‌కి ప్రియ రాదు. ప్రియ వచ్చే టైంకు విజయ్ ఉండడు.

అలసి అలసి ఏ రాత్రో ఇంటికి వచ్చే విజయ్‌కి ఆప్యాయంగా పలకరింపు

గాని, మనసు చల్లబరచె చిరునవ్వు గాని లభించడంలేదు. టేబిల్ మీద అన్నీ మూత పెట్టిఉంటాయి. ఒక్కడే అంతఇంటిలో ప్రక్కన తోడులేకుండా దయ్యంలా కూర్చుని తినబుద్ధి కాదు. ఎవరైనా కబుర్లు చెపుతూ ఆత్మీయంగా మాట్లాడుతూ, నవ్విస్తూ తనకి వడ్డించి, తనతో భోజనంచేస్తే బాగుండునని ఎన్నోసార్లు అనిపించింది విజయ్ కి. అతను కోరుకున్నట్లు ప్రియ ఒక్కనాడుకూడా అతనికోసం వేచి ఉండదు. తను ముందువచ్చేస్తే భోజనం చేసేసి తన గదిలోకి పోయి హాయిగా పడుకుంటుంది. లేకపోతే బయటే ఎక్కడో భోంచేసేసి వస్తుంది.

అన్నంముందు కూర్చునే విజయ్ కి అది ఎంతమాత్రం రుచించదు. అన్నీ తీసి గిరవాటేయాలన్పిస్తు ది. ఆ సమయంలో ఎంత వద్దనుకున్నా మాధవి రూపు మెదుల్తుంది మనసులో మాధవి తనకోసం ఎంత రాత్రయినా భోంచేయకుండా వేచిఉండడం, తన ఆలస్యానికి ఎంతో కోపమున్నా తనను చూడగానే అన్నీ మర్చిపోయి నవ్వేయడం, ఆప్యాయంగా కబుర్లుచెబుతూ తను వద్దంటున్నకొద్దీ కొప్పడి కొసరి కొసరి తినిపించడం, తను లేచిపోతుంటే చెయ్యిపట్టిఆపి తనే చొరవగా పదార్థాలుతీసి తన నోటిలో కూరడం ఇవన్నీ ఒకదాని తరువాత ఒకటిగా సినిమారీళ్ళ మెదలుతాయి అతని హృదిలో. బలవంతంగా మనసునుండి వాటిని చెరిపేసి తినకుండానే లేచిపోయేవాడు వెళ్ళి ప్రియప్రక్కన పడుకుంటాడు. ఏ రాత్రి మీదనైనా తెలివొస్తే "హాయ్? వచ్చేశావా?" అని మత్తుగా పలకరిస్తూ అతన్ని పెనవేసుకుపోతుంది ప్రియ

ఆ ఇంటిలో ప్రియఆతురు కన్పించినప్పుడల్లా విజయ్ కి బాబిగాడు గుర్తు కొచ్చేస్తాడు. వాడిని తను వీపుమీద ఎక్కించుకుని గుర్రమాట ఆడ్డం, వాడు తనకి వచ్చిన కథలు ముద్దుముద్దుగాచెప్ప బోవడం, తను చూసిన సినిమాల్లో ఫైటింగ్ని ఎవరూ దొరకనట్టు అవన్నీ తనతోనే చేసేయడం, సినిమాలో చూసిన పిస్తోలు కాల్పులన్నీ తనమీదే డిష్! డిష్! మని చేసేయడం, తను చచ్చిపోయినట్టు యాక్షన్ చేస్తే తప్పట్లుకొడుతూ నవ్వడం, ఇవన్నీ కళ్ళముందు తెరలుతెరలుగా కదిలిపోతుంటాయి.

పాప తనను 'డాడీ' అని పిల్చిన ప్పుడల్లా తనగుండె ఎందుకో కంపిస్తుంది. పాపను చూడగానే తనకి చిన్నపిల్లలని చూసినప్పుడు కలిగే ఆప్యాయత తప్ప ప్రత్యేకంగా ఏమి కలగదు. కానీ తండ్రిలేని పాప మాత్రం విజయ్ ని ఎంతగానో ప్రేమిస్తోంది

పాప బర్త్ డే వచ్చింది. ప్రియ ఎంతో అట్టహాసంగా ఏర్పాట్లుచేసింది.

ప్రియతోపాటు అందరినీ పిలిచే హడావుడిలో తనూ పడ్డాడు విజయ్. రెండు రోజుల ముందునుంచే ఇంటికి అలంకారాలు మొదలయ్యాయి. ప్రియ, విజయ్ బజారుకి వెళ్ళి పాపకి ఖరీదైన రెడీమేడ్ మాక్సీ, చిన్న రవ్వల నెక్లెస్, గాజులు కొనితెచ్చారు. అవన్నీ ప్రియ తన స్నేహితురాళ్ళకి ఎంతో దాబుగా చూపించింది. అందరు వాటిని మెచ్చుకుంటూంటే అది విజయ్ సెలక్షనేనని, అతనికి తన పాపంటే ఎంత ప్రేముందో ఎంతోగొప్పగా ఏకరువుపెట్టింది. అవన్నీ వింటూ నిర్లిప్తంగా ఉండిపోయాడు విజయ్.

పాప బర్త్‌డే పార్టీ చాలా ఆడంబరంగా జరిగింది. ఆహ్వానితులందరూ చాలా ఖరీదైనవాళ్ళు. ఖరీదైన బహుమతులే తీసుకొచ్చేరు. వచ్చిన వాళ్ళం దరూ ఎవరి ఆధిక్యతని వాళ్ళు నిరూపించుకోవడానికి చాలా తాపత్రయ పడు తున్నారు. ఏనాడూ పాపని దగ్గరకి తియ్యని ప్రియ ఆ రోజు ఎంతో ఆప్యా యంగా, ప్రేమనంతా ఒలికిస్తూ పాపని పొదివి పట్టుకుని నడిపిస్తూ అందరికీ విష్ చేయించింది. వచ్చిన వాళ్ళందరూ పాపని ఎత్తుకుని ముద్దులు పెట్టేరు. తాము తెచ్చిన కానుకలు ఇచ్చేరు.

ప్రియ పాపచేత కేక్ కట్ చేయించింది. ఒక ముక్క విజయ్ నోట్లో పెట్టించింది. తనొక ముక్క తీసి పాపనోట్లో పెట్టింది. పాపకూడా ఒక ముక్క ప్రియ నోట్లో పెట్టింది. అందరూ చప్పట్లు చరిచేరు. "హేపీ బర్త్‌డే టు యూ!" అంటూ రాగయుక్తంగా పాడేరు. ఫోటోలు తీశారు. ప్రియని ఎంతో ప్రేమిస్తూ ప్రియబిడ్డని తనబిడ్డగా చూసుకునే దేవుడులాంటి భర్త దొరికినందుకు ప్రియని అభినందించేరు. కొంతమంది లోలోపల అసూయకూడా పడ్డారు. ఈ పార్టీలో అన్నీ యథావిధిగా చేస్తూ యాంత్రికంగానే పాల్గొన్నాడు విజయ్. అతని మనసేమాత్రం ఉత్సాహంగా లేదు. ఎందుకో వ్యాకులంగా ఉంది.

అతనికి ప్రతి క్షణం బాబిగాడు, వాడి బర్త్‌డేనాడు జరిగే పద్ధతులూ అన్నీ గుర్తు వచ్చేస్తున్నాయి. ఇంత ఘనంగా జరిగిన ఈ పార్టీలో అంతా కృత్రిమత్వం, భేషజం, డాబు తప్ప నిజమైన ఆనందం, అనుభూతి ఎక్కడుంది?

బాబిగాడికి పుట్టినరోజునాడు వాడికి తలంటి నీళ్ళు పోసేది మాధవి. క్రొత్త బట్టలు వేసేది మాధవి. ఏవో స్వీట్స్ చేసేది. ఆ రోజు ఎన్ని పనులున్నా మానుకుని తప్పనిసరిగా ఉదయమే బాబుని తీసుకుని భార్యాభర్తలిద్దరూ వేణు గోపాలస్వామి కోవెలకి వెళ్ళేవారు. బిడ్డని చల్లగా చూడమని, వాడి జీవితాన్ని సుఖమయం చేయమని ఇద్దరూ దైవాన్ని ప్రార్థించేవారు. ఆ రాత్రి ఏ సినిమాకో

వెళ్ళేవారు. అంతే. అతి నిరాడంబరంగా, ప్రశాంతంగా జరిగిపోయేది ఆ పుట్టిన రోజు. ఏ అట్టహాసాలులేని ఆనాడు తాను పొందే ఆనందం, ఆ మధురానుభూతి ఈ పార్టీలో ఏకోశానా కన్పించలేదు విజయ్‌కి.

పాప పరాయిబిడ్డ అని అంతరాత్మ ఎంత వద్దనుకున్నా ఘోషిస్తుంది. పరాయిబిడ్డని నీ బిడ్డగా చెప్పుకుని ఇంత ఘనంగా పార్టీ చేస్తున్నావు. నీ రక్తం పంచుకుపుట్టిన బిడ్డ ఏ వేడుకలు లేకుండా దిక్కుమాలినవాడిలా ఎక్కడో ఎవరి పంచనో ఉన్నాడు. అంతరాత్మ పదేపదే గుర్తుచేయసాగింది. అతడికి మొదటి సారిగా అక్కడికి వెళ్ళాలని, మాధవిని చూడాలని, బాబిగాడిని ఎత్తుకోవాలని అన్పించింది. అప్పటికి ఆ వాంఛని అణచుకున్నాడు. కానీ అతను ఆ వాంఛను ఎన్నాళ్ళో అణచుకోలేకపోయాడు.

## 19

విజయ్ మాధవి కన్నవారి ఊరు రాజమండ్రి వెళ్ళేడు. ఆ ఇంటిని తేలిగ్గానే గుర్తుపట్టేడు. తన నుండి వాళ్ళు దూరమయి రెండేళ్ళు అయింది. ఇప్పుడు బాబిగాడు ఎలా ఉన్నాడో, తనను గుర్తుపడతాడో లేదో. అతని పితృహృదయం ఆత్రుతపడసాగింది బిడ్డకోసం. మాధవి ఎదురుగా తనెలా మొహం ఎత్తాలి! ఆమె తనను ఇంట్లోకి రానిస్తుందో లేదో. బిడ్డని చూడనిస్తుందో లేదో. తన ఊపిరిలో ఊపిరిలా ఉండే మాధవి తనకెంత దూరమయింది? భారంగా నిట్టూర్చేడు విజయ్.

వాకిట్లో కారాగగానే కారుచుట్టూ పదిపదిహేను మంది పిల్లలు గుమిగూడేరు. వాళ్ళందరినీ ఆరాటంగా చూడసాగేడు విజయ్. వాళ్ళలో తన బిడ్డ ఉన్నాడేమో! ఉంటే వాళ్ళందరిలో ఎవరు? అతని హృదయం స్పందించసాగింది. కారు డోరు తీసుకుని క్రిందకి దిగేడు.

కారాగిన శబ్దానికి ఇరుగుపొరుగు ఆడవాళ్ళు బయటకి వచ్చేరు. విజయ్ వంక ఆశ్చర్యంగా చూడసాగేరు. వాళ్ళలో ఒక మామ్మగారు విజయ్‌ని గుర్తుపట్టింది. ఆమె మాధవీ విజయ్‌ల పెళ్ళికి తనే దగ్గరుండి అన్నీ జరిపించింది పెద్ద ముత్తయిదువుగా.

"నువ్వు మధు భర్తవి కదు బాబూ?" అంది సంభ్రమంగా.

"ఔనండి. మా అత్తగారు బావున్నారా? మధు ఇక్కడే ఉంటుందా? మా బాబేడి" అనడిగేడు ఆత్రుతగా విజయ్.

ఆమె నిట్టూర్చింది. ఇంకెక్కడి అత్తగారు నాయనా? నువ్వు చేసిన కంతో ఇంటికొచ్చిన మధుని చూడగానే ఆమె మంచంవేసింది. మంచంవేసిన సావిత్రమ్మ మరిక లేచేపని లేకుండా దేవుడి దగ్గరకి వెళ్ళిపోయింది రా లోపలికి" అంటూ సావిత్రమ్మగారి ఇంటి తలుపుతీసి లోపలికి దారితీసింది ఆమె. మంచంవాల్చి దుప్పటి పరిచింది.

విజయ్ కూర్చున్నాడు. వాళ్ళతోపాటు ఐదేళ్ళ పిల్లవాడు కూడా లోపలికి వచ్చేడు. పోలికల్నిబట్టి వాడే తన బిడ్డగా పోల్చుకున్నాడు విజయ్. అతని హృదయ స్పందన అధికమయింది.

"వీడేనా నా బాబు?" ఆతృతగా అడిగేడు.

"ఔను నాయనా! వీడిని, ఇంటిని నా కప్పగించి ప్రయివేట్లు చెప్పుకోవ డానికి వెళ్ళింది మధు. ఒక గంటలో వచ్చేస్తుంది ఏమిటో ఆ పిల్లకి పిసరంత విశ్రాంతి లేదు. ఇంట్లో ఉన్నంతసేపూ రాత్రి, పగలు అనకుండా అదిగో ఆ మిషను కుడుతుంది. బయట ప్రయివేట్లు కుదుర్చుకుని తల్లిపోయిన దగ్గరనుండి ఇలాగే కాలక్షేపంచేసి బిడ్డని పెంచుకొస్తుంది. నువ్వు మధును తీసుకువెళ్ళడానికే వచ్చావా నాయనా? త్వరగా ఆ పిల్ల కష్టాలకి విముక్తి కలిగించు" చెప్పిందామె

విజయ్ అన్నీ మౌనంగా వింటున్నాడు. అభిమానవంతురాలయిన మాధవి మీద అతని మనసులోని గౌరవం పదిరెట్లయింది. ఆమె ముందు తనెంతో దిగజారిపోయినట్టుగా, హీనుడయినట్టుగా ఫీలయ్యాడు. బాబుని చెయ్యి పట్టుకుని దగ్గిరకి లాక్కున్నాడు. వాడు రాలేదు. బిడియంగా విలబడిపోయాడు.

"వెళ్ళరా! వెళ్ళు. ఎవరనుకున్నావు? మీ నాన్న" చెప్పిందామె. తరువాత కాఫీ అయినా తీసుకొస్తాను అని అక్కడనుండి వెళ్ళిపోయింది.

విజయ్ ఇంటినంతా పరిశీలించేడు. పేదరికపు చిహ్నాలు బాగా కనపడు తున్నాయి. ఒక మూల పాత మిషను ఉంది. బాబిగాడు కొంతసేపటికి బిడియం తగ్గి దగ్గిరికి వచ్చేడు. ఎన్నో కబుర్లు చెప్పేడు. "నువ్వు మా నాన్న వయితే ఇక్కడే ఎందుకుండిపోవు అందరి నాన్నల్లా?" అని అడిగేడు విజయ్‌కి ఏం సమాధానం చెప్పాలో అర్థంకాలేదు తప్పుచేసినట్టుగా ఉండిపోయాడు తరువాత కార్లోనుండి బిస్కట్ పేకెట్స్, రకరకాల స్వీట్స్, బాబిగాడికి రెడీమేడ్ దుస్తులూ తీసుకొచ్చి ఇచ్చేడు. వాటిని చూడగానే ప్రశ్న లడగటం మానేసి ఆనందంలో మునిగిపోయాడు వాడు. ఆ చిన్న హృదయంలో సంతోషం,

వాడి కేరింతలు చూసి విజయ్ కొంత తృప్తిపడ్డాడు. అతని మనసుకి కొంత శాంతి లభించింది మాధవిని చూడాలని అతని మనసు ఎంత పీకుతున్నా అతడి మనసుని ఏదో పిరికితనం, తప్పుచేసిన భావం, సంకోచం ఆవరించేయి. ఆమె వచ్చేదాకా ఉండలేకపోయాడు. మళ్ళీ వస్తానని చెప్పి, వచ్చినప్పుడు తప్పకుండా తీసుకెళ్తానని చెప్పి మాధవి రాకముందే అక్కడినుండి వెళ్ళిపోయాడు విజయ్.

## 20

విజయ్ తిరిగి శ్రీకాకుళం వెళ్ళేసరికి పాప పరిస్థితి ప్రమాదకరంగా ఉంది. అతడింకా బట్టలు కూడా మార్చుకోకముందే ఆయా పరిగెట్టుకుంటూ అతని గదిలోకొచ్చింది.

"విజయ్‌బాబూ! పాపకి చాలా జ్వరంగా ఉంది. మమ్మీ! డాడీ! అంటూ ఒకటే కలవరింతలు. అమ్మగారు ఇంటిదగ్గిర లేరు. మీరూ లేరు. నాకు చాలా భయంగా ఉంది. ఒకసారి వచ్చి చూడండి." కంగారుగా చెప్పింది. ఆమెవెంట గబగబా బయలుదేరాడు విజయ్.

"స్పృహలేకుండా పడిఉన్న పాప ఒంటిమీద చెయ్యివేసి చూశాడు. పెనంమీద చెయ్యివేసినట్టుగా ఉంది అమె పెదాలు "డాడీ! మమ్మీ!" అంటూ అస్పష్టంగా కదులుతున్నాయి.

విజయ్ డాక్టరికి ఫోన్‌చేశాడు. డాక్టర్ వచ్చి పాప పరిస్థితి చూశాడు. హడావిడిగా రెండు ఇంజక్షన్స్ ఇచ్చేడు. ఇంతవరకు ఎందుకాలస్యం చేశారని అడిగేడు. టేబ్‌లెట్స్ ఇచ్చి అర్జంటయితే మళ్ళీ ఫోన్ చెయ్యమని నాలుగు గంటలకొక టేబ్‌లెట్ చొప్పున వెయ్యమని చెప్పి వెళ్ళిపోయాడు.

ఆ రాత్రంతా ఆయా ఉంటానన్నాసరే వద్దని తనే ఉన్నాడు పాపదగ్గిర మేల్కొని. రాత్రి పన్నెండయినా ప్రియ రాలేదు. ప్రియ ముఖ్య స్నేహితురాలెవరో తెలుసు విజయ్‌కి. అమె ఇంటికి ఫోన్‌చేశాడు ప్రియకోసం. ప్రియే ఫోన్ ఎత్తింది పాప పరిస్థితంతా చెప్పేడు విజయ్. "నువ్వు అర్జంటుగా రావాలి." అన్నాడు.

"సారీ బావా! ఇప్పుడు నేను రాలేను. మేమంతా మహాబలిపురం వెళుతున్నాం. తెల్లవార్జామున మూడు గంటలకి ప్రయాణం. ఇంకా సర్దుకోవడం అదీ కాలేదు. ఇటునుంచిటే బయలుదేరుతాం," అంది.

విజయ్‌కి అమె సమాధానం కోపం తెప్పించింది. "ప్రియా అసలు

విన్పించిందా? పాపకి ఏమీ బాగాలేదు నిన్నే కలవరిస్తూంది. నువ్వు అర్జంటుగా వచ్చితీరాలి" తీవ్రంగా అన్నాడు.

"నేను వచ్చిమాత్రం ఏం చేస్తాను బావా? నేనేం డాక్టరునా? అన్నిటికి నువ్వున్నావు. ఆ పైన డాక్టరుగారు ఉన్నారు. ఇక నేను కూడా ఉండి చేసే దేమిటి? ప్లీజ్ నన్ను నిరుత్సాహపరచకు బావా! ఎంతో సరదాగా వెళ్ళాలను కున్నాం. నా మంచి బావవి కదూ?" గారాబంగా అంది ప్రియ

"ప్రియా ఆమె నీ పాప. అది మర్చిపోకు." నొక్కిచెప్పాడు విజయ్.

పకుక్కన నవ్వింది ఫోన్‌లో ప్రియ. "అది నేనేకాదు. పాప కూడా మర్చిపోయింది. దానికిప్పుడు నాకంటే నువ్వే ఎక్కువ. నువ్వంటేనే దానికి ప్రేమ." ఇంక మాట్లాడవలసిందేమీ లేనట్టు టక్కున ఫోన్ పెట్టేసింది ప్రియ.

విజయ్‌కి ప్రియమీద చాలా ఆగ్రహం కలిగింది. కన్న కూతురిపట్ల బాధ్యత ఆమెకు ఏ కొంచెం లేకపోవడాన్ని అతడు హర్షించలేకపోతున్నాడు. ప్రియ మనస్తత్వం అతడికి ఆశ్చర్యాన్ని కలిగించింది.

అతడు తిరిగి ఆలోచనలో పడిపోయాడు. తనకిగాని, బాబుకిగాని ఒంట్లో ఏమాత్రం బాగుండకపోయినా మాధవి ఎంత దిగాలుపడిపోయేదో, తిండీ తిప్పలు మానేసి రాత్రిళ్ళు ఎలా మతిపోయినదానిలా తమదగ్గిర కూర్చుండి పోయిందో, తాము మళ్ళీ లేచి తిరిగేదాకా ఆమె ఎంత కళవళపడిపోయేదో, ఎంత మంది దేవుళ్ళకి మొక్కుకునేదో, ఎన్ని సేవలు చేసేదో అన్నీ గుర్తుకు రాసాగేయి

ప్రియది మాతృహృదయం కాదా? ఆ హృదయంలో బిడ్డపట్ల కొస్త కూడా ఆందోళన ఉండదా? ఆరోగ్యం బాగాలేని బిడ్డకి ఎలా ఉంటుందోనన్న ఆరాటం, బెంగ అసలు ఉండవా? నిశ్చింతగా, సరదాగా ఆ విహారయాత్రలో ఎలా పాల్గొనగలుగుతుంది? విజయ్ కంతా చిత్రంగా అన్పించింది.

ఆ ఉదయానికి పాపకి కొస్త తగ్గి ప్రమాదస్థితి దాటిపోయినా జ్వరం మాత్రం పదిరోజులదాకా పోలేదు. ఈ పదిరోజులూ తన బిజినెస్ వ్యవహారాలు మానేసి పాపదగ్గిరే గడిపేడు విజయ్. పాప విజయ్‌కి ఇంకా చేరువయి పోయింది.

పదిరోజుల తరువాత వచ్చింది ప్రియ. ఏం జరగనట్టే అందరినీ నవ్వుతూ పలకరించింది. పాపతో కబుర్లు చెప్పింది. పాపకి తను తీసుకొచ్చిన కానుకలు చూపించింది.

"పాపకి కావలసింది ఈ కానుకలు కాదు ప్రియా! అసలు పాపే లేకపోతే ఈ కానుకలు ఎవరి కిచ్చేదానివి? పాపకి తల్లిగా నువ్విివ్వవలసింది కొంత ప్రేమ, ఆదరణ, అనురాగం." అన్నాడు విజయ్.

"అయితే పాపమీద నాకు ప్రేమ లేదంటావా?" అంది ప్రియ.

"తల్లి అయిన తరువాత ఉండకుండా ఎలా ఉంటుంది? పాప కోరుకునేది ఎక్కడో నీలో గుప్తంగా దాక్కున్న ప్రేమ కాదు. నువ్వు తనను ప్రేమిస్తున్నట్టు ఆమెకు స్పష్టంగా తెలియాలి. నువ్వు స్వయంగా ఆమెను లాలించాలి. ఆమె పనులన్నీ నీ చేతులమీదుగా నువ్వు చెయ్యాలి. ఆమెను బుజ్జగించాలి. ఎప్పుడూ ఆమెతోనే ఉంటూ నువ్వే స్వయంగా ఆమె పెంపకం బాధ్యత వహించాలి. అప్పుడే నువ్వు తనను ప్రేమించావనుకుంటుంది."

"బాబోయ్! ఇదంతా నా వల్లకాదు. ఇవన్నీ చెయ్యలేకేగా ఆయాను కుదిర్చింది. అయినా ఇవన్నీ చెయ్యడానికి నాకు తీరికెక్కడిది? అవతల ఎన్ని పనులు నాకు?" విజయ్ చెబుతూండగానే ఫోన్ మ్రోగింది. ఫోన్ ఎత్తి ఎవరితోనో మాట్లాడింది ప్రియ.

"అదిగో చూశావా? అప్పుడే మిసెస్ రాఘవరావు ఫోన్ చేసింది. అవతల చచ్చేపనులు నాకు." అంటూ విసవిసా వెళ్ళిపోయింది ప్రియ.

నిట్టూర్చేడు విజయ్. పాప ఎక్కడి కానుకలు అక్కడే వదిలేసి వెళ్ళిపోతున్న తల్లివంక నిర్జీవంగా చూస్తూండిపోయింది.

ఎంత వద్దనుకున్నా మాధవికి, ప్రియకి వ్యత్యాసం గుర్తుచేస్తూనే ఉంది అంతరాత్మ. మాధవివీ, ప్రియవీ ఎంత భిన్నాభిప్రాయాలు!

ఆర్థిక పరిస్థితి బాగులేనప్పుడు తప్పనిసరి పరిస్థితుల్లో ఆడది అవతలకెళ్ళి ఉద్యోగం చెయ్యొచ్చు. అది తప్పులేదు. అంతమాత్రంచేత భర్తని, బిడ్డలని నిర్లక్ష్యం చెయ్యడం ఉచితం కాదు.

ఉద్యోగం చెయ్యవలసిన అవసరంలేని స్త్రీ ఇంటివద్దనే ఉండి భర్తకి, బిడ్డలకి కావలసినవన్నీ తనే అమర్చుకోవడంలో తప్పేంలేదు. తన లాలనలో మంచి పెంపకంలో బిడ్డలని సన్మార్గులుగా మంచి పౌరులుగా తీర్చిదిద్దటం, తన ఓర్పుతో, సహనంతో ఇంటిని ఏ ఒడిదుడుకులూ లేకుండా నడపగలగడం, తన అనురాగంలో, ఆదరణలో భర్త మనసుకి శాంతి సౌఖ్యాలు కలిగించడం ఇవే ఆడదాని ముఖ్య కర్తవ్యాలు. అటువంటి స్త్రీ వాళ్ళకి ఎనలేని సుఖశాంతులు ఇవ్వడమేగాక వాళ్ళ సాన్నిహిత్యంలో అంతులేని ఆనందాన్ని, తృప్తిని,




మధురమైన అనుభూతిని పొందుతుంది. అప్పుడే ఆమె తన భర్తా, బిడ్డలకి న్యాయంచేసిందవుతుంది. తన జీవితాన్ని సార్థకత చేసుకున్న దవుతుంది. ఇది మాధవి అభిప్రాయం

ఇక ప్రియకి ఇల్లంత విసుగెత్తేది మరొకటి లేదీ ప్రపంచంలో. ఆమెకి జీవితమంటే ఏ బెంగలు, ఏ దిగుళ్ళూ లేకుండా హాయిగా జల్సాలతో, షికార్లతో, నవ్వులపంటగా, పువ్వులబాటగా సాగిపోవాలి. జీవితం ఆలోచించడానికి కాదు, అనుభవించడానికి. ఆమెకు మనసును ఆహ్లాదపరిచి ఆనందపరిచే చలాకీ స్నేహితులు కావాలి. స్నేహితులతోటి షికార్లు కావాలి. ఒక వ్యక్తి గురించే ఆలోచించడం, ఆ వ్యక్తికోసం హృదయాన్ని శూన్యంగా ఉంచుకోవడం నచ్చదు. ఆమె స్నేహితులందరికీ ఆమె హృదయంలో చోటుంటుంది. ఒంటరితనాన్ని ఆమె అసలు భరించలేదు. మనిషిగా పుట్టింది అందరితోనూ ఐకమత్యంగా ఉండడానికి, ప్రపంచమంతా చూసి తిరించడానికి. అంతేగాని నూతిలో కప్పలా ఇంటిలోనే మ్రగ్గిపోవడానికి కాదు. ఇది ప్రియ అభిప్రాయం.

క్రమంగా ప్రియమీద ఆకర్షణ తగ్గుతున్న విజయ్‌కి ఆమె మనస్తత్వం, ఆమె అభిప్రాయాలు ఒకటొకటిగా అర్థమవుతూ అతని కళ్ళకున్న పొర విడిపో నారంభించింది. ఆడది గడపదాటి తిరగడం, విశృంఖలంగా బ్రతకడం తను

సుతారామూ అంగీకరించలేదు. తనదైన స్త్రీ అలా పరాయి మగవాళ్ళతో అంతగా రాసుకుతిరగడం, వాళ్ళతో పార్టీల్లో అతి సన్నిహితంగా ప్రవర్తించడం అతను ఎంత మాత్రమూ సహించలేదు.

తన అభిప్రాయం ఒకసారి బయటపెట్టేడు విజయ్.

దానికి ప్రియ పిచ్చివాడిని చూసి నవ్వినట్టు నవ్వింది. "మై డియర్ బావా ఇద్దరు మనుషులు కలిసి బ్రతుకుతున్నంతలో ఇద్దరి ఇష్టాలు ఒకటే కావాలని ఎక్కడా లేదు. మనుషులయిన తరువాత ఎవరి ఇష్టాలు వాళ్ళకుంటాయి. ఒకరికోసం ఒకరిఇష్టాలు చంపుకోవడం చాలా అన్యాయం. నువ్వు చెప్పినట్టే నేను చేసివుంటే నేను నీ దగ్గిరకి వచ్చేదాన్నే కాదు మనిద్దరం ఒకటయ్యే వాళ్ళమే కాదు. ఇంత ఆస్థికి నువ్వు అధికారివి అయ్యేవాడివీ కాదు. ఇదంతా అనుభవించవలసినవాడివి కూడా అయ్యేవాడివి కాదు." అని ముక్కుసూటిగా చెప్పేసింది ప్రియ నిర్ఘాంతపోయాడు విజయ్

## 21

విజయ్‌కి కొత్త ఆరోగ్యం పాడయింది అందుకు కారణాలు అనేకం. ప్రియ బిజినెస్ మీదవేసుకుని విశ్రాంతి అనేది ఎరక్కుండా దాన్ని పెంచి పెద్దచేశాడు. గతం ఒకటి అతని మనసుని తూట్లుపొడుస్తూంది విపరీతమైన మానసిక సంఘర్షణ అతడిని చిత్రవధ చేస్తూంది. భరింపశక్యంగాని పశ్చాత్తాపం కృంగదీస్తూంది. వీటన్నిటినీ మర్చిపోడానికి అతడీ మధ్యన త్రాగుడు కూడా అలవాటు చేసుకున్నాడు. ఇవన్నీ కలసి అతని ఆరోగ్యాన్ని దిగజార్చేయి.

పాపని స్కూల్లో వేశారు. అక్షరాభ్యాసం వేడుకగా, ఎంతో ఘనంగా చేయించింది ప్రియ. అప్పుడే విజయ్‌కి కూడా తనబాబు కూడా చదువుకోవాలన్న సంగతి గుర్తుకొచ్చింది. మాధవి తన బాబును గొప్పగా చదివించగలదా? చదివించలేదు. తనుంచి, తనింత సంపాదించి కూడా తన బాబుకి సరైన చదువుండదు. బాబుని తీసుకొస్తే, కనీసం బాబు చదువుకైనా సహాయం చెయ్యగలిగితే మాధవి ఊరుకుంటుందా?

అంతలోనే అతనిలో మొండితనం ప్రవేశించింది. తన బిడ్డని చదివించుకునే హక్కు తనకు లేదా? వాడు మాధవికేనా బిడ్డ? తనకూ బిడ్డే. మాధవితో వాదించయినా సరే తన బిడ్డని చదివించుకోవాలి.

గట్టిగా నిర్ణయించుకున్న విజయ్ ఆరోజే బయలుదేరాడు.

అతను వెళ్ళేసరికి మాధవి ఇంటివద్దే ఉంది. ఆమెను తవివితీరా చూస్తు న్నట్టుగా చూడసాగేడు విజయ్ అల్లకల్లోలంగా ఉన్న అతని మనసుకి ఏదో శాంతి కలిగినట్టుగా అయింది. మాధవి ఏదో చవకరకం వాయిల్ చీర కట్టుకుని మరో పదేళ్ళు మీదపడినట్టుగా, నిరుపేదలా ఉంది. కానీ ఆమె కళ్ళుమాత్రం దృఢత్వంగా, ప్రశాంతంగా ఉన్నాయి. అతడిని చూసిన ఆమె హృదయంలో కూడా స్పందన మొదలయింది. కానీ అది ఎంతోసేపు నిలవకుండానే గతం తాలూకు స్మృతి ఆమె హృదయాన్ని పొరలా కప్పేసింది. నిర్లిప్తంగా నవ్వుతూ "రండి లోపలికి." అంది.

అతడు వచ్చి కూర్చున్నాడు. చాలాసేపు ఇద్దరూ ఉలుకూపలుకూ లేకుండా ఒకరికేసి ఒకరు చూస్తూ కూర్చుండిపోయారు. బాబిగాడు తల్లి దగ్గరకి వచ్చి నిలుచున్నాడు అతడు తండ్రిని గుర్తుపట్టినా దగ్గరకి వెళ్ళలేదు.

"రా బాబూ! ఇదిగో ఇవి చూడు నీ కోసమే." అంటూ తను తెచ్చిన చాక్‌లెట్స్, స్వీట్స్ అందించేడు విజయ్ వాటిని చూడగానే బాబిగాడి కళ్ళు ఆనందంతో వెలుగుతాయనుకున్నాడు. వాటిని ఆత్రంగా అందుకుంటా డనుకున్నాడు. కానీ బాబిగాడు వాటిని అందుకోలేదు. "నా కొద్దు." అన్నాడు. క్రితంసారి అతడిచ్చినవి తీసుకున్నందుకు తల్లి తనను గుండెలకత్తుకుని ఏడవడం గుర్తుకొచ్చింది

హతాశుడయ్యాడు విజయ్. "మీ రొచ్చిన పనేమిటో చెప్పండి. అవతల నాకు ట్యూషన్‌కి టైమవుతుంది." అంది మాధవి.

మాధవి అంత నిష్కర్షగా చెప్పడంతో అతని మనస్సు కలుక్కుమంది.

"బాబుని నేను తీసుకెళ్ళాలనుకుంటున్నాను అందుకే వచ్చేను." తనుకూడా ఉపోద్ఘాతం లేకుండానే చెప్పేశాడు.

తలమీద పిడుగు పడ్డట్టుగా అదిరిపడింది మాధవి. రెండు క్షణాలు మాట్లాడలేదు. అతడివంకే సూటిగా చూడసాగించి.

చూపులు త్రిప్పుకున్నాడు విజయ్. "మాట్లాడవేమిటి? నేను వాడిని బాగా చదివించుకోవా లనుకుంటున్నాను."

"హుం! వాడిని చదివించుకోవా లనుకుంటున్నారా? నా నుండి విడదీసి కక్ష తీర్చుకోవాలనుకుంటున్నారా? మొన్న నేను లేనపుడు వచ్చి వాడి కవీఇవీ ఇచ్చి మచ్చికచేసుకున్నప్పుడే అనుకున్నాను మీ ప్లాన్ ఇదని...."

"మధూ!" ఆవేదనగా, కంగారుగా పిలిచేడు విజయ్. "దయచేసి నన్ను

అపార్థం చేసుకోవద్దు. నా ఉద్దేశం వాడిని చదివించుకోవాలనే. నీ నుండి దూరం చేద్దామనే దురుద్దేశం నా కెంతమాత్రం లేదు."

"ఏం ఇంత అకస్మాత్తుగా వాడిమీద ఇంత ప్రేమ పుట్టుకొచ్చింది ?"

"మధూ ?" కాస్త కోపంగా పిలిచేడు విజయ్. వాడు నీ ఒక్కదానికే బిడ్డ కాదు. నాకూ బిడ్డే. వాడిమీద ప్రేమ, ఆశలు అన్నీ నీ ఒక్కదానికే కాదు నాకూ ఉంటాయి. పోనీ వాడిని నాతో పంపడానికి ఇష్టంలేకపోతే ఇదిగో ఈ డబ్బు తీసుకుని వాడిని మంచి కాన్వెంటులో చేర్పించు. నెలనెలా నేను వాడి చదువుకోసం పంపే డబ్బు స్వీకరించు."

"పరాయి డబ్బుతో చదువుకోవల్సిన అగత్యం నా బిడ్డకి లేదు."

"పరాయి డబ్బు! తండ్రి డబ్బు బిడ్డకి పరాయిదవుతుందా ? నేనంత పరాయివాడినని నువ్వు అనుకున్నా, ఆ బిడ్డకి తండ్రినని కాదని అనలేవుగా."

"ఆ డబ్బు మీ డబ్బు అనుకోడానికి మీకు అభ్యంతరం లేకపోతే లేకపోవచ్చు. కానీ ఎక్కడిదో, ఎవరిదో తెల్సిన నేను ఆ డబ్బుతో నేను నా బిడ్డని చదివించుకోలేను. ఆ పాపిష్టిడబ్బుతో నా బిడ్డ గొప్పవాడయ్యేకంటే నా రెక్కల కష్టంతో వాడు సామాన్యంగా ఉన్నా నా కిష్టమే." ఆవేశంగా, తీవ్రంగా అంది మాధవి.

"మధూ! అది ప్రియ డబ్బు అని కదూ నీ ఉద్దేశం? పెట్టుబడి ప్రియదే. కానీ పెట్టుబడిమీద కష్టించి దాన్ని వృద్ధిచేశాను. నా కష్టానికి తగిన ప్రతిఫలం నేను తీసుకోవడంలో తప్పులేదు. ఇది నా కష్టార్జితం, ప్రియది కాదు. దయచేసి కాదనకు. నీ మూర్ఖత్వానికి మన బ్రతుకుల్ని బలిచేశావు. చాలు. ఇక ఆ పట్టుదలకి, ఆ మూర్ఖత్వానికి, ఆ అహంకారానికి బిడ్డ నూరేళ్ళ బ్రతుకుని, భవిష్యత్తుని బలిచేయకు." అతడు కూడా తీవ్రంగానే అన్నాడు.

"నాది మూర్ఖత్వం, అహంకారం, గర్వం. నిజమే అందుకే మన బ్రతుకులు బలిఅయిపోయాయి. ఇందులో మీ పాత్ర ఏమీ లేదు కదూ ? పోతే పోనివ్వండి. పుట్టుకతో వచ్చిన మూర్ఖత్వం ఎక్కడికి పోతుంది. ఇప్పుడూ అదే మూర్ఖత్వంతో చెబుతున్నాను. బిడ్డకి మీ నీడకూడా సోకడానికి వీల్లేదు. వాడు పూర్తిగా నా బాబుగానే పెరగాలి. అంతేగాని వాడు మీ బిడ్డని చెప్పుకోడానికి వీల్లేదు. ఆ అర్హత ఎప్పుడో పోగొట్టుకున్నారు. నా మూర్ఖత్వానికి వాడి జీవితం అహుతయిపోయినా నా కిష్టమే. అంతేగాని వాడు మీ బిడ్డగా మిగలడానికి వీల్లేదు. బాబు పూర్తిగా నా స్వంతం. ఇక వెళ్ళండి." బాబుని

గట్టిగా హృదయానికి హత్తుకుని ఆవేశాగ్రహాలతో, రోషంగా అరిచింది మాధవి.

విజయ్ నిర్ఘాంతపోయాడు. అతడి హృదయం చిన్నాభిన్నమయి పోయింది. మాధవి ఇంత కఠినంగా మాట్లాడుతుందని, తన పొడ అంటే మండి పడుతుందని అతను అనుకోలేదు. పరిగెత్తే కాలంతోపాటు తన మనసులో వచ్చినట్టే మాధవి మనసులో కూడా ఏదైనా మార్పు వచ్చి ఉంటుందని తను ఆమెకోసం బాధపడ్తున్నట్టే అంతరాంతాల్లో ఆమె కూడా తనకోసం బాధపడ్తుందని ఊహించేడు. బాబుని చదివించే నెపంతో ఆమెతో కొంత సాన్నిహిత్యం ఏర్పరచుకోవచ్చని, బాబు తామిద్దరినీ కలిపే వారధి అవుతాడని ఎన్నెన్నో ఊహించేడు. కానీ తన ఆశలు, ఊహలూ అన్నీ నేటి మాధవి ఆగ్రహంతో, మాటలతో సమూలంగా నాశనమయిపోయాయి. విజయ్ కృంగిపోయాడు. అంతులేని నిరాశతో, నిర్వేదంతో, అవమానభారంతో, ఆశాభంగంతో సర్వం ఓడిపోయినవాడిలా విరాగిలా ఆ ఇంటినుండి బయటపడ్డాడు.

## 22

విజయ్‌లో మునుపటి ఉత్సాహం, బిజినెస్‌పట్ల శ్రద్ధ, సమర్థత అన్నీ క్రమంగా తగ్గిపోసాగేయి. ఎప్పుడూ ఏదో ఆలోచిస్తూ, శూన్యంలోకి చూస్తూ, సాధ్యమైనంత మౌనంగా గడపుతున్నాడు. అతడు తిన్నా, తినకపోయినా దిగులుగా ఉన్నా, సంతోషంగా ఉన్నా ఏమని అడిగేవాళ్ళు లేరు. సాపతప్ప పలకరించేవాళ్ళు లేరు బయట అతడికి బోల్డుమంది ఫ్రెండ్స్ ఉన్నారు. విలాస మైన జీవితం అతడికి బయట కావలసినంత ఉంది. కానీ అదిప్పు డతనికి వెగటు పుట్టిస్తూంది. కృత్రిమంగా తోస్తూంది. అతడిని ఆప్యాయంగా పలకరించే వాళ్ళు, ఆత్మీయంగా ఆదరించేవారు, అతనికోసం మనస్ఫూర్తిగా బాధపడేవాళ్ళు కావాలిప్పుడు. కానీ అటువంటివాళ్ళు కావాలనుకునే కోరికిప్పుడు గగనకుసుమం అతనికి. ప్రియమీద ఆకర్షణ పూర్తిగా జారిపోయినా అతనికి ఇప్పుడామె చర్యలన్నీ అతి వికృతంగా కన్పించసాగేయి. ఆమె మనస్తత్వం భయంక రంగా కన్పించసాగింది. ఆమె నీడే ఇప్పుడు భరించలేకపోతున్నాడు.

అతడి మనసు పదేపదే మాధవి కావాలని కోరుకుంటూంది. అది తీరని కోరిక అని తెలుస్తున్నకొద్దీ అతడి మనసులో ఆమెకోసం తపన అధికమయి

పోయింది. తను చేజేతులా జారవిడుచుకున్న ఆ దేవతను జపించని క్షణంలేదు. తన స్వయంకృతాపరాధం క్షమించలేనిది. అందుకు అవకాశం కల్పించిన ప్రియని తలచుకున్నకొద్దీ అతని హృదయం భగ్గున మండిపోసాగింది.

మాధవి తననెప్పటికీ క్షమించదు అన్న విషయం రూఢి అయిపోయింది తనకు మాధవి, బాబు ఇక లేరు. తనకోసం బాధపడే ఏ ప్రాణీ లేదు. తనెవ్వరికీ ఏమీ కాడు. తనకోసం మనస్ఫూర్తిగా కన్నీరు కార్చే చిన్న నలుసు కూడా లేదు. ఈ ప్రపంచంలో తనకంటూ ఎవ్వరూ లేని ఏకాకి తను. జీవితం ఎడారిలా కన్పించసాగింది విజయ్‌కి. ఈ ఎడారి జీవితంలో తను ఏకాకిగా ప్రయాణించటం ఎంత దుర్లభం, ఎంత దౌర్భాగ్యం. ఇటువంటి భావాలు విజయ్‌ని విపరీతంగా కృంగదీస్తున్నాయి. భరించ శక్యంగాని మానసిక వ్యధకి లోనుచేస్తున్నాయి.

ఎవరో ఒక క్రొత్తవ్యక్తిని తీసుకుని ప్రియ వచ్చింది.

"బావా ! ఈయన పేరు సురేష్. నీకొంచెం ఆరోగ్యం చక్కబడేదాకా మన బిజినెస్ వ్యవహారాలు చూసుకోవడానికి మేనేజర్‌గా ఈయన్ని అపాయింట్ చేశాను." చెప్పింది ప్రియ.

"నీ ఇష్టం ప్రియా." అన్నాడు ఆమెతో ఎక్కువగా మాట్లాడ్డానికి ఇష్టంలేని విజయ్ అతన్ని తీసుకుని ప్రియ వెళ్ళిపోయింది. విజయ్ నవ్వుతున్నాడు. తను పనికిరానని తెలుసుకుంది ప్రియ. అందుకే మేనేజర్‌ని వేసుకుంది, కనీసం తనతో సంప్రదించకుండా. ఆ మేనేజరే ఇటుపైన ప్రియకి జీవిత భాగస్వామి కూడా అవుతాడేమో. తనెంత పొరపడ్డాడు ! ఈ ప్రియ మాటలన్నీ నమ్మేడు. అమాయకురాలనుకున్నాడు. ఆమెకు తనమీద ఉన్నది నిజంగా ప్రేమేననుకున్నాడు. ఈ తుచ్ఛరాలుకోసం అమృతభాండం లాంటి జీవితాన్ని కాలదన్నుకున్నాడు. దేవతలాంటి మధుకి ద్రోహం చేశాడు. తన ప్రేమఫలం బాబుకి తండ్రి ప్రేమ కరువుచేశాడు. తనెంతమాత్రం క్షమార్హుడుకాడు.

ఆ రాత్రి అతడికి విపరీతమైన వణుకుతో చలిజ్వరం ముంచుకొచ్చేసింది. ఏవో పిచ్చి పిచ్చి కలలు. కలవరింతలు కలలనిండా మాధవే. ఆమె పరుగులు పెడుతోంది. ఆమెను తను అందుకోలేకపోతున్నాడు. అతడికి మూడు రోజుల వరకూ ఒంటిమీద తెలివే లేదు.

మూడు రోజుల తరువాత అతడికి కాస్త తెలివొచ్చింది. విపరీతమైన దాహంగా ఉంది. నోరెండిపోతూంది. నాలికతో పెదాలు తడుపుకుంటున్నాడు. ప్రక్క గదిలోనుండి ప్రియ మాటలు వినబడుతున్నాయి.




"మేనేజర్ గారూ! విజయ్‌కి టైఫాయిడ్ అవి చెప్పేరు డాక్టరుగారు. అతడికి అన్నీ చూడ్డానికి ఇంట్లో ఎవరున్నారు? అయాకి పాపతోనే సరిపోతుంది. ఇంట్లో ఒక రోగి ఉన్నాడంటే నాకు చెప్పలేనంత కంపరం, భయం. ఆ ఇంట్లో ఇక అడుగు పెట్టబుద్ధి కాదు. అతడిని హాస్పిటల్లో అడ్మిట్ చేపేద్దాం. ఏ గొడవా ఉండదు. మీరా ఏర్పాట్లవీ చూడండి." అంటోంది ప్రియ.

"అలాగే మేడమ్! అతడింట్లో ఉంటే నాకూ్కడా ఏం బాగుండడంలేదు. మిమ్మల్ని ముట్టుకోవాలంటేనే సంకోచంగా అన్పిస్తూంది." అంటున్నాడు అతను సన్నగా నవ్వుతూ. ప్రియ కూడా అతని నవ్వుతో శృతికలుపుతూ కిల కిల లాడింది. తరువాత ముద్దుపెట్టుకున్న చప్పుళ్ళు, గుసగుసలు, శబ్దాలు అసహ్యంగా, విపరీతమైన ఏవగింపుతో తల తిప్పుకుని కళ్ళు గట్టిగా మూసుకున్నాడు విజయ్. అతడికి మళ్ళీ స్పృహ తప్పింది.

## 23

మాధవికి లక్ష్మినుంచి ఉత్తరం వచ్చింది. తోటికోడలు రాసిన ఉత్తరానికి ఆశ్చర్యపడుతూ గబగబా కవరు చింపి చదివింది మాధవి.

"చి॥ మాధవికి,

మీ అక్క లక్ష్మి ఆశీర్వదించి వ్రాయునది. మధూ! నీ స్వంత విషయాల్లోకి తలదూర్చి నిన్ను శాసించే అధికారం నాకు లేకపోయినా నువ్వు

నా మాట కాదనవనే ధైర్యంతో రాస్తున్నాను. నీకు జరుగుతున్న అన్యాయం చూడలేక అప్పట్లో నీ కొక ఉత్తరం రాసేను. కానీ అప్పుడు నీకు అన్యాయమే జరిగింది. విజయ్ ప్రాణం నిలబెట్టి నీ పసుపుకుంకుమలు కాపాడాలనే సదుద్దేశంతో ఇప్పుడు రాస్తున్నాను. దీనికి నీ సహకారం, సహృదయం ఉండితీరాలి.

విజయ్ పరిస్థితేమీ బాగుండలేదు. అతడు టైఫాయిడ్ జ్వరంతో స్పృహ లేకుండా ఉండేస్థితిలో ప్రియ అతడిని నిర్దయగా హాస్పిటల్‌లో చేర్పించింది. మాకు టెలిగ్రామ్ ఇచ్చి తన బాధ్యత వదులుకుంది. అత్తయ్యా, నేనూ వెళ్ళాం. విజయ్ అసలు మన తెలివిలోనే లేడు. అతడి పరిస్థితికి డాక్టర్లే ఆందోళనపడుతున్నారు. అంతకుముందు చూసినవాళ్ళెవర్నీ గుర్తుపట్టలేనంతగా మారిపోయాడు. అతడి పెదవులు ఆ అపస్మారక స్థితిలో కూడా మధూ, మధూ అంటూ నీ పేరే కలవరిస్తున్నాయి. మందులు పనిచేయనందుకు డాక్టర్లు ఎంతో ఆశ్చర్యపడుతున్నారు.

అతడి మానసికస్థితిని నేను అర్థం చేసుకున్నాను మధూ! అతడికి మందులు పనిచేయకపోవడానికి కారణం అతడికున్నది ఆ టైఫాయిడ్ జ్వరం ఒక్కటే కాదు, అంతకు పెయ్యిరెట్లయిన మానసిక వ్యథ, సంఘర్షణ అతని మనసుని చెదపురుగులా తినేస్తూంది. ప్రియవల్ల అతడి హృదయం బాగా గాయపడి ఉంటుంది. ఇప్పుడు తెల్సింది అతడికి నీ విలువేమిటో. అందుకే నీ కోసం తపించిపోతున్నాడు. పశ్చాత్తాపంతో రగిలిపోతున్నాడు. అతడి కిప్పుడు కావల్సింది మందులు కాదు, వైద్యం కాదు, నీ ఆదరణ, నీ ఆత్మీయమైన చల్లని చేతిస్పర్శ. అతడికి తను కోల్పోయిన గత జీవితం తిరిగి తనకు లభిస్తేనేగాని కోలుకోలేడు. మనుషుల్లో పడలేడు. అతను తిరిగి మనిషి కావాలంటే, అతడు గతకాలంలో ఉతడు తన పూర్వజీవితం పొందినా, పొందకున్నా కనీసం ఆ భ్రాంతినైనా కలుగజెయ్యాలి. ఇది తప్ప వేరే గత్యంతరం లేదు. అలాగని డాక్టర్లే స్పష్టంగా చెప్పేరు. అందుకని మేము అతడిని ఇక్కడికి తీసుకొచ్చేశాం. అంతకుముందు మీ ఇద్దరూ కాపురమున్న ఇల్లే మళ్ళీ అద్దెకి తీసుకున్నాం. అక్కడే విజయ్‌ని ఉంచేం. ఇక కావల్సింది నీ సహాయం.

మధూ! నీ కతడిమీద కోపం ఉండొచ్చు. ద్వేషం ఉండొచ్చు. ప్రతీకారం ఉండొచ్చు. ఇవన్నీ ఉన్నా నీ కతడిమీద పుష్కలమైన ప్రేమ కూడా ఉంది. నాకు నీ మనసు తెల్సు మధూ. నీది ప్రేమ హృదయం. అది చచ్చిపోదు. నువ్వతడిని క్షమించి తీరాలి. నువ్వతడితో జీవితం తిరిగి పంచుకోక

పోయినా నువ్విప్పుడు అతడిమీద చూపించవల్సింది తల్లికి బిడ్డమీద ఉండే వాత్సల్యం, అభిమానం, ఆదరణ. అంతమాత్రం కూడా నీ హృదయంలో అతడికి దొరకనంతగా నీ మనసు కరడుగట్టుకు పోలేదని నా విశ్వాసం ఇది నువ్వు ఆజ్ఞ అనుకో, ఇంకేమైనా అనుకో. నువ్వు మాత్రం వచ్చి తీరాలి. నువ్వు పది కాలాలపాటు పసుపుకుంకుమలతో ఉండాలనే స్వార్థంతోనైనా నువ్వు వస్తావు. నాకు తెలుసు. నీకోసం ఎదురుచూస్తున్నాను.

లక్ష్మి "

ఉత్తరం పూర్తిచేసిన లక్ష్మి స్థాణువులా ఉండిపోయింది. ఆమె హృదయంలో సముద్ర తరంగాలు ఎగసెగసి పడుతున్నాయి. కళ్ళవెంట టప్‌టప్ మని రెండు నీటిచుక్కలు జాలువారేయి. ఇంకేమి ఆలోచించలేకపోయింది మాధవి. ఆ రోజే దొరికిన బస్సు పట్టుకుని బాబిగాడిని తీసుకుని బయలు దేరింది.

## 24

వారంరోజుల తరువాత మొదటిసారి తెలివివచ్చింది విజయ్‌కి కళ్ళు విప్పి చూశాడు. అతడి కళ్ళు తనని మోసంచేస్తున్నాయేమో ననిపించింది. మనసకలాగినట్టనిపించింది. కళ్ళు గట్టిగా మూసుకుని మళ్ళీ తెరిచేడు. ఎంతో నీరసంగా, నిస్సత్తువగా ఉందతనికి. అప్పుడు టైమ్ రాత్రి పన్నెండయింది. మళ్ళీ కళ్ళు విప్పి తన ఎదురుగా స్టూల్‌మీద కూర్చుని గోడకి చారబడి నిద్ర పోతున్న ఆమెవంక నిదానంగా చూశాడు. తన కళ్ళు మోసం చెయ్యడంలేదు. ఆమె మాధవే. రేగిపోయి మొహంమీద పడుతున్న జుట్టుతో నిద్రలేమివల్ల ఎంతో అలసటగా ఉందామె మొహం. తన చుట్టూ పరికించి చూశాడు. అది తన ఇల్లే. తన ఎదురుగా తన మాధవే. అతడి కళ్ళలోకి క్రమంగా ఆనందం పొంగి వచ్చింది. తన మాధవి, తను కోరుకున్నట్టుగా తనకోసం, తన ఎదురుగా ఎంతో ఆత్రుతగా కాచుకుని కూర్చుంది. ఓహో! ఎంత అపూర్వం! ఎంత ఆనందం! ఇన్నాళ్ళూ జరిగిందంతా నిజం కాదేమో. కలేమో. తన మధు తన ఇల్లు ఎప్పటిలానే ఉన్నాయేమో. అది కలే అయితే అంత భయంకరమైన కల ఇంకొకటి ఉండదు. కానీ కలకాదు అని అతని చేతికి ప్రియ తొడిగిన ఉంగరం గుర్తుచేసింది. కల కాదు. అదంతా నిజమే.

అయితే .. అయితే తన మాధవి తనను క్షమించింది. తనకోసం

వచ్చేసింది. మాధవిది ఎంత ఉన్నతమైన మనసు! ఏ దేవుడు తిరిగి తనకు తన జీవితాన్ని ప్రసాదించేడు. ఓహో! భగవాన్! నీకు జీవితాంతం ఋణపడి ఉంటాను. అత . . మనసు ఈ ఆనందాన్ని, ఊహించని అదృష్టాన్ని భరించ లేకపోతూంది.

"మధూ" తనలోని ఆనందాన్ని, ప్రేమని అంతా ఆ రెండక్షరాల్లో ఇమిడ్చి మెల్లగా పిలిచేడు విజయ్. ఆ పిలుపుకోసమే వేచివున్నదానిలా కలలో సైతం ఆ పిలుపు విన్పిస్తే మేల్కొనేదానిలా చప్పున కళ్ళు తెరిచింది మాధవి. తనవంకే ఆరాధనగా చూస్తున్న అతడిని చూసిన ఆమె కళ్ళు తళుక్కున మెరిశాయి. అంతవరకూ గూడుకట్టుకున్న దిగులు, ఆందోళన ఎగిరిపోయాయి. స్టూలు దిగి గబుక్కున అతని దగ్గరకి వచ్చి మోకాళ్ళమీద కూర్చుని అతనిమీద చెయ్యివేసి నిమిరింది. "మీకు .. మీకు తెలివొచ్చిందా? ! అబ్బ! భగవంతుడు ఎంత కరుణామయుడు." ఉద్వేగంతో ఊగిపోతున్న ఆమెకు మాటలే రావడం లేదు. అతన్ని తదేకంగా, కళ్ళనిండుగా చూసుకుంటున్న ఆమెకి కళ్ళలో నీళ్ళు తిరిగేయి.

"మధూ! నా మధూ! నన్ను క్షమించేవా? నా కోసం వచ్చేవా?" నీరసంతో ఆయాసం ముంచుకొచ్చింది అతనికి. ఎంతో మాట్లాడాలని ఉంది. ఏమేమో చెప్పాలని ఉంది. ఆమెను ఆర్తిగా గుండెలకత్తుకోవాలని ఉంది. ఆమె కన్నీళ్ళు తుడవాలని ఉంది. కానీ ఏమీ చెయ్యలేకపోతున్నాడు.

"మీరు ఎక్కువగా మాట్లాడకండి. బాగా కోలుకున్నాక అన్నీ చెబుదురుగాని విశ్రాంతిగా కళ్ళు మూసుకుని పడుకోండి." మృదువుగా అంది మాధవి.

"అలాగే మధూ! జీవితాంతం నీ ఆజ్ఞలకి బద్ధుడనయి ఉంటాను. అందులో ఎంత మధురిమ ఉందో నేను పూర్తిగా తెలుసుకున్నాను .."

"అదుగో. మళ్ళీ మాట్లాడుతున్నారు." మందలింపుగా అంది.

విజయ్ మనసెంతో పరవశంగా ఉంది. ఆమె అలా మునుపటిలా ఆజ్ఞాపిస్తూ, మందలిస్తూ, కోప్పడుతూ, కసురుతూ ఉంటే అతడి మనసు పులకరించిపోతుంది. ఎంతో ఆహ్లాదంగా ఉంది. తన గుండెలమీదనున్న ఆమె చేతిని ఆప్యాయంగా, అనురాగంగా గుండెలకత్తుకున్నాడు. కళ్ళమీద పెట్టుకున్నాడు. తన్మయత్వంగా ఆ చేతిని ముద్దుపెట్టుకున్నాడు. మృదువుగా తన చేతిని విడిపించుకుని దుప్పటి కప్పింది మాధవి.




అతనిమీద మాధవికున్న అనుమానాలన్నీ పటాపంచలయిపోయాయి. అతడి ప్రేమమీద ఇప్పటికి నమ్మకం కుదిరింది మాధవికి. తమ ప్రేమకి, దాంపత్యానికి మధ్యలో గ్రహణం పట్టింది. అంతేగాని విజయ్ ఎప్పుడూ తన వాడే. అతడి మనసులో ఉండేదెప్పుడూ తనే. ఈ ఊహ, ఈ భావం ఆమె కెంతో శక్తిని, ఉత్సాహాన్ని ఇచ్చింది విజయ్‌మీద ప్రేమను ఇనుమడింప జేసింది.

చిగిర్చిన ఆశలతో, తొలగిన వ్యథతో, మాధవి సమక్షంలో, ఆమెను చూస్తూ, ఆమె సేవలతో కోలుకోవడం మొదలుపెట్టాడు విజయ్. జ్వరం క్రమంగా తగ్గుముఖం పట్టింది. రాత్రింబగళ్ళు ఆమె తన గురించి పడుతున్న తపన, ఆమె చేస్తున్న సేవలు, బాబిగాడి కబుర్లు ఇవన్నీ అతడిలో నూతన శక్తిని కలిగించేయి. అతడి మనసు పట్టలేని ఆనందంతో, జీవితాన్ని గెల్చుకున్న విజయగర్వంతో ఉప్పొంగిపోయేది.

"నీది పాలసాగరం లాంటి మనసు మధూ! నిన్ను ఎంత కష్టపెట్టాను. నీది ఎంత క్షమాహృదయం మధూ! నిజంగా నేనింత అదృష్టానికి అర్హుడి నవుతాననుకోలేదు. కల్మషంలేని ఆ పాలసాగరం లాంటి ప్రేమ హృదయానికి నేనే అధిపతి ననుకుంటే ఎంత గర్వంగా ఉందో చెప్పలేను మధూ!" అనేవాడు

విజయ్, ఆమె సేవలందుకుంటున్న ప్రతి క్షణం ఆమెను అపురూపంగా చూసుకుంటూ.

మధురంగా నవ్వేది మాధవి "అయ్యగారికి కవిత్వం బాగా ఒంటబట్టి నట్టుందే. నిజంగా మన ఇంట్లోనే పాలసాగరం ఉందనుకుని పాలు కొనడం మానేయకండి మీకు పుణ్యం ఉంటుంది" అనేది పరిహాసంగా.

విజయ్ ఆమె గొప్పతనం గురించి, క్షమించటం గురించి మాట్లాడ్డం మానకపోవడంతో ఆమెకి విసుగెత్తేది.

"ఇలా మాటమాటకి క్షమ క్షమ అంటూంటే నే నిప్పుడే వెళ్ళిపోతాను. మన ఇద్దరి మధ్య క్షమ ఏమిటి? ఆ మాటకొస్తే నేను కష్టపెట్టలేదా మీ మనసు? మీరు ఇంటికొచ్చిన ప్రతిసారీ తిరస్కరించి పంపేదాన్ని. నే నడగకుండానే క్షమించేసిన మీరు కాదా గొప్పవారు" అనేది. విజయ్ ఆమెను ఆరాధనగా చూసేవాడు.

## 25

విజయ్‌కి బాగా తగ్గిపోయింది జ్వరం. పథ్యం తీసుకున్నాడు. అపురూపంగా చూసుకునే మాధవి సపర్యలతో చింతలన్నిటికీ దూరమయిన మనసుతో చాలా త్వరలోనే పుంజుకున్నాడు విజయ్. ఒక నెలరోజులు మాత్రం ఇంటిపద్ద ఉన్నాడు. తరువాత ఒక ప్రయివేట్ కంపెనీలో ఉద్యోగం చూసుకున్నాడు. అతడి కిప్పుడు జీవితం ఎంతో ఆనందంగా, మధురంగా ఉంది. పగలల్లా ఆఫీసులో ఉన్నా అతడికి మాధవి తలపులే. సాయంత్రం ఇంటికొచ్చే సరికి ఎప్పటిలా నవ్వుతూ ప్రత్యక్షం అయ్యే మాధవి, బాబిగాడి అల్లరి, ఇంటి గడప తొక్కితేచాలు అతడికి స్వర్గంలో ప్రవేశించినట్టుండేది. భగవంతుడు ఇంత త్వరగా తనను క్షమించి తనకి తిరిగి తన జీవితాన్ని ప్రసాదిస్తాడని అతడెప్పుడూ ఊహించలేదు. ఆ టైఫాయిడ్ జ్వరం తనకి దేవుడు జబ్బు రూపంలో ఇచ్చిన వరం. ఆ జ్వరానికి అతడు కృతజ్ఞతలు చెప్పుకుంటూంటే మురిపెంగా నవ్వేది మాధవి.

రెండు మూడు నెలలు గడిచేయి. బాబిగాడిని స్కూల్లో చేర్పించేడు విజయ్. డాక్టర్‌గారు ఎన్నో జాగ్రత్తలు చెప్పడంవల్ల అతడి మనసు ఎంత వేగిరపడుతున్నా అతడు దాంపత్యజీవితానికి మాత్రం దూరంగా ఉన్నాడు.

ఆ రోజు బాబిగాడి పుట్టినరోజు. అనవాయితీగా భార్యాభర్త లిద్దరూ

వాడికి క్రొత్తబట్టలు వేసి కోవెలకి తీసుకువెళ్ళేరు. వాడి పేరుమీద అర్చన చేయించేరు. భార్యాభర్త లిద్దరూ అలా పక్కపక్కన కళ్ళు మూసుకుని చేతులు జోడించి నిలుచుంటే అది విజయ్ మనసులో మధురమైన, పవిత్రమైన అనుభూతిని కలిగించింది. పూజారిచ్చిన ప్రసాదం తీసుకుని బాబిగాడిని ఇద్దరూ చేతులు పట్టుకుని నడిపించుకుంటూ కోవెల నుంచి వచ్చేరు. ఆ రోజెందుకో అతనికి మాధవిని మరీమరీ చూడాలనిపిస్తూంది. తెల్లని జరీ చీర కట్టుకుని, తలనిండా మల్లెలు పెట్టుకుని, కళ్ళకి కాటుకతో నుదుటన జ్వాలలా మెరిసే ఎఱ్ఱని కుంకుమతో ఎంతో అందంగా, పవిత్రతకి చిహ్నంగా కన్పించసాగింది మాధవి.

ఆ రాత్రి బాబిగాడితో కలసి సినిమాకి వెళ్ళివచ్చేరు. ఆ రోజంతా అతని మనసు మాధవిమీద వాంఛతోనే నిండిఉంది. సినిమా కూడా సరిగ్గా చూడలేకపోయాడు. ఆ క్షణంలో అతనికి మాధవంత అందంగా ఈ ప్రపంచంలో ఎవ్వరూ ఉండరనిపించింది. ఇంత అందాలరాశిని సుగుణవతిని తనింతకాలం దూరంచేసుకుని ఎలా ఉండగలిగేనా అని అన్పించింది.

ఇంటికొచ్చిన తరువాత బాబిగాడు అన్నం తిని నిద్రపోయాడు. చలిగాలి రివ్వురివ్వున వీయసాగింది. కిటికీ మూయడానికి వెళ్ళింది మాధవి. మనసులో కోరిక. పైన చలిగాలి. ఎదురుగా తన ప్రేమదేవత మాధవి. ఆమెమీద ఉన్న అనురాగమంతా అతనిలో ఒక్కసారిగా ఉప్పొంగింది. ఆ అనురాగం కోరికగా రూపుదాల్చింది. కిటికీలో నుండి రివ్వున వచ్చిన చలిగాలి మాధవి పైటను తొలగించింది. ఆమె సర్దుకుంది.

విజయ్ మనసు ఉద్వేగంతో ఊగిపోసాగింది. పరవశంతో మైకం కమ్మసాగింది. శరీరం ఆవేశపూరితమయిపోయింది.

అతడు నెమ్మదిగా మాధవి దగ్గిరకి వెళ్ళేడు. ఆమె రెండు భుజాలమీదా చేతులువేసి తనవైపు త్రిప్పుకున్నాడు. ఆమె కళ్ళలోకి తమకంగా చూడసాగేడు. అర్థంచేసుకుంది మాధవి. ఆమె ఒళ్ళు ఝల్లుమంది. అతడు చప్పున ఆమెను మీదకి లాక్కున్నాడు. ఆర్తిగా, అనురాగంగా, బలంగా తనకేసి అదుముకున్నాడు. ఆమె కళ్ళమీద, నుదుటిమీద, బుగ్గలమీద, మెడమీద, పెదవులమీద విపరీతమైన కాంక్షతో తమకంతో ముద్దులు పెట్టుకోసాగేడు. అతడు ఉద్రేకంతో ఊగిపోతున్నాడు.

"మధూ! నా మధూ!" అంటూ మత్తుగా కలవరించసాగేడు.

మాధవి అతని ఇనుపకౌగిలిలో నలిగిపోతూంది. అమె హృదయం కూడా క్షణకాలం స్పందించింది. కానీ అది క్షణకాలం మాత్రమే. అమె మైకం వదిలిపోయింది అమెకు తక్షణం ఏదో స్ఫురించింది. ప్రియతో అతడి అనుబంధం గుర్తొచ్చింది. ప్రియతో అతడు గడిపిన క్షణాలు గుర్తొచ్చాయి. ఇప్పుడు అతడి శరీరం, అతని ముద్దులు, అ కౌగిలింత జుగుప్సను కలిగిస్తున్నాయి. మనస్సు కంపరంతో, అయిష్టతతో మెలిదిరిగిపోతూంది. తను ఆ శరీరాన్ని భరించలేదు. అతడితో శరీర సుఖాన్ని మనస్పూర్తిగా అనుభవించలేదు. అ సుఖాన్ని అసహ్యించుకుని తిరస్కరించే మనస్సుని చంపుకోలేను. అలాగని... అలాగని.... తనమీద ఎంతో అనురాగంతో, కోరికతో తనను కాంక్షించే అతన్ని కాదనలేదు.

"భగవాన్!" అమె కళ్ళు గట్టిగా మూసుకుంది. అమె కళ్ళవెంట రెండు నీటిచుక్కలు అతని వీపుమీద పడ్డాయి. అతను ఉలిక్కిపడ్డాడు. అతని ఉద్రేకం చల్లారిపోయింది. మైకం దిగిపోయింది. అతను మెల్లగా అమెను వదిలేశాడు.

"మధూ ఏమిటిది, కంగారుగా", ఆశ్చర్యంగా అడిగేడు.

"నన్నేమీ అడక్కండి. నేనేమీ చెప్పలేను" రెండు చేతుల్లో మొహం దాచుకుని అక్కడనుండి పారిపోయింది మాధవి. వేరే గదిలోకి వెళ్ళి రెండు తలుపులూ దగాల్న వేసేసుకుంది. స్థాణువయిపోయాడు విజయ్

నాలుగు గంటలు గడిచినా మాధవి తలుపు తియ్యకపోవడంతో తనే వెళ్ళి తలుపుగుద్ది పిలిచేడు. ఎంత పిలిచినా సమాధానం లేదు. ఏదో భయంతో వెన్ను జలదరించింది. కిటికీలో నుండి కర్రపెట్టి దాని సహాయంతో తలుపు తెరిచాడు. మాధవి మంచంమ్మీద పగతగా పడుకుని ఉంది.

అమె మంచంమీద కూర్చుని "మధూ!" అంటూ పిలిచేడు అప్యాయంగా. అమె పలకలేదు. అతడికి టీపాయ్‌మీద ఏదో ఒక కాగితం కనిపించింది. అతడి కప్పుడు ఏదో అనుమానం తోచింది. చప్పున అ కాగితం జేబులో కుక్కుకుంటూ మాధవిని కంగారుగా అటు ఇటు త్రిప్పేడు. అమె చేతిలోని నిద్రమాత్రల సీసా క్రిందపడింది.

"మధూ!" గుండెలు బ్రద్దలయ్యేలా అరిచేడు విజయ్. అతని తలమీద పిడుగులు పడసాగేయి. మాధవిలో ఇంకా ప్రాణం పోలేదు. అమెను రెండు చేతులమీదా ఎత్తుకుని హాస్పిటల్‌కి తీసుకువెళ్ళేడు.



డాక్టర్లు హడావుడిగా ఆమెను పరీక్షిస్తున్నారు. ఆమెను బ్రతికించ డానికి మానవప్రయత్నాలు చేస్తున్నారు.

బైట బెంచీమీద కూర్చున్న విజయ్ మనసు అల్లకల్లోలంగా ఉంది. ఏమిటిది? ఏం జరిగింది? మాధవి ఎందు కిలా చేసింది? తనకి అదృష్టాన్ని ఇచ్చి నట్టే ఇచ్చి ఎందుకు తిరిగిలాక్కొంది?

ఆమె రాసిన కాగితం అప్పుడు గుర్తొచ్చిన విజయ్ జేబులో నుండి దాన్ని తీసి చదువుకున్నాడు.

"ఏమండీ!

ఇలా చేస్తున్నందుకు మీరు చాలా బాధపడ్తారని తెలుసు. మీ కిది తీరని ఆశాభంగం, గొడ్డలిపెట్టు అని నాకు తెలుసు. కానీ నే నేం చేయగలను? నా మనసునిండా మీకు ప్రేముంది. బ్రతికి ఉన్నా, చచ్చిపోయినా మిమ్మల్నెప్పుడూ ప్రేమిస్తూనే ఉంటాను. కానీ మీతో శరీర సంబంధానికి నా శరీరం ఎదురుతిరుగు తుంది మీరు వరాయి స్త్రీని పొందేరన్న చెడ్డ జ్ఞాపకం ఆ క్షణంలో నా మనసు మీద ఎంతో బలంగా పనిచేస్తూంది ఆ బలహీనతని నేను జయించలేను. నేను మిమ్మల్నెంత ప్రేమిస్తున్నా, మీతో దాంపత్య జీవితానికి పనికిరాను. నామీదెంతో అనురాగం నింపుకున్న మీరు ఆ కోరికను నిగ్రహించుకోలేరు. ఒక ఇంట్లో ఉంటూ అలా నిగ్రహించుకోవడం సాధ్యమూ కాదు. దూరంగా బ్రతకడం కూడా అసాధ్యం. ఒకే ఇంటిలో కలిసి బ్రతుకుతూ మిమ్మల్ని అనుక్షణం ఈ క్షోభకి గురిచేయలేను. నేనూ ఈబాధని భరించలేను. ఈ సత్యం నిజంగా ఈ క్షణం వరకు నాకూ తెలీదు. తెలిసిఉంటే అపుడేం చేసేదాన్నో చెప్పలేను.

అందుకే నేను సెలవు తీసుకుంటున్నాను. బాబుకి మీరున్నారు. ఆ నమ్మకం, ఆ తృప్తి నాకున్నాయి. నన్ను మీరు మనస్పూర్తిగా క్షమిస్తారనే ఆశతో

మీ మాధవి."

విజయ్ కళ్ళవెంట కన్నీరు ధారగా వర్షించసాగేయి. ఎంత పని చేశావు మాధవీ ? ఇందుకని నా క్షేమం తెలిసినా నేనా పని చేసి ఉండేవాడిని కాదు. నేను నీ నుండి ఏమి కోరను మధూ! నువ్వు నా కళ్ళ ఎదురుగుండా ఉంటే చాలు. అతడి హృదయం మూగగా రోదించింది.

అంతలో తలుపులు తెరుచుకుని డాక్టర్ బయటకొచ్చేరు.

"ఐయామ్ సారీ మిస్టర్ విజయ్. ఆమెను బ్రతికించలేకపోయాం " డాక్టర్ తన పని అయిపోయినట్లు అతని భుజం తట్టి వెళ్ళిపోయాడు.

"మధూ ! మధూ ! మధూ !" అతని హృదయం ఆక్రోశించసాగింది లోపలి కెళ్ళి దుప్పటి కప్పివేసిఉన్న మాధవి శవంమీద పిచ్చివాడిలా, పసివాడిలా పడిపోయి రోదించసాగేరు విజయ్.






(గత సంచిక తరువాయి)

## 30

అస్పత్రిరెట్టిన యిల్లు కైలాసం బాబుదవి సెప్పినాను గదండి. అది సెంకుటి కొంపైనా పాతదండీ.

మూసిలి గేదె యీపునాగ దాని కప్పు వొంగిపోనాదండి.

అక్కుంద కొచ్చివోళ్ళు- కానామంది బీదోళ్ళేనండి.

ఎక్కడ కూకుంటే అక్కడే తుప కుక్కిన ఉమ్మేపే రకపండి. అయినా అసుపత్తిరికి కొత్తపందిరినాగ సల్లగుండే దండి.

సిట్టిబాబు ఎప్పుడ్నీ "యింత యియ్యి" అని డిగీవోడు కాడండి. "సీటెంత" అని ఎవరైనా అడిగితే నే సెప్పేవోడండి. ఇచ్చుకోలేనోళ్ళు అడిగేవోరు కారండి.

అలాటోళ్ళ కోసరం మూలగదిలో "సీలు డబ్బా" ఎట్టినాడండి. అళ్ళు అందులో పావలా పరకా యేసినారా సంతోసం లేకపోతే యింకా సంతోషం అనీవోడండి-గారడీవోడు నాగ.

యేసంకాలం ఎరనాగ మొదట పచ్చపచ్చగా ఉండీదండి అసుపత్రి. కాని మూణ్నెల్ల ఖ్యాసరికి ఒక్కసాలి వార దొచ్చినట్టు పొంగిపోనాదండి

అ సుట్టుపక్కల పమూళ్ళకి డాట్రు నేడండి.

అళ్ళు డాట్రుకాడి కెళ్ళాలంటే పది మైళ్ళెళ్ళాలండి మరంచేత సిట్టిబాబుకి సవ్వడానికూడా టయాం ఉండేదికాదండి.

సూద్యుడు లెగకుండా లెగిసీవోడండి

ఎనిమిది గంటలకి అస్పత్రి తీపే పరకు ఏయో పుస్తకాలు సదువుకొనే వోడండి.

అనక పనండి- పని రేత్తిరి పదికి అయిపోతే అదురుష్టవేనండి, పస్టేసినో దెవ్వడికీ రంబ వొచ్చి రమ్మన్నా వోపికుండదండి.

మద్దేన్న పేళ వొణ్ణాపికో అరగంట టయాం దొరుకుతే గొప్ప అదురుష్టవే వనుకోవాలండి.

మూణ్నెల్లలో సిటీనించి ఓ మంచి కంపౌండర్ని తెచ్చినాడండి.

"బుల్లిబాబు, బుచ్చిబాబు మొదట్లో సేవలు జేసినారుగారా?! సిట్టిబాబు ఇంద్రజిత్తుగాళ్ళాటివోడై యుండాలి. వొచ్చే పాలి ప్రెసిడెంటు అవడానికే సేవంతాను" అన్నారండి ప్రెజ.

"నాను నిలబడ్డు అని కాయితం రాసిస్తాను." అన్నాడటండి సిట్టిబాబు.

"అయితే ఎమ్మెల్లే ఔదారని ఇంకా పెద్ద ప్లానేసిఉంటాడు" అనీసీరండి.

"నాను ఎలక్సన్ల ఊసుకి ఎల్లను గాక ఎల్లను" అన్నాడండా బాబు.

"మరైతే నకసలైటై యుంటాడు." అనసేరండి జెనం.

యింక ఆ బాబు వొయిబ్యంఅంటారా ఎవరూ ఏలెత్తి సూపడానికీల్లేదండి.

సెవాన్ని పాతీసినా పరవానేదు- తగలెట్టీకుండా ఉంటే సాలు పేనం పోసేగలడండి.

అ బాబు మందిస్తే మూగోడు మాటలాడీసీవోడండి.

సెవిటోడు సల్లగాలి సప్పుడుకి నిద్దర లెగిసిపోయీవోడండి.

ఆ బాబు అపరేసన్ సెయ్యాల్సినకాడ ఇంజీషను యిచ్చీవోడండి. ఇంజీషను ఇవ్వాల్సినకాడ మాత్రల్లేయిచ్చీవోడండి.




యింక దెయ్యంపట్టిన కేసులకి ఆ వాటు పెట్టింది పేరండి.

మా ఊళ్ళోనే ఓ గుంట_పేరు మరిసి పోవాను-పెళ్ళిదుకొచ్చిందే - ఇలాగ ఎఱ్ఱకోక కట్టుకున్న అమ్మోర్లా గుండే దండి అవోసారి సెరువునుంచి నీళ్ళు తెస్తుంటే గాలి వోలినాదండి

పట్టుకున్నది కూడా మామూలు దెయ్యం కాదండి. తురక దెయ్యవఁట.

ఆ ముందటేడు ఎవడో సాయిబు పెళ్ళాన్ని సంపేసి సెర్లో పారేసినా డటండి - అప్పట్నుంచి ఆ పచ్చింది దెయ్యవై సెట్టు మీద కూకుంటా దటండి.

ఆడోళ్ళకైతే పట్టపగలే కనిపిస్తా దటండి.

రేత్తిరిపూట ఏ మొగాడు సెరువుకాడి కెళ్ళినా తెగ అల్లరిపెట్టేసేదటండి.

యింకా యీ దెయ్యంపట్టిన గుంట- వోరవేఁసి రోజులు వాణ్ణం ముట్టేది కాదండి

తాన్నం ఆడేది కాదండి.

తల దువ్వేది కాదండి.

నిద్దరబోయేది కాదండి

అలాగున్నా బావుండిపోనండి.

ఊరు తగలెట్టేస్తానని కూకుండే దండి.

మరింత రేత్తిరీ, పగలూ దానికి కాపలాలండి.

పోనీ మంచానికేసి కట్టేద్దావఁనుకుంటే ఓపాలి అలా కట్టబోతే ముగ్గురు మొగోళ్ళని ఎడంసేత్తో యిసిరేసిందిటండి. మిగతావాళ్ళమీద రుబ్బురోలు_యిలా అల్చిప్పనేదూ, అల్చిప్పలా - యిసిరీ

సిందటండి. అది తగిలి ఒకడి కాలిరిగి పోనాదటండి.

వోరానికో, పదిరోజులకో వాణ్ణాని కూర్కుంటే, వంటంతా తినీసి, యింకా తెమ్మనీదిటండి.

దాన్ని సివంచలం కొండకి తీసికెళ్ళి నారండి.

మస్తాను దరగాకి తీసికెళ్ళినారండి.

పోగులు కట్టించినారండి.

పొగలు యేయించినారండి.

నిమ్మకాయలూ; కోడిపిల్లలూ కరుసు తప్ప నయంకాలేదండా గుంటకి.

దాన్ని తీసుకొచ్చినారండి సిట్టిబాబు కాడికి.

ఆ బాబు మందులిచ్చినాడండి.

అంతేనండి.

పగలూ-రేత్తిరీ ఒకటే నిద్దరండి. దెయ్యం నిద్దర.

పదేను రోజుల్లో మామూలు మనిసై పోనాదండి

ఎన్నెల రేత్తిరి సెంద్రుళ్ళా పెరిగి పోనాదండి ఆ బాబు పేరు.

కూలీల కుర్రోళ్ళు -సాయంత్రపేళ కాలచ్చేపానికి-ఎళ్ళేవోరండి అస్పత్రి కాడికి.

ఆ బాబు అళ్ళకెన్నో యిసయాలు సెప్పేవోరండి.

ఇలా గుండగా ఓపారి పోలీసులు లారీల్లో దిగిపోనారండి మా ఊరు.

అమ్మోరి పండగ యింకా నెలుంది కదా? ఎందుకొచ్చినారు సెప్మా అను కున్నానండి నాను. అళ్ళెవరి ఇంటిమీద పడతారోనని అళ్ళెనక పడ్డానండి.

అళ్ళు ఇంటిమీద పళ్ళేదు.

గుడిమీద పళ్ళేదండి.

అస్పత్తిరి సుట్టేసినారండి.

అళ్ళలో అపీసర్లు అస్పత్తిర్లో చొర బడి అస్పత్తిరంతా తల్లకిందల జేయిస్ని నారండి. కోడి గెలికేసినట్టు-అస్ప త్రంతా గెలికేసినారండి.

అపరేసను కేసులు కుట్లూడదీసి జూశ్ళేదండి- అదొక్కటేనండి అళ్ళు సెయ్యని పని.

నాలుగ్గంటలసేపు సిట్టిబాబుని ఏటేటో అడిగినారండి.

ఎల్తూ. ఎల్తా "యీ ఎల్లడం మళ్ళీ రాడానికే" అన్నారటండి.

## 31

ఇద్దైన వోరానికి నామా, మా బాబూ సిటీ ఎళ్ళినావండి.

సిటీ ఎత్తే సానింటి కెళ్ళవాలసిందే నని శానామందిరనుకుంటే — సిటీ ఎత్తే యినస్పెక్టరుకాడికి ఎళ్ళవాలిసిందేనని మా బాబు "తియరీ" అండి.

మరంచేత సర్కిలుబాబుకి సలాం కొట్టినావండి. నాను బైటుండిపోనానండి. అంచేత ఆ బాబులు ఏటి మాట్టాడు కున్నారో నాకు తెలదండి.

కాని ఇంటికొచ్చినాక మా బాబు




నన్ను పిల్చి "ఒరే కెప్టెనూ! నా నో మాట జెప్తాను. అది నీ ముండకాక్కాదు సరికదా_గాందీగోరు వొచ్చి అడిగినా సెప్పకూడదు" అన్నాడండి.

"మళ్ళీ మీకే సెప్పను" అన్నానండి నాను.

"మరేం నేదు. సిట్టిబాబు నకసలైటని ఖోలీసోళ్ళ నమ్మకం. అంచేత నువ్వా బాబుతో నేస్తంకట్టి_ఆ బాబేటి సేస్తాడు?

బాంబులు సేస్తాడా?

బరిసెలు పేస్తాడా?

ఆ బాబుకాడికి సిటీ నుంచి ఎవ రొస్తారు?

ఆళ్ళతో ఏటి మాటాడతాడు?

యియన్నీ కనిపెట్టి నాతో సెప్పాల" అన్నాడండి.

"ఓస్! అదెంత పని? ఆ బాబు సేసే బాకులూ, బాంబులూ తెచ్చీమన్నా తెచ్చేస్తాను" అన్నానండి నాను.

అప్పట్నించీ ఆ బాబుకాడికి ఎల్లడం మొదలెట్టినానండి నాను. తొలిసుట్టు ఆ బాబుకాడి కెళ్ళినప్పుడు సాయింత్రం అయిపోనాదండి.

ఆ బాబు గదిలో ఉన్నాడండి. ఆ బాబు కెదురుగ్గా_ ఓ మొగుడు, పెళ్లాం కూకున్నారండి.

అళ్ల కూలోళ్ళని అళ్ల సెప్పకర్లేన్నె దండి.

తల్లి సేతిలో వున్న పిల్లని సూస్తే సాలండి.

అళ్ళది ఆకలి జబ్బయితే పిల్లకి

మరో రోగం కూడా ఉదంవి సూదగానే తెలిసిపోతాదండి.

"బాబుకి దణ్ణమెట్టు" అందండి తల్లి.

పిల్ల సేతులు జోడించి "దణ్ణం" అన్నాదండి.

దెయ్యం మాట్టాడినట్టయిపోనాదండి నాకు.

అంతవొరకూ ఆ పిల్లకి అర్నెల్లే అనుకున్నానేమో తుళ్ళిపడిపోనానండి.

"ఎళ్ళొస్తావండి" అన్నారు మొగుడు, పెళ్ళాం లెగిసి.

"మంచిది" అన్నాడండి సిట్టిబాబు.

కాని అళ్ళెళ్ళనేదండి.

ఆ మొగుడుగోడు బనీను జోబీలన్నీ ఎతకడం మొదలెట్టినాడండి.

మేజిక్ వోడి కోటుకి ఎన్ని జోబీ లుంటాయో అడి బనీనుకి అన్ని జోబీ లున్నాయండి.

ఎతికి ఎతికి - యీ జోబీలోంచి కుసిన్ని - ఆ జోబీలోంచి కుసిన్ని పాత నోట్లు - అన్నీ రూపాయివీ - రెండువీ - తీసి బల్లమీద పోగెట్టినాడండి.

పోగు ముప్పైకి తక్కువుండదండి. నలభైకి యెక్కువా వుండదండి.

"ఏటిది?" అన్నాడండి సిట్టిబాబు.

పెల్లెలు ఫీజు యిచ్చినట్టు మొకం ఎట్టినాడు.

"బాబూ! ముప్పై రోజులూ మీ అప్పత్తిర్లో ఉన్నాం - వొయిజ్జెం జేయించుకున్నాం - బాబ్బాబూ - కాదనకు - యింతకన్న యిచ్చుకోలేం" ఆ తల్లి మాటాడుతున్నాదే గానండి గుడ్లమ్మట నీరు కక్కేస్తున్నాదండి.

సిట్టిబాబు లెగిసినాడండి.

టేబిలు మీదున్న పోగు ఒక సేత్తో తీసేడండి. రెండో సెయ్యి ఆ తల్లి బుజంమీద ఏసి ఆ నోట్లు సేతిలోఎట్టి "పిల్లడు నీరసంగా ఉన్నాడు. పాలు కొని పట్టు" అన్నాడండి.

అంతేనండి.

మూర్చొచ్చినదాన్లా ఆ బాబు కాళ్ళ కాడ కుప్పలా పడిపోనాదండి ఆ తల్లి.

ఏడుస్తూ కాళ్ళని పట్టేసినాదండి.

ఆ బాబు ఆ యమ్మని లెగదీసి మెట్లు వొరకూ దిగబెట్టినాడండి. అళ్ళు నడిసెళ్ళి పోతూవుంటే అలాగ సూస్తూ నిలబడి పోనాడండి.

ఆ తరువాత మూర్చలోంచి తేరుకున్నట్లు తేరుకొని లోపలికొచ్చినాడండి.

నన్ను సూసి "రాయికైనా జబ్బు సెయ్యొచ్చు గాని నీకు జబ్బేవిఁటోయ్!" అనడిగినాడండి

నాను అబద్దాలు ఆడే బతికేనండి.

దేవుఁడి నెత్తిమీద సెయ్యేసి మరీ అడగలనండి

కాని అప్పుడు ఆ బాబుతో "కడుపు నొప్పి" అని అబద్దవాఁడినప్పుడు మాత్రం - ఇంతకంటె అర్నెల్లు సెంట్రలు జెయిల్లో శింఁషం సుఖ వఁనిపించినాదండి.

"తిండి తగ్గించు. యీ మాత్రలేసుకో. ఏదోడివటని బిల్లు మాపుజేసీనుంటావా? మీ బాబు నేత కట్టించేస్తావా?" అన్నాడండి నవ్వుతూ.

అసలు ఆ బాబుకాడకెళ్ళగానే నానేదో "షాక్" తినీసినానండి.

ఆ తల్లీపిల్లా మీద ఆ బాబు సూపించిన అబిమానం— నాను పుట్టినాక జెనమంతటికీ ఒక్కపాలి- ఒక్కపాలి- ఎవురన్నా ఒకడు నామీద సూపించుంటే నా బతుకిలాగుండీది కాదనిపించీసినాదండి.

నాను తిరుపతిద్దేవుడి కళ్ళల్లోకి తేరిపార జూసినాను.

ఇనస్పెట్టర్లనీ, మేస్త్రీట్లనీ కూడా జూసినానండి.

కావి యిడిగో- యీ బాబు కళ్ళల్లోకి సూశ్శేకపోనానండి. కారణం సెప్పలేంగానండీ- బయం మాత్తరం గాదండి.

సేస్తే యీ బాబుకాడే పన్జెయ్యాల.

సస్తే యీ బాబు సేతుల్లోనే సావాల.

అనిపించీసినాదండి.

యింక నా బుర్ర పన్జెయ్యడం మానీసినాదండి

ఆ బాబు కాళ్ళకాడ కూలబడిపోనానండి కాళ్ళు పడుతూ. "యిదే పీజు" అన్నానండి

పోలీసోళ్ళ దెబ్బలకూడా ఏడిసీ రకం కానంట నాను.

కాని నాకు తెలకుండానే నా కళ్ళంట నీళ్ళు కారిపోయినాయండి.

ఆ బాబు కాళ్ళు లాగీసుకున్నాడండి.

"ఎర్రోడా? ఏడుపేటి? ఎల్లి రా. ఎప్పుడేనా వొస్తూ ఉండు" అని నన్ను లెగదీసినాడండి.

మా యమ్మని నానెప్పుడూ సూడ్లేదండి.

మా అయ్యెవడో నాకు తెల్దు.

కాని యీ బాబే నా యమ్మ, అయ్య అనిపించీసినాదండి- ఆ బాబు నాకంటే బాగా సిన్నోడైనా.

ఆ బాబుమీద నాను "యిన్ఫార్మరు"గా ఈ బాబు బోగట్టా పోలీసోళ్ళకి అందియ్యాలా!!

యింతకంటె తల్లి పీక కోసీడం సులువనిపించిందండి

"రేపొస్తాను బాబూ" అని ఎల్లిపోనానండి.

(సశేషం)



# నాకు నచ్చిన నా కథ



ఇనుకపల్లి లక్ష్మీనరసింహశాస్త్రి

ముప్ఫయి యేళ్ల క్రిందట 'భారతి'లో అచ్చయిన 'అన్నదమ్ములు' కథను నాకు నచ్చిన కథగా ఎంపిక చెయ్యటం అంత సుళువయిన పనిగా కనిపించలేదు. ఆ రోజుల్లో వరసగా ప్రచురింపబడిన కథలన్నీకూడా బాగావున్నాయనే నా నమ్మకం – తర్వాత తర్వాత వివిధ పత్రికల్లో ప్రచురితమయిన చాలాకథల్లోకూడా బాగా వచ్చినవి యెన్నోవున్నాయి. ఏమయినా వ్యక్తియొక్క అభిరుచులనుబట్టి నచ్చటం నచ్చకపోవటం నిర్ణయించుకోవటం సహజం.

సర్వసాధారణంగా కుటుంబాల్లో డబ్బుకు అవసరాన్ని మించిన ప్రాధాన్యం యివ్వటం, ఆత్మీయులను దూరంచేసుకోవటం, సమయం దాటిపోయిన తర్వాత పశ్చాత్తాపపడటం. మనమంతా గమనిస్తూనే వుంటాం. ఇలాంటి అనర్థకమయిన 'సాంప్రదాయాన్ని' ప్రతిబింబిస్తూ వ్రాయబడిన రచన ఆకర్షణీయంగా వుంటుందనే వుద్దేశంతో యీ కథను నిర్ణయించాను.

## అన్నదమ్ములు

'అబ్బబ్బ! ఒక్క నిముషంకూడా నే నిక్కడ ఉండలేను'

'ఏమిటట్లా రుసరుసలాడిపోతావు. అట్టే సూస్తుంటే'

'అంతేలే నేనంటమే కనిపిస్తుందిగాని, ఇంట్లో యేమిటి జరుగుతుందో నువ్వు పట్టించుకుంటేగా '

'ఏమిటయింది చెప్పమంటుంటే, ఏమిటా సోది వూరికే ' కస్సుమన్నాడు రాఘవులు.

'మంగి తేరగా వుందిగా! ప్రతి పనికి మంగీ మంగీ అని నా వెంటపడటం. ఆమె మాత్రం కూర్చున్న చోటునుంచి కదలకూడదు ఓ మూల బుడ్డాడేమో చంక దిగడాయె! అన్నింటికీ నేనే రావాలేంటి పోనీ బావ చెప్పరాదు '

'మా అన్నయ్యను యేమీ అనక చాలా మంచివాడు '

'అవున్లేవయ్యా, మీ అన్నయ్య మంచివాడు. మీ అక్కయ్యా మంచిదే. నడాన నువ్వూ నేనూ చెడ్డాళ్ళం అంతేగా '

'అసలు నీ కేంవచ్చిందో చెప్పరాదూ '

'నాకేం రాలా ఓ మాటడగనా సంక్రాంతి పండగ గదాని నా కొక్క చీర కొనిపెట్టావు! బుడ్డాడికి ఒక్క చొక్కా అన్నా తెచ్చావు! ఎందు కొచ్చిన శాకిరీ అంట ఈ రొచ్చులో వుండి. నేను దాసీదానిలాగ పనిచెయ్యట మూనూ, నువ్వేమో రెక్కలు విరుచుకోవటమూ యెందుకంట! మన యిల్లు మనం చూసుకోలేమా! ఈ నెల బావ యేమాత్రం తెచ్చాడు. ఆమె యేం పని చేసింది కూటికిలేనప్పుడూ చచ్చేటట్టు పనిచేశాము. ఇయ్యాల కొంచెం సంపాదిస్తున్నాంగదా అనుకుంటే అనుభవం లేకపోయె! పైగా మనిద్దరికి బండచాకిరీ తప్పకపోయె! నువ్వూ ఆలోచించు నేను అన్నానని కాదు ' మంగి రాఘవులు మొహంలోకి ఆలోచనగా చూసింది.

రాఘవులు ఏమీ సమాధానం చెప్పలేకపోయాడు. రాఘవులుకు తెలుసు మంగి అన్నమాటల్లో గల సత్యం. తాము కొనుక్కున్న కొత్త రిక్షాలో తన సత్తువ ఎంతుందో తనకు బాగా తెలుసు తాము కట్టుకున్న పూరింటికి తాను ఎంత శ్రమపడ్డాడో మరిచిపోలేదు. ఎవరికోసం యీ శ్రమ, ఎందుకోసం యీ బాధ అవి యెన్నడూ రాఘవులు ఆలోచించలేదు. తన కష్టార్జితం యింకోళ్ళ పాలవు తోందనికూడా యెప్పుడూ వూహించలేదు. తన జీవితం 'వడ్డించిన విస్తరి'కాదు తాను కష్టంచేసి బ్రతకాలి. ఈ సత్యాన్ని రాఘవులు పూర్తిగా గుర్తించాడు తాను శ్రమపడుతున్నప్పుడు కూడా యింకోళ్ళు తన శ్రమఫలితం అనుభవిస్తున్నారనే భావనే కలగలేదు. అందువలనే తాను అన్నతోపాటు యీవూరు వచ్చినప్పుడు మనం యెట్లా బ్రతకటం యెట్లా సంపాదించటం, యెట్లా జీవించటం యివే

సమస్యలు యిద్దరినీ బాధపెట్టినాయి. బండరాళ్ళను ముక్కలు ముక్కలుగా చేశారు. దుంగకొయ్యల్ని బద్దలుబద్దలుగా చీల్చారు. ధరిత్రిని శ్వేదబిందువులతో తడిపి, నారుపోసి పెంచారు. నిలువుటెండలో కడుపులు మాడ్చుకుని కట్టిన పునాదులమీదనుంచి భవనాలు లేవటం చూశారు. రెక్కలు ముక్కలుచేసుకుని వాగలిపట్టిన పొలం నవ్వింది. అదంతా యితరుల సొమ్ము. సోము, రాఘవులు తీవ్రంగా ఆలోచించుకున్నారు. దీనికి అంతం యేమిటి? మన శ్రమ మనకు అక్కరకు రావటంలేదు. ఇతరులకోసం మన రక్తం ధారపోయటం యెందుకు. ఎంతసేపు ఆలోచించినా యీ సమాజ వ్యవస్థయొక్క అంతు చిక్కలేదు. వాళ్ళు బ్రతకాలి. దీనికోసం యేంచెయ్యాలి. ఇదే ఆలోచన. ఎంత కష్టపడ్డా తిండికే సరిపోవడంలేదు. బ్రహ్మప్రళయంగా వరదలు వచ్చి పంటలన్నీ నాశనమయితే యేం. నీటిచుక్క లేక పోసిన నారు మలమల మాడిపోతే యేం, యెట్లాగయితే నేం తామున్నచోట తమకు తిండి దొరకదనే, పొట్టల్ని చేతపట్టుకుని దేశంమీద పడ్డారు. రకరకాల పనుల్లో తరతమభేదంలేకుండా తమ రక్తాన్ని ధారపోయటమే. దీంట్లోసుఖంలేదు. శాంతిలేదు. దీనికి ఒకతుదంటూలేదు. యౌవ్వనాన్ని వెనక్కు నెట్టేసి కాలం ముందుకు పరుగుత్తుకుపోతుందనీ యిద్దరికి తెలుసు. యౌవనంలో అనుభవించవలసిన సుఖాన్ని బలిచేసుకున్న తర్వాత యింకా మనుగడే అనవసరం అని కూడా వాళ్ళిద్దరూ గ్రహించారు. ఇలాంటి ఆలోచనలు వాళ్ళిద్దర్నీ తీవ్రంగా కలవరపరచినాయి. ఎట్లానైనా తమ సొత్తంటూ ఒకటి యేర్పడని, అంతవరకు అవిరళంగా కృషిచెయ్యాలి. దాని తర్వాత అన్ని సమస్యలు వాటంతటవే చక్క పడతాయని అనుకున్నారు. పగలనక రాత్రనక తమ రక్తం అంతా ధారపోసి తాము లాగుతున్న రిక్షాను యజమానికిచ్చేసి, కొత్త రిక్షాను కొనేశారు. ఇప్పుడు యజమానికి తమ రక్తంలో భాగం ఇవ్వక్కర్లేదు. ఒకవారం పగలల్లా సోము రిక్షాను తీసుకుపోతే రాత్రిపూట రాఘవులు తీసుకుపోతాడు. వంతుల ప్రకారం యిద్దరూ రిక్షాచక్రాన్ని తిప్పేస్తున్నారు. ఎక్కడో పూరిబయట చౌకగా కొంచెంగ స్థలం కొనుక్కుని, ఓ పూరిగుడిసె వేసుకున్నారు. ఇల్లొచ్చింది. ఇల్లాలు రావాలి. సోము పెళ్ళిచేసుకున్న కొద్ది నెలల్లోనే రాఘవులూ పెళ్ళి చేసుకున్నాడు. తమల్ని పీల్చి పిప్పిచేసిన రిక్షా యజమానికి పోటీగా నిలబడ్డారు యిద్దరు అన్నదమ్ములూను! ఒక వస్తువును తమ సొత్తు చేసుకోవడంలో వుండే సాధకబాధకాలు యిద్దరికీ పూర్తిగా అర్థమయినాయి. సోము, రాఘవులు అప్పుడప్పుడు తమ గత చరిత్రంతా జ్ఞాపకం తెచ్చుకుంటూ

విచారిస్తూ వుంటావు తోడికోడళ్ళిద్దరూ కళకళలాడుతూ యింట్లో తిరుగుతూ వుంటే అన్నదమ్ములిద్దరు ఆకలు చిగురించి పుష్పించి కాయలు కాసినట్లు సంతోషపడుతున్నారు సోముకు మగపిల్లాడే రాఘవులకు మగపిల్లాడే !

ఇప్పుడిప్పుడే రిక్షాను అద్దెకివ్వడం కూడా మొదలుపెట్టారు. అయితే రాబడి పూర్తిగా తగ్గిపోతోందని తెలిసిన తర్వాత శరీరం కష్టపడితేగాని డబ్బురాదని తెలుసుకున్నారు. ఇద్దరు అన్నదమ్ములల్లా ఆరుగురయ్యేటప్పటికి మనస్తత్వాలు విభిన్నంగా కనిపించటం మొదలుపెట్టినాయి దృక్పథాలు మారటం మొదలుపెట్టినాయి లెక్కలకు విలువ వచ్చింది తన మన అనే భావం ఒకరికి తెలియకుండా ఒకరికి పెరిగిపోయింది. అన్నదమ్ములు ముభావంగా వూరుకుంటున్నారు తోడికోడళ్ళు రచ్చకెక్కుతున్నారు. శాంతి, సంతోషం యెవరి మనస్సుల్లో వారికి వుంటుందనే మాట అసత్యమని యిద్దరి అన్నదమ్ములకు తోచింది తామున్న యింట్లో వుంటుంది శాంతి సంతోషము

నిజానికి రాఘవులు కష్టపడ్డంత సోము కష్టపడటం లేదు ఇది యివ్వాళ రాఘవులు తెలుసుకున్న సత్యం కాదు తాము మొదట యీ వూరు వచ్చినప్పటి నుంచి సోముకు, రాఘవులుకు తెలిసిన విషయమే ! శరీర దౌర్బల్యం వున్నా మనోబలంచేత యిన్నాళ్ళు సోము నెట్టుకొస్తున్నాడు సోము అండ చూసుకుని రాఘవులు కండలు పెంచుకున్నాడు అన్న సంగతి తనకు మొదటి నుంచి తెలిసినా మంగి యీనాడు ఆలోచిస్తున్నట్లు రాఘవులు యెన్నడూ కూడా ఆలోచించలేదు రాఘవులు తీవ్రంగా ఆలోచించుకుంటున్న కొద్దీ మంగి అంటున్న మాటల్లో సత్యం గోచరమవుతోంది. జీవితం శాశ్వతం కాదు ఓ మూల వృద్ధాప్యం ముంచుకొస్తుంది ఇట్లా యెన్నాళ్ళ సాగిపోవటం, పిల్లాడు పెరిగి పెద్దవాడయితే వాడు కూడా రెక్కలు విరుచుకోవాల్సిందేనా ! నేను కష్టపడింది చాలదా ! అయినా నేను కష్టపడింది నా కోసమేనా ! నా సంతోషం కోసం కాదు నేను కష్టపడి సంపాదించిందంతా ఖర్చయిపోతే నా కొడుక్కి మిగిలేదేముంటుంది ! యేవేమిటో ఆలోచనలు పరంపరలుగావచ్చి రాఘవుల మనస్సుమీద దాడిచేస్తున్నాయి. ఇంట్లో పోరు. బైట శ్రమ తనకు సుఖం లేదు ఈ రెండూ రాఘవులు మనస్సును తీవ్రంగా పీడిస్తున్నాయి వెనక తాము యీ వూరు మొదట వచ్చినప్పుడు తన అన్న, తాను యే విధంగా వున్నారో ఆ దృశ్యాలన్నీ కళ్ళలో వచ్చి నాట్యమాడేవి. వెంటనే దులపరించుకుని రిక్షా తీసుకుని వెళ్ళిపోయేవాడు.

అనాడు రాఘవులు యింటికి వచ్చేటప్పటికి యింట్లో ఘర్షణపడుతున్నట్లు మాటలు వినిపించినాయి చప్పున వచ్చినవాడు వచ్చినట్లుగానే ఆగిపోయాడు.

'ఏమిటి యీ చాడింపు చీటికిమాటికి మంగి యేమిటేమిటో అంటూనే ఉంటుంది. ప్రతిదానికీ నేను సమాధానం చెపుతూ కూర్చోవాలి అంత యిదా మరి నాలుగు డబ్బులు యెక్కువ తెస్తున్నాడు గద తన మొగుడని యిష్టంవచ్చినట్లు అంటూంటే వూరుకోవడమేనా! పోనీ రాఘవులు యేమన్నా అంటాడేమో అంటే యేమీ మాట్లాడడు రామి కోపాన్నంతా వెళ్ళగక్కుతోంది

'రాఘవులను యేమీ అనక వాడు చాలా మంచివాడు

'అవున్లే నీ తమ్ముడూ మంచివాడే, మీ చెల్లెలు మంచిదే మధ్యన మనిద్దరమే చెడ్డాళ్ళం అంత కూటికిలేక చస్తున్నామా మన యిల్లు మనం చూసుకోలేమా! యెందుకొచ్చిన తంటా అంట యిది ' రామి దీర్ఘంగా సోము కళ్ళల్లోకి చూస్తూ విలబడింది.

సోము యేమీ సమాధానం చెప్పలేకపోయాడు

ఇంతలోనే మంగి తన పని పూర్తిచేసుకుని యింటికి వచ్చేసింది తన భర్త మొహం చూసీచూడటంతోనే మంగి చప్పున ఆగిపోయింది ఏమిటి అట్లా వున్నావని అడిగింది రాఘవులు మారు మాటాడకుండా యింట్లోకి వెళ్లాడు. సోము రిక్షా తీసుకుని బైటకు వెళ్ళిపోయాడు.

ఒకరి మాటలు ఒకరు వినాలనే ఇంత బిగ్గరగా సంభాషణలు రోజు రోజుకు సాగిపోతున్నాయి. నలుగురు పెద్దవాళ్ళు నాలుగు రకాలుగా ఆలోచించుకుంటున్నారు రాఘవులు అన్నను పిలిచి అడుగుదామనుకున్నాడు. సోము తమ్ముణ్ణి పిలిచి అడగనే అడిగాడు మంగి వల్ల తప్పేమీ లేదు మంగి అంటున్న మాటలన్నీ నిజమే! వదినకు నువ్వు సరిగ్గా చెప్పకపోతే మాత్రం చాలా కష్టమని కూడా రాఘవులు హెచ్చరిక చేశాడు సోము కూడా వెంటనే అనేశాడు మంగి వల్లనే యీ భేదాభిప్రాయాలు వచ్చినాయి. ముందర మంగిని సంబాళించుకుంటే అన్నీ సమసిపోతాయని రాఘవులుకు చెర్రున కోపం వచ్చింది సోము బాగా చిరాకుపడ్డాడు ఇద్దరూ ఎన్నడూ అనుకోని మాటలు అనుకున్నారు లోపల మంగి మండిపడిపోతోంది, బావ తన పెళ్లాన్ని వెనకేసుకు వస్తున్నాడని రామి బుస్సుమంటోంది, రాఘవులు తన పెళ్లాన్ని వెనకేసుకు వస్తున్నాడని

ఈ మాటలు, ఘర్షణ రోజురోజుకు తీవ్రరూపం దాలుస్తోంది. చివరకు పంపకాలదాక వచ్చింది. ఇంట్లో చెంబూ, తప్పాలా నుంచి పంచుకోవటం అయిపోయింది. ఇక యిల్లుంది. రిక్షా వుంది. ఇంటి పంపకం ఎంతసేపటికి తెగలేదు. మంగి యేమి నూరిపోసిందో యేమో రాఘవులు గట్టిపట్టే పట్టాడు, ఆ యింట్లో సగంకంటె యెక్కువ భాగం తనకు రావాలని. సోము, రామి యెన్ని చెప్పినా, ఆ మాటకు వప్పుకున్నాడు. హద్దులు గీసుకున్నారు. ఎవరి స్థలంలో వారు తలొక పాక వేసుకున్నారు. ఇక రిక్షా సంగతి వచ్చే టప్పటికి పంపకాలు కుదర్లేదు. ఇద్దరికీ తెలుసు. ఈనాడు రిక్షాను అమ్మితే చెరొక రిక్షా కొనుక్కోలేమని. కిరాయి రిక్షా తీసుకుంటే యెంతో కష్టమని. మునుపటి మాదిరిగానే పగలల్లా ఒకడు, రాత్రిళ్ళు ఒకడు వంతులు చొప్పున రిక్షాను లాగి సంపాదించుకుని తింటున్నారు. ఆ యిద్దరికీ అదివరకు మాదిరిగానే ఆ రిక్షాయే జీవనాధారం.

మంగి వూహించినట్లుగానే రాఘవులు సంపాదనతో తన కొక చీరె అని కొడుక్కి చొక్కా అని భర్తకు ధోవతి అని సంపాదించుకో గలిగింది. విడిగావున్న తర్వాత రాఘవులకు మంగి అన్న మాటలన్నీ ఒక్కొక్కటి అనుభవంలో కనిపిస్తున్నాయి.

కాలచక్రంతోపాటు రిక్షాచక్రం రాలేక యెంతో వెనక్కి పడిపోయింది. ఆ ఊళ్లో సిటీబస్సులు వచ్చేసినాయి. మైలు వెళ్లాలంటే అణా యిస్తే యిట్టే వెళ్ళిపోతారు. పావలా యిచ్చి రిక్షాయెక్కే నాధుడు యెవరూ కనిపించటం లేదు. రిక్షాల గిరాకి చూస్తూ చూస్తుండగానే యిట్టే పడిపోయింది. తాము అదివరకు సంపాదించేదాంట్లో సగంకూడా రావటంలేదు. ఇంత సంపాదించిన వాళ్లం ఓ చిల్లరకొట్టు పెట్టుకున్నా యీపాటికి మన జీవనానికి దిగులులేకుండా పోయేది. అనవసరంగా రిక్షా కొనుక్కొని యెందుకూ కొరగాకుండా పోయామే అని బాధపడుతున్నారు రిక్షా యజమానులు. ఈ వచ్చిన కొత్త మార్పుతో అన్నదమ్ము లిద్దరిమధ్య వైరుధ్యం పెరిగింది. ఎవరికి వారు ఆ రిక్షా తన సొత్తే కావాలని పట్టుదలతో వున్నారు. ఎంతసేపటికి యిద్దరి మధ్య సమన్వయం కుదర్లేదు. వీరిద్దరూ యింట్లో మనస్పర్థలు పెంచుకుంటూనే వున్నారు. ఈ మధ్యలోనే యింకో వుపద్రవం వచ్చిపడింది. మునిసిపాలిటీవారు రిక్షాలను తీసేస్తున్నారనే వదంతి పుట్టింది. రిక్షా యజమానులు, రిక్షా లాగేవాళ్ళు సభలు, సమావేశాలు జరిపి ఏకగ్రీవంగా తీర్మానాలు ఆమోదించారు. రిక్షాలను

వుంచాలంటూ కార్మిక నాయకులు పోయిన పలుకుబడిని వుపయోగించుకోవటానికి యీ అవకాశాన్ని శాయశక్తులా వినియోగించుకుంటున్నారు. ఎంత ఆందోళన జరిపినా ఏమీ ప్రయోజనం లేకపోయింది. మునిసిపాలిటీవారు తమ సమావేశంలో రిక్షాలను తీసెయ్యాలని నిశ్చయించారు. ఈ నిర్ణయం అమలు జరపంగానే నీటినుంచి బైటపడవేసిన కప్పలులాగా రిక్షా యజమానులు, రిక్షా లాగేవాళ్ళు తన్నుకుపోయారు గిలగిల. అదివరకు సంపాదించిన సొమ్ము పెట్టుకుని కొంతమంది యజమానాలు ఇంకోరకం వ్యాపారంలోకి దిగారు. రిక్షా లాగేవాళ్ళు కూలీనాలీ చేసుకుని బ్రతుకుతున్నారు. అతి కష్టంమీద విడివిడి భాగాలు తీసి అమ్మితే రాఘవులుకు, సోముకు తాను అప్పుపెట్టిన సొమ్ములో మూడోవంతు వచ్చింది. రిక్షా అమ్మకంతో ఆ డబ్బును చెరిసగం పంచుకోవడంలోనూ కూడా తగాదాలుపడి చివరకు యెట్లాగొట్లా సర్దుబాటు చేసుకున్నారు. రిక్షా పోవటంతో భుక్తి గడవటం యెంతో కష్టమయిపోయింది. రెక్కలు విడచుకున్నా వగ్గుడు పిల్లల్ని పోషించాలంటే మంగికి, రాఘవులకు పెద్ద సమస్య అయిపోయింది. సోమూ అదే స్థితిలో వున్నాడు. తన కుటుంబాన్ని పోషించే గత్యంతరంలేక రాఘవులు తన స్థలాన్ని, యింటిని అమ్ముకుని యెక్కడో పూరిగుడిసెలో నెలకు మూడు రూపాయల అద్దెలో కాలక్షేపం చేస్తున్నాడు. సోము కూడా తప్పనిసరిగా తన యింటిని కూడా అమ్మెయ్యాల్సి వచ్చింది.

తనకొచ్చిన డబ్బుతో విశ్వప్రయత్నం చేశాడు యింకా డబ్బు సంపాదించాలని. చిన్న దుకాణం పెడితే దాంట్లో నష్టం వచ్చింది. ఏ పని చేస్తే ఆ పని తనకు యెదురయి కూర్చుంది. రాఘవులకు తలకు మించిన పనయిపోయింది. ఎటూ తోచటంలేదు. మంగి రెండు పూట్లా రెండిళ్ళకు వెళ్ళి బండచాకిరీ చేసివస్తుంది. తాను అక్కడా యిక్కడా తిరిగి ఆ పనీ యీ పనీ చేసుకుని యింటికి వస్తాడు రాఘవులు.

ఏ పూట కూలి ఆ పూటకు గడవటానికే సరిపోవటంలేదు. సోముకు యెక్కడలేని ఓపికా వచ్చింది. ఒక్క క్షణం కూర్చోకుండా ఏదో పనిమీద వెళుతూనే వుంటాడు. రామి ప్రొద్దస్తమానం చాకిరీ చేస్తూనే వుంటుంది. అప్పుడప్పుడు వెనకటివన్నీ జ్ఞాపకంవచ్చి ఏడుస్తుంది. సోము, తాను తమ్ముణ్ణి అపార్థం చేసుకున్నానేమో అని బాధపడుతూ వుంటాడు. రాఘవులు చాలా మంచివాడు. మంగి కూడా చాలా మంచిదే. నేను తెలుసుకోలేకపోయాను.

మొట్టమొదట తాను, తన తమ్ముడు ఈ వూళ్లోకి వచ్చినప్పుడు ఎట్లా వున్నారో జ్ఞాపకం తెచ్చుకుంటూ విచారపడతాడు. తన తమ్ముడి జాడ తనకు తెలియదు. ఈ వూళ్లో వున్నాడో లేదో కూడా తెలీదు. రాఘవుల్ని చూసి చాలా రోజు లయింది. సోము దీర్ఘంగా ఆలోచించుకుంటున్నాడు.

రాఘవులు దిగాలుపడి అరుగుమీద కూర్చుని కళ్ళు తుడుచుకుంటున్నాడు. తాను తన అన్నతోపాటు యీ వూరు వచ్చినప్పటి నుంచి జరిగిన మార్పులన్నీ గుర్తుకొస్తున్నాయి ఒక్కొక్క విషయమే తొలిచి తొలిచి రాఘవుల్ని బాధ పెడుతున్నాయి. మంగి చెప్పిన మాటలు విని అనవసరంగా అన్నతో విరోధము తెచ్చుకున్నాను. అన్న చాలా మంచివాడు. వదిన చాలా మంచిది. అన్నను చూసి ఎన్నాళ్ళయిందో సరి! ఎక్కడున్నాడో, ఏం చేస్తున్నాడో! రాఘవులు క్షోభపడిపోతున్నాడు. మంగి లోపలలోపల కుమిలిపోతోంది. సుఖపడదామను కున్న రోజుల్లో మళ్ళీ కష్టాలు మొదలయినాయి. ఏ విధంగా జీవితం మళ్ళీ మారిపోనుందో చూచి బాధపడుతోంది. వెనకటివి తలుచుకుని విచారపడుతోంది. రాఘవులుకు గాని, తనకు గాని వూపిరి సలపనంత పని, అయితే శ్రమకు తగినంత ఫలితం మాత్రం దొరకటంలేదు. తాను క్రుంగిపోతోంది. రాఘవులు చిక్కిపోతున్నాడు ఏమి చెయ్యటానికీ తోచటంలేదు.

ఎవరో బొంబాయి నుంచి పెద్ద వ్యాపారస్థులు వచ్చి యిక్కడకు మూడుమైళ్ళ దూరంలో ఒక పెద్ద ఫ్యాక్టరీ కట్టబోతున్నారని ఆనోటా ఆనోటా వినవచ్చింది. ప్రతి నోటా యీ మాటే వినిపిస్తోంది. రాఘవులు నిశ్చయించు కున్నాడు, ఆ ఫ్యాక్టరీ పూర్తి అయ్యేటంతవరకు అసలు మకాం యెత్తి అక్కడే వుండిపోతే సరిపోతుందని.

తమ పొట్టల్ని చేతపట్టుకుని ఎక్కడెక్కడివాళ్ళు అక్కడకు తయా రయ్యారు. బ్రహ్మాండంగా పనులు సాగిపోతున్నాయి. చుట్టూ రకరకాల యిళ్ళు, ఆ ఫ్యాక్టరీ కట్టడం, చేతి నిండా పని దేనికీ వెతుక్కోనక్కర్లేదు. మంగి తలకు ఓ చుట్టచుట్టి బయలుదేరుతుంది. రాఘవులు పలుగూ పార పట్టుకుని బయలుదేరుతాడు. అణగారిన హృదయాల పునాదులమీద పైకిలేచిన భవనాల మాట గుర్తుకొచ్చి తన గత చరిత్రను, గత ఆలోచనలను స్ఫురణకు తెచ్చుకుంటున్నాడు వెకిలిగా తనలో తాను నవ్వుకుని మనం యీ జన్మలో భాగ్యవంతులం కాలేము. భాగ్యవంతులు యింకా భాగ్యవంతు లవుతారు. బీదవాళ్ళు యింకా బీదవాళ్ళవుతారు. వాళ్ళకు డబ్బుంది. మనకు

రెక్కలున్నాయి. మనం కష్టపడాల్సిన వాళ్ళం. అది తప్పదు, రాఘవులు యేమేమిటో ఆలోచించుకుంటూ పనిచేసుకునిపోతున్నాడు.

ఎండ చుర్రుమంటోంది. సూర్యుడు నడినెత్తిమీదికి వచ్చేశాడు. రాఘవులు స్వేదస్నానం చేస్తున్నాడు. ఎంతో నిబ్బరంగా గుండె బరువుతో పారతో లాగిన మట్టిని తట్టలోకి వేస్తున్నాడు. మంగి ఆయాసపడుతూ అక్కడే చతికిలబడిపోయింది. రొప్పుతోంది. ఒక్కసారి పైకి చూసింది. సూర్య కిరణాలు వాడిగా కళ్ళల్లోకి పొడుచుకుని పోయినాయి. చప్పున కళ్ళు మూసుకుంది. రాఘవులు తట్టనిండా మట్టిని నింపేసి పలుగును గట్టిగా భూమిలోకి దింపేసి దాని ఆసరాతో అట్లాగే నిలబడిపోయాడు రొప్పుతూ. మేస్త్రీ యెక్కడ పసికట్టాడో యేమో చప్పున రాఘవులువైపు గబగబ వస్తున్నాడు. మంగి చప్పున లేచి నిలబడి తట్ట నెత్తిన పెట్టుకుని చకచక నడిచింది. రాఘవులు భూమిలోకి గుచ్చిన పలుగును పైకి లాగాడు రౌద్రంగా. మేస్త్రీ చూచీచూడకుండా యింకోవైపు వెళ్ళిపోయాడు, కూలీలు గుంపులు గుంపులుగా వచ్చేస్తున్నారు. పని చురుకుగా సాగిపోతోంది. మేస్త్రీ పంపించాడు గామాలు ఓ పదిమంది కూలీలు పలుగులు, పారలు పట్టుకుని రాఘవులున్న చోటుకు వచ్చేసి భూమిని త్రవ్వేస్తున్నారు. వంగిన నడుమును ఎత్తలేక అతి కష్టంమీద మట్టితట్ట యింకోడి ఆసరాతో పైకెత్తి తలమీద పెట్టబోయే సరికి "రాఘవులూ ...." అంటూ గట్టిగా కౌగిలించుకున్నాడు సోము. రాఘవులుకు కొద్దిక్షణాలదాకా నోటినుంచి మాట పెగిలిరాలేదు

ఆదుర్దాగా మంగెక్కడ, పిల్లలెక్కడ అంటూ సోము కుశలప్రశ్నలు వేశాడు. రాఘవులు కూడా యెంతో ఆప్యాయంగా క్షేమసమాచారాలు అడిగి అన్నా నేను పెద్ద తప్పు చేశాను అంటూ కంటతడి పెట్టుకున్నాడు

సోము తమ్ముణ్ణి దగ్గరకు తీసుకుంటూ 'రాఘవులూ నువ్విట్లా అనక. నేనూ చేశాను.... డబ్బువున్నప్పుడు ఒకరి సుఖాన్ని చూసి ఒకరి ఓర్వలేకపో యినాము. డబ్బు పోయిన తర్వాత ఒకరి కష్టాన్ని చూసి ఒకరు జాలిపడాల్సి వచ్చింది... మనకు మిగిలింది మన రెక్కలే.... మధ్యలో వచ్చిన డబ్బు కాదు... మనం అన్నీ పంచుకున్నాం. కాని మన ప్రేమల్ని పంచుకోలేకపోయినాము....' ఇద్దరు అన్నదమ్ములు పెనవేసుకుని వెక్కి వెక్కి ఏడ్చారు.

దూరాన్నుంచి చూసిన మంగి పరుగు పరుగున వచ్చి 'బావా అక్కె క్కడ !....' అంటూ బావురుమంది.

——




సంచీ చేత్తో పట్టుకుని తండ్రివెనుక నడుస్తున్నాడు గణపతి. మోకాళ్ళ వరకూ జారిన వదులైన నిక్కరూ; బొత్తాములు లేని చొక్కా; చెరిగిపోయినా ముఖానికందానిచ్చే క్రాఫింగూ, స్ఫుటంగా తేలిన ముక్కూ; పరిశీలనగా తీక్షణంగా చూసే చురుకైన కళ్ళూ.

గణపతి కాళ్ళు నడకదారిమీదే వున్నా ఆలోచనలు మాత్రం ఎక్కడో వున్నాయి. దృష్టి మరెక్కడో పరుగులిడుతూవుంది.

అప్పటికింకా ఎండ ముదర్లేదు. కోనేటిఒడ్డున బిందెల చప్పుళ్ళు; కడియాల గలగలలూ యింకా పల్చబడలేదు.

"ఏవిటి బాబూరావ్. నీ కొడుకుని అప్పుడే పనిలో పెట్టేవేవిటి? తెలివైన వాడే. చదివించలేకపోయావూ,"

పంతులుగారి పలకరింపుకు ఆగి, చేతులు నలుపుకుంటూ తలొంచుకున్నాడు బాబూరావు. తండ్రీవంకా; పంతులుగారి వంకా ఆశగా చూశాడు గణపతి.

"ఏం చదువులు బాబయ్యా. మీకు తెలీందేముందీ మనూరి బళ్ళో వున్నంత వరకూ చదివేడు. అనక చదవాలంటే వూరిడిచి వెళ్ళాల. అయినా యీడు చదివేం జెయ్యాలయ్యా. మున్సబుగారిబ్బాయిని చూస్తున్నాంగా. కాలేజి చదువు

**1981 చక్రపాణి తృతీయ అవార్డు పొందిన కథ**

చదివీ చేతులు ముడుచుకుని యింట కూచున్నాడు. మాకీ వృత్తివిద్య చాలు లేయ్యా"

తండ్రిమాటలకు దిగులుపడి తలొంచుకున్నాడు గణపతి. చదువుకుంటే బాగుండునని వుంది. కానీ తండ్రిమాట కెదురుచెప్పలేడు.

"నువ్వన్నదీ నిజమేనే. వృత్తివిద్య నొదిలి చదువుకున్నా పనులు దొరుకుతాయన్న ఆశలేం కనుచూపు మేరలో లేవు. పోన్లే. రాణించాలంటే ఎందులో రాణించలేడూ" అంటూ వెళ్ళిపోయారు పంతులుగారు.

ఆయన కూడ తండ్రి అభిప్రాయాన్ని సమర్థించడం గణపతికి ఆశ్చర్యమనిపించింది.

గణపతి తండ్రి బాబూరావుకి టింబర్ డిపోలో పని. పెద్దపెద్ద దుంగల్ని కొలతల ప్రకారం కొయ్యడం; పెద్ద కమ్ముల్ని వేరుచేసి, రద్దుముక్కలతో మేజాలూ, బల్లలూ, మంచాలూ మొదలైన వస్తువులు చెయ్యడం. ఈ పనికి అతనికి ముట్టేది నెలకి ఏనూటయాభయ్యే: దానికోసం రోజూ మూడుమైళ్ళ దూరం వచ్చిపోతూంటాడు.

బాబూరావుకి ఆ పని మొదట్లో లాభసాటిగా కన్పించలేదు. అయినా క్రమేణా అలవాటయి అదే బాగుందనుకున్నాడు. రోజూ విడిగా పనిచేస్తే ఏ పదిరూపాయలో దొరక్కపోవు. కానీ రోజూ విధిగా పనిదొరుకుతుందన్న నమ్మకమేమిటి? అంచేత నెలసరి ఆదాయాన్ని విడిచిపెట్టలేక అక్కడే స్థిరపడిపోయ్యాడు. తనలాగే మళ్ళీ తన కొడుకు కాకూడదని బాబూరావు చాలసార్లే అనుకున్నాడు. కానీ లోకం చూసి, బ్రతుకుతెరువు కోసం వృత్తివిద్య తప్పదన్న నిశ్చయానికి రాక తప్పలేదతడు.

తండ్రితోపాటు టింబర్‌డిపో జేరేసరికి ఎండ ముదిరింది. తండ్రి పనిలో నిమగ్నమయ్యాక; అక్కడే ముందు రోజు సగంచెక్కి దాచుకున్న కర్ర బొమ్మను బయటకు తీశాడు గణపతి.

తండ్రివెనుక పనిలోకొచ్చిన కొత్తలో అతనికి తండ్రిచేసేపనిలో నేర్చుకునే దాని కంటే కాయకష్టమే ఎక్కువ కన్పించేది. తండ్రికి పనిముట్లు అందిస్తూ ఏ పనిముట్టు ఎప్పుడు ఎలా ఉపయోగించేదీ క్షుణ్ణంగా తెల్సుకున్నాడు. ఎంత నేర్చుకున్నా రోజుమొత్తంమీద అతని కెంతో సమయం మిగిలేది. ఏంచేయాలీ అని ఆలోచనలో పడ్డసమయంలో అతనికో రోజు డ్రాయింగు మాష్టారు గుర్తొచ్చాడు. తెల్లని గడ్డం, పొడవైన కాళ్ళూ; తెల్లని పంచ, లాల్చీ. బళ్ళో ఆయన చెప్పిన మొదటి బొమ్మ పోస్టు కార్డు. కార్డు ఎలావుంటుంది ఎవరికి వారు యింటిదగ్గరే వేసుకుని రమ్మన్నారు. రెండోది పాలపిట్ట మూడోది ఏనుగు. అలా ఎన్నెన్నో... బొమ్మలు గీయడం

నేర్పించారు మాష్టారు_ మాష్టారికి తనంటే అభిమానం_ తను బొమ్మలు బాగా గీయ గలడు_ అదీ ఆయన అభిమానానికి కారణం

—ఆ ఆలోచనరాగానే ఓ మెరుపు మెరిసింది ... అంతే! వెంటనే అది కార్యరూపంలో పెట్టాలనుకున్నాడు గణపతి.

పనికిరాని చిన్న చిన్న కర్రదిమ్మల్ని ఒకచోట చేరవేశాడు_ ఆ తర్వాత తీరిక సమయంలో వాటిమీద తన దగ్గరున్న పనిముట్లతో బొమ్మలు చెక్కడం మొదలు పెట్టాడు_ మొదట్లో చెక్కిన బొమ్మలు బాగా రాక సంతృప్తి నివ్వలేదు. అయినా గణపతి అందుకు నిరుత్సాహ పడలేదు. ఏమైనా సరే తని విద్యలో ప్రావీణ్యత సంపాదించాలనుకున్నాడు.

తను చేపట్టిన ఏనుగుబొమ్మ యీ రోజుతో పూర్తవుతుంది_ బలమైన నాలుగు కాళ్ళు; చేటల్లాంటి చెవులూ, తొండమూ, దంతాలూ, తోక.. బొందిగ్గా ఒక మాదిరిగా బాగానే వచ్చింది. ఫర్వాలేదు_ యింకా శ్రమపడితే అంత కంటె మంచి ఫలితమే రావొచ్చు అన్పిం చింది. ఎలాగైనా దాన్ని పూర్తిచేసి మాష్టారికి చూపించాలి. ఆ నిశ్చయం తోనే సాయంకాలానికి ఆ బొమ్మ పూర్తి చేసి సంచిలో వేసుకున్నాడు_ ఆ సాయం త్రమే మాష్టారింటికి పరుగెత్తుకెళ్ళి చూపించాడు_ ఆయన బొమ్మను అటు ఇటు తిప్పి, ఓ చిర్నవ్వు నవ్వి: 'బావుంది కానీ యింకాస్త శ్రద్ధ, పరిశీలనాదృష్టి అవసరం' అంటూ ఏవేవో సూచనలిచ్చా రు. వాటిని శిరసావహించేడు గణపతి.

"ఫర్వాలేదోయ్ బాబూరావ్. మీ వాడు గొప్ప శిల్పి అవుతాడు" అన్నాడు వెంకట రత్నం. అతని మాటలకు సిగ్గుపడి పోయి చెక్కుతున్న బొమ్మను అక్కడే వదిలేసి లేచి నిల్చున్నాడు గణపతి. వెంకటరత్నం ఆ టింబర్‌డిపో యజ మాని_ అతనికి డిపో కాక; పక్కనున్న పట్నంలో ఓ చిన్న యిల్లు, ఫర్నిచర్ షాపు వున్నాయి. కొత్తగా కట్టే ఇళ్ళకు కావల్సిన దూలాలూ, తలుపులూ వగైరా కలప దగ్గర్నించి, యింటికి కావల్సిన ఫర్నిచర్ వరకూ అన్నీ అతను సప్లయి చేయగలడు_ అతని కింద నలు గురు పనితెలిసిన వడ్రంగులూ, ఆరు గురు కూలీలూ జీతాలకి వున్నారు.

చేస్తున్న పని ఒక్క క్షణం ఆపి; 'ఏదో కుర్రసన్నాసి బాబూ. తమ మాట చలవ వల్ల గొప్పోడైతే అంతే 'చాలు' 'అని మళ్ళీ పనిలా మునిగిపోయాడు బాబూరావు.

"ఏదీ చూపించా బొమ్మని" అంటూ గణపతి చెక్కుతున్న ఆ బొమ్మని చేతిలోకి తీసుకుని తేరిపార చూసి, "బాగానే వుందే" అన్నాడు వెంకటరత్నం

రెండు కొంగలు.... పెద్ద కొంగ చిన్నకొంగ నోటికి చేప నందిస్తోంది—

"ఊహ బాగుంది-పనితనమూ ఫర్వా లేదు-" అన్నాడు. ఆ మెప్పు గణపతికేం ఆనందాన్ని కలిగించలేదు - మాష్టారు బాగుందనాలి. అప్పుడే తనకి ఆనందం; సంతృప్తి!

ఆరోజే వెంకటరత్నం మెదడులో ఓ మెరుపులాంటి ఆలోచ నొచ్చింది- ఆ విషయమై ఒక నిర్ణయానికొచ్చిఆ సాయం కాలమే బాబూరావుని పిల్చి తన అభి ప్రాయం చెప్పేడు. మొదట బాబూరావు నమ్మలేకపోయాడు. తర్వాత ఆనందంతో ఉక్కిరిబిక్కిరయ్యేడు- తన కొడుకు ప్రయోజకుడయ్యాడని అచ్చెరపడ్డాడు-

ఆ మర్నాట్నించే గణపతి తన ప్రయోజకత్వానికి ఫలితం పొంద సాగేడు- దుంగలు కోయగా వచ్చే పెద్ద పెద్ద రద్దుముక్కలు మునుపటిలా పొయ్యిలకు వెళ్ళక గణపతి దగ్గర పోగౌతున్నాయి- వాటిని మలిచి గణపతి బొమ్మలు చేయాలి. దానికిగాను రోజు కూలి ఒప్పందం.

మొదట గణపతికి ఆనంద మనిపిం చింది- తనకీ సంపాదన ఉంది- ఇక తమ కుటుంబమెప్పుడూ పస్తులుండాల్సిన అవసరం లేదు అనుకున్నాడు-ఒప్పందం కుదిరాక తను చేసిన మొదటి బొమ్మ.... అడుగెత్తు ఏనుగు ... తొండమెత్తి ఘీంకరిస్తూ తన చేతులమీదుగా ప్రా ణాల్ని పోసుకున్నప్పుడు తన శక్తేమిటో తనకు తెలిసొచ్చింది గణపతికి- కానీ- అప్పుడే తను చేసిన వస్తువు మీద 'నాది, అనే మమకారం ఏర్పడింది- దాన్ని యజమాని పరంచేసి, కూలీగా వచ్చే మూడో నాలుగో రూపాయలు పట్టుకెళ్ళా లనిపించలేదు. ఏమైనా సరే అది తన సృష్టి! దాన్ని తనే వుంచేసుకోవాలి. మాష్టారికి చూపి; బాగుందంటే అది ఆయనకే బహుమతిగా యివ్వాలి అను కున్నాడు.

కానీ ఆ విషయంలో అతనోడి పోయాడు- ఒప్పందం ప్రకారం కూలే కిట్టింది- అంతే!

తను పడ్డ శ్రమకది తగిన పరిహారం కాదేమో నవిపించింది గణపతికి. ఆ విషయమే నీళ్ళునిండిన కళ్ళతో తండ్రితో అంటే- 'ఓరి పిచ్చినాయనా. ఆ కర్ర యజమానిది- అది మామూలు కర్ర కాదు రోజ్ ఉడ్ అంటారు దాన్ని. చాలా ఖరీదైంది- ఇక నీ కష్టమంటావా ? దానికి కూలి కిట్టనే కిట్టింది- పోతే- నీ చేతిలో పనితనం ఉందికాబట్టి అంతకంటే మంచివి ఎన్నో నువ్వు చేసుకోగలవు !' అని నచ్చిచెప్పేడు-

గణపతి కళ్ళలో నిలిచిన నీటి బింద వులు నేలమీద పడి యింకిపోయాయి.

* * *

ఉన్నట్టుండి ఓ రోజు వెంకటరత్నం గణపతిని నెలవారీ పద్ధతిలో పనిలో పెట్టుకుంటున్నట్లు ప్రకటించాడు.






బాబూరావుకి ఆనందం పట్టనలవి కాలేదు.

గణపతి ముఖంలో మాత్రం ఏ భావమూ కన్పించకపోయేసరికి వెంకటరత్నం ఆశ్చర్యపడి "ఏం నీకిష్టమేనా" అనడిగాడు.

తండ్రి ముఖంవంక చూసి 'ఇష్టమే' అన్నట్లు తలూపాడు గణపతి—

తల తాటించి, గణపతి భుజం తట్టి; "నాకు నువ్వంటే ఎంతో యిష్టం— అందుకే అలా చేశాను" అంటూ వెళ్ళిపోయాడు వెంకటరత్నం—

అతని మాటల్లో అబద్ధం, అతని చేతల వెనుక స్వార్థం వున్నాయని గణపతికీ బాబూరావుకీ తెలియకపోయినా, వెంకటరత్నానికి మాత్రం బాగా తెలుసు- ఎందుకూ పనికిరాదనుకుని వంటచెరకుగా హోటళ్ళకు పంపే రద్దు కలపలోంచి కూడా తను వందల లాభాన్ని ఆర్జిస్తున్నాడంటే — ఆ కొయ్యబొమ్మలకి పట్నంలో అంత గిరాకీ వుంటుందని అతనూహించలేదు-. ఏదో ... అన్నిటితోపాటు యివీ చెల్లకపోతాయా అనుకున్నాడు— కానీ వాటికోసం కారుల్లోంచి బిలాబిలా సాగిలొస్తారనీ; షిప్పుల్లోంచి దిగిన విదేశీయులు విపరీతమైన మోజు చూపిస్తారనీ అతడు వూహించలేదు. ఐదారు రూపాయలకు తయారైన బొమ్మ పాతిక వరకూ పలుకుతుందని తెల్సుకుని ఆశ్చర్యపోయాడు. అందుకే మట్టిలోంచి మాణిక్యాలను తీయగల గణపతిని స్థిరంగా తనవద్దే వుంచేసుకోవాలనుకున్నాడు.

• • •

ఏళ్ళు గడుస్తున్నాయి.

గణపతి యిపుడు పనిలో ఉత్సాహంగానే వున్నాడు. తండ్రి సంపాదనకు తన సంపాదన తోడవటంవల్ల యింట్లో అందరూ ఆనందంగా వుంటున్నారు— అదే అతనికి సంతోషమనిపించిన విషయం.

రానురాను అతడికి తను చేసే పనిలో దీక్ష ఎక్కువయింది. చేతిలోని కళ కూడా పరిపక్వత చెందింది. అతనిప్పుడు యే కర్రముక్కను పట్టుకున్నా సజీవ శిల్పమౌతోంది. ఆ శిల్పంతో గణపతి కున్న బంధమంతా తండ్రీకూతుళ్ళ మధ్యనున్న బంధమే.

'అల్లారుముద్దుగా పెంచి, మాటలు నేర్పించి, నడవడికను చక్కదిద్ది, సంస్కారముగా చేసి; ఓ వ్యక్తి చేతిలో పెట్టడం— అంతే! ఆ అనుబంధమే తనకు మిగిలేది.' అనుకునేవాడు గణపతి తను చేసిన బొమ్మలు గుర్తొచ్చినప్పుడల్లా—

ఎగిరే పక్షులూ, చెంగున దూకే జింకలూ గుండ్రని గోళంమీద నాలుగు కాళ్ళూ పెట్టి సర్కస్ చేసే ఏనుగూ; కడవ నెత్తినెట్టుకుంటూ జారిన పైటను సవరించుకునే సుందరీ; కారుణ్యమూ సౌందర్యమూ కలగలిపి మూర్తీభవించిన బుద్ధభగవానుడూ; ప్రళయకాలంలో నర్తించే పరమశివుడూ: ... ఎన్నో .... ఎన్నెన్నో బొమ్మలు గణపతి చేతుల్లో రూపులు దిద్దుకుని ప్రాణాలు పోసుకున్నాయి.

ఆ రోజు........

వెన్నెల రాత్రి.... ఆరుబయట పడుకుని చంద్రుడిని చూస్తున్న గణపతికి పాకలో వర్షించి తల్లిమాటలు వింతగా వినిపించాయి — పున్నాగచెట్టుమీంచి వీచిన గాలి ఎందుకో కొత్తగా గిలిగింతలు పెట్టింది.

పెళ్ళి!

తనకు పెళ్ళా?

అతని వూహలు దృశ్యాలై శిల్పాలై. ఆకాశం మీద రూపులు దిద్దుకుంటూ అతన్ని ఆనందడోలిక లూగించాయి— ఆ రాత్రి మెదిలిన భావన .. ఆ కళాత్మక హృదయం మీద విర్చిన ముద్ర.... ఆ మర్నాడే అతని చేతిలో రూపులు దిద్దుకోనారంభించింది.

ఓ అందాల పల్లకిలో.... అపురూప లావణ్యవతి! సిగ్గు తెరలలో ముఖము దించుకుని .. ఓరకంట చూస్తూ — పల్లకి మోసే బోయీలలో కూడా ఉత్సాహం! ముందు సన్నాయి మేళం.... వెనుక బంధుజనం .. వింతవింత దుస్తుల్లో.... ఆకాశంలో దూరంగా ఎగిరే పక్షుల జంట—

ఈ చిత్రాన్ని వెడల్పయిన దళసరి రోజ్‌వుడ్ పలకలో అందంగా మలిచాడు. చుట్టూ ఫ్రేంలా అందమైన డిజైను—

ఆ పెళ్ళి పల్లకి గణపతిలో ఓ అపు



రూపమైన ఆపేక్షని తెచ్చిపెట్టింది- 'ఆ పెళ్ళి తనదేనా? ఆ పల్లకి తన కోసమేనా' అనిపించింది- "ఉహూ తగిన రూపాన్నివ్వగల తనలోని శక్తికి అబ్బుర పడ్డాడు.

తీరా అన్ని అలంకరణాలు పూర్తి చేసుకుని పల్లకి వీధిలోకి నడిచే వేళకు గణపతి కళ్ళలో నీళ్ళు తిరిగాయి— తను అమ్ముడుపోయిన శిల్పి అన్న మాటలు గుర్తొచ్చి బాధగా కళ్ళు తుడుచుకున్నాడు- 'సాటి మనిషి మీద చూపాల్సిన మమకారం ఒక ప్రాణం లేని చెక్క బొమ్మ మీద చూపడమేమిటి?

చేతిలో ఎంత నేర్పున్నా ఒకరికి తలొగ్గిన తనకు యిష్టాయిష్టాలేమిటి? అని సమాధాన పడ్డాడు.

వెంకటరత్నం ఒకమారు కేన్ ఛెయిర్లోంచి ముందుకు వంగేడు. తన పేర్న వచ్చిన ఉత్తరంలోని సంగతి తెల్సుకుని అతని గుండె ఆగినంత పనయ్యింది.

యేనాడో క్రితం తను ఒక విదేశీయునికి రెట్టింపు ధరకమ్మిన పల్లకి చిత్రానికి బహుమతా? ఆశ్చర్యపోయాడు.

భారతీయ సాంప్రదాయం తొణికిసలాడే ఆ పల్లకీ చిత్రం విదేశీ శిల్ప చిత్రాలతో పోటీపడి గెలిచి ప్రథమ స్థానాన్నలంకరించిందనీ. దాన్ని మలచిన భారతీయ శిల్పి శ్రీ వెంకటరత్నానికి నగదు బహుమతి భారత ప్రభుత్వం అందజేస్తుందనీ .. వార్తను మోసుకొచ్చిన కాగితం అతని చేతిలో రెపరెపలాడి గింజుకుంది—

సరిగ్గా నెల్లాళ్ళ తరువాత-

ఇందు సభలో వేదిక మీద పెద్దల మధ్య కూర్చుని ఆనందంతో పరవశిస్తున్న వెంకటరత్నం మనసూ ఒక్కమారు గిజగిజలాడింది-



ఆ వెంటనే అతనిలోని ఆనందమంతా ఒక్క దెబ్బతో ఎగిరిపోయింది– పెదలోని పూదండ చవట్లతో తడిసిపోయింది–

హత్యానేరంలో పట్టుబడ్డ జైలునించి తప్పించుకుని పారిపోతున్న నేరస్తుడిలా ఉన్నాడాయన,

దూరంగా ద్వారం దగ్గర గోడనానుకుని నిల్చున్న గణపతివైపు దొంగలా చూశాను.

ఈర్ష్యా ద్వేషాల కతీతమైన మానవత్వం మూర్తీభవించిన శిల్పంగా కనిపించాడు.

సృష్టికి ప్రతిసృష్టి చేసే బ్రహ్మ తేజస్సు అతని కళ్ళలో కనిపించింది–

వెంకటరత్నం కళ్ళలో నీళ్ళు నిండాయి–

కసాయి గుండెలో కరుణ.

లేచి, వేదిక దిగి గణపతి వంక నడిచాడు.

గణపతి చూపులో అమాయకత్వం.

సభలో ఆశ్చర్యం.

సీరియల్

# సౌందర్యదీపం

ఆర్. సంధ్యాదేవి

(గత సంచిక తరువాయి)

## 5

ఆ రోజు ఉదయం లేస్తూనే అంబిక గుండెలు దడదడలాడాయి.

ఈ రోజు ఉదయం పదిగంటలకే ఇంటర్‌వ్యూ. వెళ్ళిరావడ, ఒక పెద్ద గండంలా అనిపించసాగింది. అయినా వెళ్ళక తప్పదు.

అంబిక ఇంటర్‌వ్యూకి వెళ్ళడానికి తయారవసాగింది. ఈ విషయం యింట్లో ఎవ్వరికీ తెలియనివ్వలేదు తెలిస్తే రకరకాలుగా అని మనసు బాధపెడ్తారు అందుకే ఉద్యోగం వచ్చిందాకా చెప్ప డానికి ఇష్టపడలేదు.

అంబిక మనసు రకరకాలుగా ఆలోచిస్తోంది.

ఉద్యోగం కోసం వెళ్తే అక్కడ వాళ్ళు ఏమంటారో? నీ ఈ చదువుకి సెక్రటరీ ఉద్యోగం ఇచ్చేస్తామనే అనుకుని అప్లయ్ చేశావా? అని నవ్వుతారేమో! సెక్రటరీ ఉద్యోగం అంటే ఏమిటి అనుకున్నావు! అప్లికేషన్‌తో పాటు నీ పరిస్థితి అంతా ఉత్తరం ద్వారా తెలియజేస్తే మాకు జాలేసి ఉద్యోగం ఇచ్చేమనే వచ్చావా! అని అనుగుతారేమో అని ఒక వైపు భయం మనసుని పీకేస్తుంది.

"నీ ఉత్తరం చదివాను. నీ పరిస్థితులు అర్థంచేసుకున్నాను."

అందుకే నువ్వు గ్రాడ్యుయేట్ వి కాకపోయినా నీకు ఈ ఉద్యోగం ఇస్తున్నాను. రేపే వచ్చి జాయిన్ అవు" అని అంటే!

అంబిక మనసు ఊహ మాత్రానికే పొంగిపోయింది నిజంగా తనకి ఆ ఉద్యోగం కనుక వస్తే ఎంత అదృష్టవంతురాలు!

ఇక తనకి ఎలాటి బెంగా ఉండదు.

తనదారి తాను చూసుకోవచ్చు.

ఈ విదిలింపులు, ఈ దెప్పుళ్ళు తనకి ఉండవు. హాయిగా ఆనందంగా రోజులు వెళ్ళదీయవచ్చు.

తనకి నచ్చిన విధంగా నచ్చినరీతిలో తన జీవితాన్ని తీర్చిదిద్దుకోవచ్చు.

తనకి ఇప్పుడు సుఖం లేదు, సంతోషం, స్వేచ్ఛ లేదు.

తనకి ఉద్యోగం వస్తే కడుపునిండా తిని కంటూరా నిద్రపోవచ్చు.

ఇక తనని ఎవ్వరూ ఏం అనలేరు.

అంబిక సంతోషంతో తేలిగ్గా ఊపిరి పీల్చుకుంది. ఆ ఉద్యోగం తనదే అన్న నమ్మకం ఆమె మనసుకి గట్టిగా అనిపించటంతో భయంపోయి ఆ స్థానంలో సంతోష చేర్చుకుంది.

అంబిక ముస్తాబు ముగించి త్వర త్వరగా బయలుదేరి వెళ్ళింది.

* * *

వాళ్ళు తెలియచేసిన అడ్రసుకి వెళ్ళింది.

పెద్ద బంగళా.

ఆ బంగళా చూస్తూనే ఆమెకు మూర్ఛవచ్చినంత పని అయింది.

సినిమాల్లో జమిందార్ల భవంతిలా అందంగా, అద్భుతంగా ఉంది.

తనకి ఒంటిమీద తెలివి ఉండే వచ్చిందా ఇక్కడికి! లోపల అడుగు పెట్టగలదా!

ఈ బంగళాయే ఇంత గొప్పగా ఉంటే, ఈ బంగళాలో నివసించే వ్యక్తి ఇంకెంత గొప్పవాడో! లోపలకు వెళ్ళి అతనితో మాట్లాడటం ఎలాగ! అంబిక గుండెల్లో దడలాంటిది మొదలు అయి శరీరం అంతా నిస్సత్తువతో ముంచెయ్య నారంభించింది.

తన తెలివితక్కువతనాన్ని, తన పేదరికాన్ని మనసులోనే నిందించు కుంది.

వెనక్కితిరిగి వెళ్ళిపోదామా అని క్షణం సేపు తటపటాయించింది

అంతలోనే ఏదో ఆశ.

వెనుతిరిగి వెళ్ళిపోతే ఏముంది? తన జీవితం మళ్ళీ మొదటికి వస్తుంది

పెనుచీకటిలో చిరుదీపంలా ఆ ఆశ మినుకుమినుకు మంటోంది.

మదిలో తలఎత్తే అభిమానాన్ని, సంకోచాన్ని, సందేహాన్ని, బిడియాన్ని అన్నీ మనసులోనే మింగుకుని పైకి బింకంగా అటూఇటూ చూసింది. గేటు వద్ద గూర్ఖా ఎవరు కావాలి అంటూ అడిగాడు తన భాషలో.

ఆమె ఆ భాషను వెంటనే అర్థం చేసుకుని తెలుగులో కృష్ణమోహన్‌గారితో మాట్లాడాలని వచ్చాను అని చెప్పింది.

ఆమె భాష గూర్ఖాకి అర్థంకాక పోయినా కృష్ణమోహన్ పేరు వినటంతోనే ఆమె ఎవరికోసం వచ్చిందో అర్థం అయిపోయింది.

ఎవరో కాలేజి అమ్మాయిలా ఉంది. ఏదో పనిఉండి వచ్చివుంటుంది అని గ్రహించుకుని గేటులోపలకి వెళ్ళడా నికి దారి ఇచ్చాడు.

ఒక గంట గడిచింది బ్రతుకు

జీవుడా అనుకుంటూ లోపలకు వెళ్ళింది.

లోపల అవరణంలో అడుగు పెట్టి ఇటూ అటూ చూస్తూ మెల్లగా నడిచి పోర్టికోవైపు వెళ్ళింది.

అక్కడ కారు ఆగిఉంది.

నౌకరు వచ్చి ఆమెను ప్రశ్నించాడు ఎవరు కావాలి అంటూ.

ఆమె హ్యాండ్ బ్యాగ్ లో నుండి ఉత్తరం తీసి కృష్ణమౌళిగార్కి ఇది చూపించి అంబికారాణి వచ్చింది అని తెలియచెయ్యమని చెప్పింది.

ఆ నౌకరు తల ఊపి ఆమె ఇచ్చిన ఉత్తరం పట్టుకుని లోపలకు వెళ్ళాడు.

అతడు తిరిగి పదినిముషాల్లో వచ్చి ఆమెను లోపలకు రమ్మనిచెప్పి ఒక గదిలోకి తీసుకెళ్ళి అక్కడ సోఫాలో కూర్చోమని చెప్పి వెళ్ళిపోయాడు.

అంబిక జింకపిల్ల అడివిలో నుండి ఊళ్ళోకి వచ్చిపడితే ఎలా భయంతో బిగుసుకుపోతుందో అలా బిగుసుకు పోయి సోఫాకి అంటుకుని అలా కూర్చుంది.

ఒక పావుగంట తరువాత ఒక యువకుడు ఆ గదిలోకి వచ్చాడు.

సన్నగా పొడవుగా చురుగ్గా మనిషి ఆకర్షణీయంగా ఉన్నాడు.

అతను పెద్ద అందంగా లేకపోయినా మనిషిలో చురుకుదనం అందర్నీ ఆకట్టు కుంటుంది

అతన్ని చూస్తూనే అంబిక చటు క్కున లేచి నిలబడిపోయింది.

ఇతనా కృష్ణమౌళి!

ఇంత అందమైన పెద్ద బంగళాలో ఇతనా నివసించేది

కృష్ణమౌళి అంటే తన ఊహ ఏభై సంవత్సరాలు దగ్గర ఉండి, మనిషి చాలా హుందాగా ఉంటారని తలంచింది

అలా తలచిన మనసు కాస్తా నిరు త్సాహ పడిపోయింది అతని వైపు ప్రశ్నార్థకంగా చూడసాగింది ఎవరు.

అన్నట్టు.

ఆ యువకుడు నవ్వుతూ చెప్పాడు. ఆమె మనసులో సందేహాన్ని తను ముందుగానే గుర్తించినట్టు "నాపేరు రఘునాథ్. కృష్ణమౌళిగారి పర్సనల్ సెక్రటరీని. వారికి మీరు వచ్చినట్టు చెప్పాను. వారు ఎవరితోనో మాట్లాడు తున్నారు. కూర్చోమని చెప్పమన్నారు వాళ్ళు వెళ్ళిపోగానే మిమ్మల్ని పిలుస్తాను కూర్చోండి" అంటూ అతను ఎంతో మర్యాదగా చెప్పాడు

ఆయన సెక్రటరీ అన్నమాట ఇతన్ని చూసి కృష్ణమౌళిగారు అనుకుంది

ఆమెకు నవ్వు వచ్చింది తన పొర పాటుకి.

అతను అలా చెప్పటంతో అలాగే అన్నట్టు తల ఊపింది.

అతను వెళ్ళిపోయాడు

అంబిక మళ్ళీ కూర్చుంది

కృష్ణమూర్తిగారితో మాట్లాడాలి అని మరో ఇద్దరు అమ్మాయిలు వచ్చి ఆ గదిలో కూర్చున్నారు.

సెక్రటరీ వచ్చి వాళ్ళని రేపు సాయంత్రం అయిదుగంటల తరువాత రమ్మని చెప్పి పంపేశాడు.

అంబిక అతను పిలిచేవరకూ అలా కూర్చుంది.

## 6

అంబికను పిలవగానే లేచి వెళ్ళింది.

అది పెద్ద హాలు. హాలులో పెద్ద పెద్ద ఖరీదయిన సోఫాలు వేసిఉన్నాయి. ఒక సోఫాలో కృష్ణమూర్తి కూర్చుని ఉన్నాడు.

సెక్రటరీ రఘునాధ్ సోఫా పక్కని వినయంగా నిలబడి ఉన్నాడు.

అంబికను అతనికి పరిచయం చేశాడు.

కృష్ణమూర్తి తల ఎత్తి ఆమెవైపు చూశాడు.

ఆమె చేతులు జోడించి వినయంగా నమస్కరించింది.

అతను చిరునవ్వు నవ్వి తల ఊపి ఎడంచెయ్యి కొద్దిగా ముందు కుచాపి హుందాగా సైగచేసి ఆమెను ఎదురుగా సోఫాలో కూర్చోమన్నట్టు చెప్పాడు.

మనసులో బెరుగ్గా ఉన్నా పైకి అలాగే అన్నట్టు తలఊపి ఎదురుగా ఉన్న సోఫాలో భయంగా, బెరుగ్గా అనీ అన్నట్టుగా కూర్చుంది.

కృష్ణమూర్తి ఆమెను ప్రశ్నించాడు ఏ కాలేజీలో చదువుకున్నది, తల్లి దండ్రుల పేర్లు, ఇప్పుడు ఆమె ఎవ రింట్లో ఉంటున్నదీ అన్నీ అడిగి తెలుసు కున్నాడు. అంబిక అన్ని ప్రశ్నలకు మెల్లగా, వినయంగా జవాబు ఇచ్చింది.

అతను ఆమెవైపు పరీక్షగా చూశాడు.

పదిహేడు, పద్దెమినిదికంటే వయసు పెద్దది ఉండదు.

తెల్లగా అందంగా ఉంది

చక్కని కళ్ళు, అందమైన చిన్న నోరు, ముఖం కొద్దిగా గుండ్రంగా ఉంది.

పెద్ద జడ బాగా ఒళ్ళుగా లేక పోయినా కొంచెం బొద్దుగా ఉంది. ఆమె పొడవు అనే చెప్పొచ్చు.

ఆమెను చూడగానే ఎవరైనా పరే అమ్మాయి చక్కగా బొమ్మలా ఉంది అని అనుకోకుండా ఉండరు.

అతను మనసులో అనుకున్నాడు.

ఇంత చక్కని అమ్మాయికి భగ వంతుడు ఇన్ని బాధలు ఎందుకు పెట్టాడో

భగవంతుడు కొందర్ని పుట్టిస్తాడు కాని వాళ్ళకి సుఖశాంతుల్ని కరువు చేస్తాడు.

తనకి అష్టయిశ్వర్యాలు ఇచ్చాడు అయితే నా అన్నవాళ్ళులేక, పిలిస్తే పలికేవాళ్ళు లేక తన జీవితం క్రుంగి పోతుంది.

తల్లికి ఇచ్చిన మాట అనుక్షణం గుండెల్లో కరకరలాడిపోతుంది.

తన తల్లే కనుక బ్రతికే ఉంటే?

తమని ఒకానొకప్పుడు నీచంగా చూసి బాధపెట్టినవాళ్ళని జుట్టు పట్టి ఈడ్చుకు వచ్చి తన తల్లి పాదాలవద్దపడేసి రక్తం కక్కుకు నేవరకు తన్నిఉండేవాడు.

'ప్చ్' తనకి ఆ అవకాశం భగవంతుడు ఇవ్వలేదు. తనే వాళ్ళని కసిదీరా ఎడాపెడా వాయించేసి చావుదెబ్బలు కొట్టి తల్లికి ఇచ్చినమాట ప్రకారం వాళ్ళని కాలిక్రింద వేసి తొక్కిపట్టి ఉంచాలి. ముందు తల్లిమాట నిలబెట్టాలని కదా తను ఇలా ఒంటరిగా ఉండిపోయాడు.

ఒంటరి జీవితం ఎంత నరకం.

ఇంద్రసేన గుర్తుకు వచ్చింది.

ఇంద్రసేన ఎలా ఉంటుంది?

ఈమెలా అందంగా ఉంటుందా?

గాఢంగా నిట్టూర్చాడు.

గతం గుర్తుతెచ్చుకుంటుంటే బాధే మిగులుతుంది. అందుకే జరిగిన విషయాలు గుర్తుతెచ్చుకొనడానికి ఇష్టపడడు.

ఈ అంబికారాణి చాలా అందంగా ఉంది.

ఈమే కనుక పెద్ద చదువులు చదివి పెద్ద హోదాలో ఉంటే!

అందరిలో పేరు తెచ్చుకుని చక్కగా రాణిస్తుంది. ఈమెకు తను సాయంచేస్తే?

మనసులో ఒక నిశ్చయానికి వచ్చాడు.

"నేను పేపర్లో ఇచ్చిన ప్రకటన చూసి నీవు పెట్టిన అప్లికేషన్, వ్రాసిన ఉత్తరం చూశాను" అతని కంఠస్వరం కొంత గంభీరంగా ఉంది

అతను అలా అనగానే ఆమె తల సిగ్గుతో, అభిమానంతో భూమిలోకి కృంగిపోయింది.

తన పరిస్థితులు అన్నీ వివరంగా వ్రాసి అనయుడు దయచూపించమని ప్రాధేయపడుతూ వ్రాలింది.

"నీ మనసులో బాధ, నీ పరిస్థితులు నాకు అర్థం అయ్యాయి. అయితే ఈ ఉద్యోగానికి తప్పనిసరిగా రఘునాథ్‌ని వేసుకున్నాను నీకు ఇక ఆ ఉద్యోగం వచ్చే అవకాశం లేదు" అంటూ ఆగాడు.

ఆ మాటలకి చివ్వున తల ఎత్తి చూసింది.

గుండెల్లో ఆశ అదృష్ట జ్యోతుల్ని వెలిగించడానికి ప్రయత్నిస్తుంటే....

దురదృష్టం ఆశాజ్యోతుల్ని ఆర్పేయడానికి కంకణం కట్టుకున్నదానిలా వికటాట్టహాసం చేస్తుంది.

భగవంతుడా ఈ మాట వినడానికా ఇంతదూరం ఇంత కష్టపడి ఇంత పొంగిపోతూ వచ్చింది.

కళ్ళల్లో నీటిపొర కమ్మేసింది.

ఆమె ముఖంలోకి పరీక్షగా చూసి వెంటనే గ్రహించేసుకుని చిన్నగా నవ్వాడు.

"ఉద్యోగ విషయంలో నిన్ను బాధ పెట్టానా?" మృదువుగా అడిగాడు.

ఆమె మాట్లాడలేదు. తల వంచు

కునే ఉంది. చూపులు నేలకు అతుక్కు పోయాయి.

చివ్వున లేచి, గిర్రున తిరిగి, పరుగున ఆక్కడి నుంచి పారిపోవాలని పిస్తుంది.

అది మర్యాద కాదని మనసు నచ్చ చెప్పటంతో ముళ్ళమీద కూర్చున్నట్టు కూర్చుంది.

"ఈ వయసులో చదువుకోవలసిన నువ్వు ఉద్యోగం చేయడం ఏమిటి? నువ్వు చదువు ఆపేయకూడదు. అలా చదివి మంచి పేరు తెచ్చుకోవాలి నువ్వు మంచి హోదాలో' ఉండాలి" అన్నాడు.

'మంచి హోదా మనసులో నవ్వుకుంది.

తన బ్రతుకే బాగుంటే ఈయన సహాయం ఎందుకు కోరుకుంటుంది? ఈయన్ని ఎందుకు ప్రాధేయపడుతుంది?

"నీకు డాక్టర్‌వు అవ్వాలని ఉందా?"

ఎందుకు ఈ అసందర్భ ప్రశ్నలు వేసి తన మనసు నొప్పిస్తున్నాడు?

తనకి మెడిసిన్ చదివే అవకాశం వస్తుందా! మనసులో విరక్తిగా అనుకుంది.

"నిన్ను నేను చదివిస్తే చదువుకుంటావా" అంటూ మెల్లగా ప్రశ్నించాడు.

అతను ఏమంటున్నాడో అర్థం కానట్టు అయోమయంగా చూసింది.

"ఏం చదువుకుంటావా?" మళ్ళీ అడిగాడు.

"మీరు.... మీరు... ఏమిటి అంటున్నారు?" తడబాటుగా అడిగింది.

అతను నవ్వుతూ మళ్ళీ వివరంగా చెప్పాడు.

"నిజంగానే అంటున్నారా?" నమ్మలేనట్టుగా అడిగింది

"నిజంగానే. నువ్వు మెడిసిన్ చదువు. నేను చదివిస్తాను."

"మరి .." అంది సందేహంగా, భయంగా

"ఏమిటి?" అడిగాడు. కనుబొమ్మలు ముడిపడ్డాయి, ఆమె అంటున్నదేమిటో అర్థంకానట్టు.

"మా మామయ్య, అత్తయ్య...." అంది భయంగా. వాళ్ళకి తెలిస్తే ఏమంటారో అందుకు ఒప్పుకుంటారో లేదో అన్నట్టు.

అతను నవ్వి అన్నాడు.

"నీకు అలాంటి భయాలూ, సందేహాలూ ఏం వద్దు. రేపు సాయంత్రం అయిదు గంటల తరువాత ఒకసారి కనిపించు. మిగతా విషయాలు అన్నీ నేను చూసుకుంటాను" సరేనా అన్నట్టు చూశాడు.

అతని మాటలు ఆమెకు ఎంతో ధైర్యంగా అనిపించాయి. అతను ఆమె కళ్ళకు అడక్కుండానే వరాన్నిచ్చే దేముడిలా కనిపించాడు.

రేపు సాయంత్రం వస్తానని చెప్పి అతనికి నమస్కరించి వచ్చేసింది.

యింటికి వచ్చిన తరువాత ఆమెకు ఎంతో హాయిగా ఆనందంగా అనిపించ సాగింది.

ఎప్పుడు తెల్లవారుతుందా అని ఎదురుచూడసాగింది. [సశేషం]

# హృదయభారం

శ్రీవిరించి



సుశీల గడియారం వంక చూచింది.

ఏడుగంటలు దాటి పదిహేను నిమిషాలు అయింది. అయిదారు నిమిషాలు ఆలస్యం అయినా బృందావన్ ఎక్స్‌ప్రెస్ యీసరికి మదరాసు సెంట్రల్ స్టేషన్ బయటకు రావటానికి దాదాపు అరగంట పడుతుంది. తరువాత ఆటోరిక్షా దొరికించుకుని యింటికి బయలుదేరటానికి మరో అరగంట పడుతుంది. ఎంత చకచక వ్యవహరించినా ఎనిమిదిగంటల లోపల చేరుకోవటానికి కుదరదు.

'నాన్నగారు యింకా రాలేదేం?' అని పిల్లలు అప్పుడే రెండుమూడుసార్లు అడిగారు.

'వస్తారు. మీరు భోజనం చేసి కూర్చోండి' అని సర్దిచెప్పింది. వాళ్లు భోజనంచేయటానికి ఉత్సాహం చూపించలేదు.

'నాన్నగారు రానీ అమ్మా! అందరం కలిసే చేద్దాం' అంది అమ్మాయి వినత. వాళ్లను తొందరచేయడం యిష్టంలేక అలానే కూర్చుండిపోయింది సుశీల.

కుర్రవాడు ఆటబొమ్మలతో ఆడుకుంటున్నాడు. అయినా వాడి ధ్యాసంతా వీధిగుమ్మం వయిపే వున్నదని సుశీలకు తెలుసును.

'మీకేం హోంవర్క్ లేదా? ఏదయినా పాఠం అర్థంకాకపోతే అడుగు, చెబుతాను' అంది సుశీల

'నా హోంవర్క్ అంతా బడినుంచి రాగానే చేసేసుకున్నానుగా! రేపు పొద్దున్న టెస్ట్ వుంది. తెల్లవారాక

ఒక్క అరగంటసేపు చదువుకుంటే చాలు. ఇప్పుడేం పుస్తకాలు వద్దమ్మా' అంది వినత ముద్దుముద్దుగా.

దానికి నిండా యేడేళ్లు లేవు. అయినా బోలెడన్ని పుస్తకాలు చదువుతుంది. దాని శ్రద్ధ, ఆసక్తి చూస్తే సుశీలకు ముచ్చట వేస్తుంది.

టెలివిజన్‌లో యేదో ప్రోగ్రాం యిప్పుడే ప్రారంభం అయింది. చిన్న పిల్లల డ్యాన్సు.

మూడేళ్ల రవి ఆటబొమ్మలు ఒక పేపుకు నెట్టివేసి టెలివిజన్ ముందుకు వచ్చి కూర్చున్నాడు.

వినత సరేసరి! డ్యాన్సు చూస్తూ కుదురుగా కూర్చోలేకపోతోంది. తనకు కూడ అలా వయ్యారంగా డ్యాన్సుచేయాలని వుంది. తల్లివంక చూచింది.

ఇలాంటి ప్రోగ్రాం వచ్చినప్పుడు శ్రద్ధగా చూడాలి గాని, మనం కూడా పిచ్చిగంతులు వేయగూడదు- అంటుంది సుశీల పిల్లలతో. తల్లి కోపపడుతుందేమోననే భయంతో వినత కుర్చీకి అంటుకుపోయి కూర్చుంది గాని మనసంతా నెమలి పురివిప్పి ఆడుతున్నట్లు డ్యాన్సు చేస్తూనే వుంది.

చిన్నపిల్లల డ్యాన్సు అయిపోయింది వార్తలు మొదలయినాయి.

సుశీల టెలివిజన్ ఆఫ్ చేసింది. 'నాన్నగారు యింకా రాలేదేం?' అని అడిగాడు రవి. వాళ్ల కళ్లమీదకు నిద్ర కూరుకురావడం స్పష్టంగా కనిపిస్తోంది సుశీలకు.

'వస్తారు అంత దూరంనుంచి రావాలా మరి!' అంది వినత ఆరిందాలా.

'రైల్లోనేగా వచ్చేది. నడిచి వస్తారాయేం!' అన్నాడు రవి.

సుశీల నవ్వుకుంది.

పిల్లల సంభాషణ తమాషాగా అనిపిస్తుంది ఆమెకు. వాళ్లకూ మనసులో ఆరాటం, ఉత్సాహం ఎక్కువగా వుంటాయి.

'పోనీ మీ రిద్దరూ అన్నం తినేసెయ్యండి.' అంది సుశీల.

పిల్లలు 'రెస్పాండ్' అవలేదు.

"నాన్నగారు యింటికివచ్చాక యింకా ఆలస్యం అయిపోతుంది గదా! స్నానం అదీ చేసిగాని భోజనానికి కూర్చోరు. మీరు తినేసేయండి." అంది మళ్లీ.

"అమ్మా, నాకేం తెస్తారంటావు నాన్న బెంగుళూరునుంచి" అని అడిగాడు రవి.

"యేమో, చూద్దాంగా. నువ్వేం అడిగావు?"

"యేమీ అడగలా. అయినా నాన్న యేదోవొకటి తెస్తారుగా నాకు" అన్నాడు వాడు ఎంతో ధైర్యంగా.

"నేను మాత్రం జెమ్సు పాకెట్ తెమ్మని చెప్పాను" అంది వినత.

"జెమ్సు పాకెట్లు యిక్కడ కూడా దొరుకుతాయిగా. అంత దూరంనుంచి తీసుకురావడం ఎందుకు?"

"నాన్నగారికి బజారుకు పోవటానికి, యేమన్నా కొనడానికి టైం వుండదుగా ఎప్పుడూ. అందుకని బృందావనంలోనే అమ్మే జెమ్స్ పాకెట్ గాని పాలకోవాలు గాని తెస్తారు. అందుకని అవే తెమ్మని చెప్పాను" అంది వినత జవాబుగా.

పిచ్చి పిల్ల- అనుకుంది సుశీల- మనసులోనే.

ఎక్కడికక్కడ సరిపెట్టుకోవడం- తనలాగే- యిప్పటినుంచి అలవాటు అవుతున్నాయి దీనికి. అలా వుంటేనే జీవితంలో సుఖపడడం కుదురుతుంది.

ఆనందరావు దాదాపు ప్రతి నెల బెంగుళూరు వెడతాడు ఒక శని అది వారాలలో. అక్కడ ఉద్యోగం మాని వేసినా యింకా యేవో పనులు అతనికి అట్టే వుండిపోయినాయి. శనివారం ఉదయం బృందావన్‌లో వెళ్లి ఆదివారం సాయంకాలానికి తిరిగివచ్చేస్తాడు. తన ప్రయాణాలకు బృందావన్ ఎక్స్‌ప్రెస్ ఎంతో అనుకూలంగా ఉన్నదని మురిసి పోతాడు- ఆనందరావు శనివారం సాయంకాలం, ఆదివారం ఉదయం తను హాజరు కావల్సిన మీటింగులు చూచుకుని సాయంకాలానికల్లా వచ్చి కుటుంబంతో చేరుకోవడం అతనికి ఎంతో హుషారుగా వుంటుంది.

నడివయసులో పడ్డ ఆనందరావుకు ప్రయణాలతో చిరాకూలేదు, ఉత్సాహమూ లేదు- నిజానికి ఏదయినా పని వుంటే తప్ప ఎక్కడికీ కదిలే స్వభావం కాదు అతనిది. కాని ప్రతిసారీ ప్రయాణం ముగించి వచ్చిన తర్వాత అక్కడి సంగతులన్నీ అతి హుషారుగా విపులంగా చెబుతాడు సుశీలకు. పిల్లలు వేసే ప్రశ్నలకు కూడా విసుక్కోకుండా సరసంగా జవాబులు చెబుతాడు. అతని కబుర్లు వింటూ వుంటే తాము కూడా ప్రయాణంచేసినట్లే వుంటుంది కుటుంబానికంతటికీ- బహుశ యీ కబుర్లు అప్పటికప్పుడే వినడానికే గాపున పిల్లలు నిద్రపోకుండా కని పెట్టుకు కూర్చుంటారు- అనుకుంది సుశీల.

-ఈ విషయాలన్నీ సమాలోచించు కుంటూ కూర్చుంటే అప్పుడే తొమ్మిది గంట లయిపోయింది.

రవి సోఫాలో నిద్రకు వొరిగాడు. వినత పత్రిక పుటలు తిప్పుకుంటూ కాలక్షేపం చేస్తోంది.

సుశీల రవిని లేపింది.

వినత పైకి తేలటం లేదుగాని దానికీ నిద్ర ముంచుకువస్తోందని సుశీలకు అర్థ మయిపోయింది. ఇక ఊరుకుంటే లాభం లేదు. మరీ ఆలస్యం అయిపోతే ఆరోగ్యానికి భంగకరం గనుక పిల్లలిద్దరికీ అన్నం పెట్టేయాలనుకుంది.

పిల్లలు యీ మారు యేమీ బెట్టు చేయలేదు.

వాళ్ళ భోజనాలు చేయించి పక్కలు దులిపివేసి పడుకోబెట్టి సుశీల మళ్లీ

డ్రాయింగ్‌రూమ్‌లోకి వచ్చింది. ఆయన గారు యింకా రాలేదేం చెప్మా— అంటూ మళ్ళీ ఆలోచనలలో మునిగిపోయింది.

ఒకవేళ బయలుదేరలేదా యేమిటి?

బయలుదేరకపోవటానికి కారణం యేమీ కనబడలేదు.

పని కాకపోవడం అంటూ వుండదు. పన్నెండు గంటలు అయ్యేటప్పటికల్లా 'సెటిల్' అయిపోతుంది తరువాత భోజనం చేసి ఒక గంట విశ్రాంతి తీసుకుంటూ ఎవరేనా స్నేహితులు కబుర్లు చెబుతూవుంటే వింటూ కూర్చుంటానంటారు.

[illegible] స్టేషనుకువెళ్ళడమూను, రైలు ఎక్కడమూను: టిక్కెట్టు కొనుక్కునే అవసరం లేదు: పోనూ, రానూ ఒకే సారి ఆఫీసులోనే ముందుగా తీసుకుంటారు. ప్రయాణాలలో యెప్పుడూ చివరి నిముషందాకా యేర్పాట్లు చేసుకోకుండా [illegible] ఆనందరావుకు యిష్టం కాదు.

ప్రతిదీ నియమప్రకారం తూచినట్లుగా యే స్టెప్‌కు ఆ స్టెప్ ముందుగా వేసేసి కూర్చుంటాడు అతను. జీవితంలో 'శ్రమ పట్ల అతనికంత యిష్టం అనే కాదు, తనకు సంబంధించిన వాళ్ళందరూ యిలాగే వుండాలని, యెంత కష్టమైన పనిఅయినా సజావుగా నిర్వహించడానికి యిదొక్కటే మార్గమని ఆనందరావు అప్పుడప్పుడు చిన్న సైజు ఉపన్యాసాలు కూడా యిస్తూవుంటాడు. రైలు రావటం ఆలస్యం అయితే తప్ప అతనెప్పుడూ దాన్ని 'మిస్' చేయడు. సుశీల నవ్వుకుంది యీ సంగతులన్నీ గుర్తుకు వచ్చి. నిద్రపోతున్న పిల్లల వంక ఆప్యాయంగా చూచి వచ్చింది. ఈ పిల్లలను పెంచడం, పెద్దచేయడం, వాళ్ళకు జీవితం సరిగా అర్థం అయ్యేట్లు విద్యాబుద్ధులు నేర్పడం .. యిదంతా సంసార బాధ్యత దీన్ని చక్కగా నిర్వహించటంలోనే వుంది మన చాకచక్యం.... ఎక్కడ యే పొరపాటు వచ్చినా జీవితాంతం దుఃఖించాల్సి వస్తుంది సుమా— అని అనేక సార్లు సుశీలను హెచ్చరిస్తూ వుంటారు.

కాని సుశీలకే ఒక్కొక్క మారు అర్థంకాకుండా పోతుంది యీ మనిషి సంగతి; పద్ధతి: ఈ పదేళ్ల కాపురం లోను తనకు ఆనందరావు ఎంత అర్థం అయినాడో అంతగానూ అర్థంకాకుండా పోయినాడని అనిపిస్తుంది ఆమెకు.

ఒడుదుడుకులు లేకుండా కాలం వెళ్ళదీయటం చాలును తనకు. అతనికి మాత్రం అంతే చాలదు. ఇంకేదో కావాలి: అలాగ, అతను కానిదానికని లేని దానికని పరుగులు తీస్తున్నాడని సుశీల అనుకోదు.

రోడ్డుమీద ఏ 'ఆటో' పోతున్నట్లు శబ్దం అయినా సుశీల వీధివయిపు దృష్టి

సాగిస్తోంది. వరండాలో దీపం వెలిగించే వుంటుంది.

మరీ రోడ్డుకు దగ్గరగా వున్న ఇల్లు అవడంవల్ల అన్ని వాహనాల చప్పుళ్లు వినిపిస్తాయి. ప్రతి ఆటో, ప్రతి కారు తమ ఇంటిముందే ఆగుతున్నట్లుగా అనిపిస్తుంది. తీరా అవి యిల్లు దాటి పోవడంతోటే— నిట్టూర్పు విడవాల్సి వస్తుంది. వాటిని గమనించకుండా వుండటానికి ప్రయత్నించనంత వరకు పోతుంది ధోరణి.

డోర్‌బెల్ మోగేసరికి ఉలిక్కిపడి లేచింది సుశీల. యాదృచ్ఛికంగా గడియారం వంక చూస్తూ వీధి గుమ్మం వరకూ పరుగెత్తింది.

తొమ్మిదిన్నర.

తలుపు తీయటంతోటే ఆనందరావు చేతిలో బ్రీఫ్‌కేస్‌తో నిలబడ్డాడు.

'వచ్చేశారా !' అంది ఆనందంతో పెల్లుబికిపోతూ.

'రాక యేమవుతాను.' అంటూ షూస్ విప్పుకుంటూ కూర్చున్నారు.

'రైలు ఆలస్యం అయిందా బాగా ?'

'అబ్బే. ఒక్క అరగంట ఆలస్యం అంతే— కాని యింకో గొడవలో చిక్కుకుపోయి యింత పేపు అయింది—'

'పిల్లలేరీ ! నిద్రపోయారా? పోనీలే లేపకు. ఈమారు వాళ్ళకోసం మంచి మంచి వస్తువులు తెచ్చాను. నింపాదిగా చూపిస్తాన్లే రేపు— నువ్వింకా భోజనం చేయకుండా కూర్చున్నావు గదూ ! ఎంత, అయిదు నిముషాలలో వచ్చేస్తాను— వడ్డించేయి—' అన్నాను బాత్‌రూంలోకి హడావిడిగా వెడుతూ.

## 2

ఆనందరావు బెంగుళూరు సిటీస్టేషన్‌కు వచ్చేటప్పటికి యింకా రైలు రాలేదు. లెక్కప్రకారం అయితే ఈ సరికి అది మదరాసు నుంచి వచ్చి తిరుగు ప్రయాణానికి సంసిద్ధం అవుతూ వుండాలి. ప్లాట్‌ఫారం జనంతో కిటకిట లాడుతోంది. ప్రయాణికులంతా సామాన్లు పరమకుని హడావిడిగా వున్నారు.

అతను ఎంక్వయిరీ చేయగా బృందావనం అరగంట లేటు అని చెప్పారు. అరగంటకు యింకో అరగంట కలుపుకుంటే— మరో గంట గడిస్తేగాని తనకు బెంగుళూరు నుంచి మోక్షం లేదన్న మాట ! ఈ గంట పేపు యిలా కాళీగా ప్లాట్‌ఫారం మీద దేబిరిస్తూ నిలుచునే బదులు యింకెవరినయినా చూసి రావచ్చు. స్టేషనుకు మల్లేశ్వరం బాగా దగ్గిర. పది నిముషాల్లో వెళ్ళి రావచ్చును.

మల్లేశ్వరంలో తన స్నేహితుడు 'అర్జునరావు' వున్నాడు. వెళ్ళి చూచి వస్తే సంతోషిస్తాడు. అతన్ని చూచి కూడా ఆరు నెలలు దాటింది. అసలు బెంగుళూరు వచ్చినప్పుడల్లా తమ ఇంట్లోనే దిగమని కలుసుకోకుండా వెళ్ళవద్దని మరీ మరీ చెబుతూ వస్తున్నాడు. అయితే తనకు మీటింగ్‌లకు దగ్గరగా

వుండదనీ స్నేహితులతో కబుర్లుపెట్టుకు కూర్చుంటే తను చేయవలసిన పని గట్టెక్కుతుందని యిన్నాళ్ళూ అతనికి ముఖం చాటుచేస్తూ వచ్చాడు. పోనీ, యిప్పుడు గంట సమయం దొరికింది గనుక వెళ్ళి ముఖంచూపించి వస్తే బాగుంటుం దనిపించింది.

ఆనందరావు వెళ్ళేసరికి అర్జునరావు యింట్లోనే వున్నాడు. అతనికంటే పిల్లలు మామయ్య వచ్చారని మరీ సంతోషించా రు. వాళ్ళకోసం క్యాడ్‌బరీ చాక్‌లెట్లు కొనుక్కు మరీ వెళ్ళాడు గదా!

'ఆనందం, నువ్వు చేసేపని యేమీ బాగుండలేదు' అన్నాడు అర్జునరావు.

'అర్జున్! ఆ మాట అలా వుంచు. నే నిక్కడ కూర్చున్న కాసేపూ విష్టూ రాలు వల్లించకుండా యేవయినా ఉపయోగించే సంగతులు మాట్లాడు.... నాకు మాత్రం స్నేహితులతో సరదాగా గడపాలని ఉండదా ఏమిటి? కుదరదు, యేంచేయమంటావు? ఇప్పుడయినా రైలువాళ్ళ పుణ్యమా అని యిటు రాగలిగాను' —అంటూ ఆనందరావు అతనితో సంభాషణలో మునిగిపోయాడు.

వాళ్ళు మాట్లాడుకుంటూ ఉండగా అర్జునరావుయింటి మేడమీది ఆసామి వచ్చాడు. ఆనందరావుకు అతనితో ముఖపరిచయంతప్ప యింకేం లేదు.

'మీరు దేవునిలా వచ్చారనుకుంటాను. మాకో ఉపకారం చేసిపెట్టాలి.' అని ఆనందరావు చేతులు పుచ్చుకున్నాడాయన.

ఆనందరావుకు విషయం యేమిటో తెలియక ఉక్కిరిబిక్కిరి అయినాడు. 'నా వల్ల కావలసిన పని యేముంటుంది?' అని మనసులోనే అనుకుంటూ పైకి మాత్రం 'మీరు ఇంత ఇదిగా చెప్పాలా ! అదేమిటో చెప్పండి-' అన్నాడు.

'మా ఇందిర అర్జెంటుగా మద్రాసు వెళ్ళాలి. తోడు లేకుండా యెప్పుడూ ప్రయాణం చేయలేదు. నాకేమో బయలు దేరాలంటే కుదరకుండా వస్తుంది. నాలుగు రోజులుగా ప్రయాణం వాయిదా పడిపోయి, అక్కడనుంచి కబురుమీద కబురు వస్తున్నాయి. మీరు శ్రమ అనుకోకుండా ఆమెను మద్రాసు తీసుకు వెళ్ళాలి, మీతోపాటు. మీ మేలు మరువలేం!, అన్నాడాయన.

ఆనందరావుకు ఏమీ అర్థం కాక అర్జునరావు ముఖంవంక చూచాడు. ఆ ముఖంలో అతని కేమీ సందేశం దొరక లేదు.

'నేను స్టేషన్‌దాకా వచ్చి ఏకామిడేషన్ సంగతి చూచుకుంటాను. ఆ విషయం మీరేం శ్రమపడనక్కరలేదు. మీరు 'ఊ' అంటే యిప్పుడే టాక్సీ తీసుకువస్తాను. మరో పది నిముషాలలో యెలాగూ మీరు బయలుదేరుతున్నారు గనుక యీ చొరవ తీసుకుంటున్నాను. మీకు మీ అర్జునరావు ఒకటి, నేను




మరొకటి అనుకోకండి—' అంటూ ఉక్కిరిబిక్కిరి చేయసాగాడు.

ఆనందరావుకు 'ఊ' అనక తప్పలేదు. అయినా ఇందులో తను పడే శ్రమ యేమీ లేదు గనక పోనీలే పాపం అనుకున్నాడు.

అన్నట్లుగానే పదినిమిషాలలో టాక్సీ వచ్చి యింటిముందు నిలిచింది. ఆనందరావు స్నేహితుడికి 'గుడ్‌బై' చెప్పి కూర్చున్నాడు. వెనక సీట్లో ఇందిర, మేడమీది ఆసామి కూర్చున్నాడు.

వాళ్ళు స్టేషన్‌కు వచ్చేసరికి బృందావనం ప్లాట్‌ఫారంమీద విడిసి వుంది.

ఆనందరావు తన కంపార్ట్‌మెంట్‌కు నింపాదిగా నడిచాడు.

ఆమెకూడా అతన్ని అనుసరించింది.

అయిదునిముషాల్లో ఆయన టిక్కెట్‌తో సహా వచ్చి వాళ్ళను కలుసుకున్నాడు. 'మీ సీట్ దగ్గరే యేర్పాటు చేస్తాను' అన్నాడు. ఆ సీట్ 'ఎలాట్' అయిన మనిషితో మాట్లాడి 'మార్పిడి' సంపాదించాడు.

ఈయన మొత్తంమీద కాలాంతకుడే! చివరి క్షణంలో బృందావన్ ఎక్స్‌ప్రెస్‌లో టికెట్ సంపాదించడమే గాకుండా అవలీలగా తనకు అనుకూలమయిన సీట్ కూడా సాధించాడు అనుకున్నాడు ఆనందరావు.

'నే నిప్పుడు ఇంటికి వెళ్ళగానే మా తమ్ముడికి టెలిఫోన్ చేస్తాను. ట్రంక్ కాదులెండి. యస్. టి. డి. లో మాట్లాడి

వాడిని స్టేషన్కి వచ్చి మిమ్మల్ని కలుసుకో మంటాను.' అన్నాడాయన ఆనందరావుతో.

'మదరాసు చేరుకునేటప్పటికి బాగా చీకటిపడిపోతుందా?, అనడిగిందామె.

'నువ్వేం బెంగ పెట్టుకోమాకు. ఏడున్నర, ఎనిమిది అవుతుంది అంతే. వాడు వస్తాడుగా స్టేషన్కి. ఆనందరావు గారు వుండనే వున్నారు. ఫ్లాస్క్‌లో విండా 'టీ' పోసుకున్నావు గదా? అంత అయా సంగా వుంటే కూల్‌డ్రింక్స్ ఏమన్నా పుచ్చుకో. అవీ రైల్లోనే సర్వ్‌చేస్తారు. ఇదుగో... అరటిపళ్ళు అత్తం యీ బాస్కెట్‌లోనే వుంది గదూ। – ఇదుగో నీ టికెట్ --- మరి నేను వెళ్ళవస్తాను. నీవు ఇంటికి చేరకోగానే తమ్ముడిని నాకు టెలిఫోన్ చేయమని చెప్పు. అప్పటికిగాని నాకు మనసుకు తెరిపి అవదు. అయినా నాకేం అంత గాబరా లేదనుకో. ఆనంద రావు గారు ఉన్నారుగా। ఇంక వస్తాను నేను. వస్తానండీ ఆనందరావుగారూ। మీ సహాయానికి సహస్ర థాంక్స్-- సమయానికి మీరు దేవుడె అనుకుంటు న్నాను. శ్రమకు మన్నించండి. వస్తాను' అంటూ ఆయన అప్పగింతలు చెబుతూ వుండగానే రైలు కూతవేసి బయలు దేరింది.

ఆనందరావు తన సీట్లో ఒదిగి కూర్చు న్నాడు, మన్యాకోసం.

ఇందిరతోపాటు సామానుకూడా భారీ గానే వుంది. పెద్ద సూట్‌కేస్, పళ్ళబుట్ట, పుస్తకాల పాకెట్లు రెండు, ఎయిర్ బ్యాగూను। ఇవన్నీకాక ఆమె అనుకు కూర్చుందుకు పెద్ద డన్‌లప్ దిండు. ఈ దిండు మొత్తం సీటును సగం ఆక్రమిం చేసింది. ఎంత ఒదిగి కూర్చున్నా ఆనంద రావుకు యీ దిండు కొంత ఆశ్రయం కాక తప్పలేదు.

రైలు బయలుదేరిన తర్వాత ఆనంద రావు తన బ్రీఫ్‌కేస్‌లోనుంచి పుస్తకం బయటకు తీసి కూర్చున్నాడు. జనం కోలాహలం సద్దుమణిగిన తర్వాత చదువు కుంటూ కూచుంటే సరిపోతుంది। పుస్తకాలు చదవడం అతని వృత్తి. ప్రతి ప్రయాణంలోను ఓ మాదిరిసైజు పుస్త కాలు నాలుగయినా చదివేస్తాడు. సమయానికి తనకు కావలసిన పద్ధతిలో మలుచుకోవడం ఆనందరావుకు తెలిసి నట్లుగా యింకెవరికి తెలియదనే చెప్పాలి.

వెండర్ కాఫీ తీసుకు వచ్చినప్పుడు రెండు కాఫీలు ఆర్డర్ వేశాడు. ఒకటి ఆమెకు ఆఫర్ చేయబోతే, నేను కాఫీ తీసుకోనండీ. టీ తాగుతాను. మీరు తీసు కోండి. ఫరవాలేదు, అంది.

టీ రావటానికి యింకా టైం పడుతుం దన్నాడు వెండర్. తనుకూడా కాఫీ తీసు కోవాలో, మానాలో క్షణంపాటు అర్థం కాలేదు ఆనందరావుకు. అతను తటపటా యిస్తుంటే 'ఫరవాలేదు. మీరు తీసుకోండి–

నాకు కాఫీ పడదు. అందుకని_' నవ్వుతూ చెప్పింది.

ఆనందరావు యేమాత్రం డెలికసీ ఫీలవ్వకుండా కాఫీ తీసుకోక తప్పలేదు ఆమె నవ్వు చూశాక.

కాస్సేపు అయినాక, ఆమె బాస్కెట్ లోనుంచి యేదో పాకెట్టు బయటకు తీసింది. ఒక స్వీట్, రెండు గారెలు, రెండు అరటిపళ్ళు ఓ పేపర్ ప్లేట్లో సర్ది ఆనందరావుకు అందించింది. అతను మొహమాటంలో పడ్డాడు. సాధారణంగా భోజనానికి, భోజనానికి మధ్య యేమీ పుచ్చుకోడు కాఫీ తప్ప. ఘనపదార్థాలు అసలే తనకు చుక్కెదురు_ అందులోనూ ప్రయాణం చేస్తున్నప్పుడు.

'అబ్బే నాకు వద్దండీ. మీరు తీసుకోండి' అన్నాడు.

'అట్లా అంటే ఎట్లా? ఫరవాలేదు' అంది ఆమె.

'నేను అంత తీసుకోలేనండీ. నాకు పడవు అవన్నీ---'

'మరీ విచిత్రంగా చెబుతారు. స్వీట్ పడనివాళ్ళుంటారా? మరేం బిడియం వద్దు. నాకు కాఫీ వంటికి పడదు గనక యిందాక వద్దన్నాను --మీరు తీసుకోకపోతే నేనూ తినలేను. ఆ--యిందండీ_' అంది ఆమె బలవంతంగా అతని చేతుల్లో పెడుతూ.

ఆనందరావుకు 'సీన్' క్రియేట్ చేయడం యిష్టంలేదు. ప్లేట్ అందుకున్నాడు. అతను అమిత మొహమాటంగా స్వీట్ తినడం పూర్తి చేయడంతోటే ఆమె 'ఇంకో స్వీట్ యిస్తాను' అంది. ఆనందరావు తన ప్లేట్ దూరంగా జరుపుతున్నాడు_ ఆమె ముక్క అందులో వేయడానికి ముందుగానే.

'అయ్యో' అంది ఆమె

'వద్దండీ. ఎక్కువైతే కష్టం'

'పోనీ యింకో అరటిపండు తినండి'

___తీసుకోక తప్పలేదు ఆనంద రావుకు.

'మీరు సమయానికి రాబట్టి సరిపో యింది గాని---'

'అబ్బే-- నేను చేసిందేముందండీ_' అన్నాడు.

మీరేం చేస్తూ ఉంటారు మదరాసులో?' అనడిగింది.

ఆనందరావు చెప్పాడు.

'అలాగా. చాల సంతోషం, అంది ఆమె. అతను మళ్ళీ పుస్తక పఠనంలో మునిగిపోవడంతో ఆమె యింకేమి డిస్టర్బ్ చేయకుండా వుండిపోయింది.

రెండు రోజులుగా నిర్విరామంగా పని చేసినందువల్ల, ప్రయాణ అలసటవల్ల అతనికి నిద్ర కళ్ళమీదకు ఊరుకువచ్చి నట్లుంది. చదవడంమీద శ్రద్ధ ఆనడంలేదు. అతనికి గమనం లేకుం డానే నిద్రలో పడిపోయాడు.

రైలు కుదుపుకు మెలకువ వచ్చి నప్పుడు చూడకుండానే తన తలా ఆమె

భుజంమీద వాలిగివుంది. ముంజేయి ఆమె వొడిలో వాలివుంది.

సీట్‌లో సర్దుకు కూర్చుని ఆమె యేమనుకుంటుందోనని భయపడుతూ 'క్షమించండి. నిద్రలో నాకు తెలియలేదు—' అన్నాడు.

'ఫరవాలేదులెండి—' అందామె చిరునవ్వుతో; యిదేం పెద్ద విషయం కానట్లుగా ముఖం పెట్టి.

అయినా ఆనందరావుకు చాల సిగ్గనిపించింది. తను యేదేనా ప్రయత్నంచేసి నిద్రలో కూరుకుపోకుండా వుండాలనిపించింది. పైకి అలా అన్నారు గాని— ఆమె మనసులో యేమనుకున్నారో !

తనవల్ల జరిగిపోయిన పొరపాటుకు ఆనందరావు మనసులోనే కుములిపోయాడు. పైకి మాట్లాడవలసిన సంగతి కాదు.

ఉన్నట్లుండి ఆమె శ్వాస పీల్చడంతో ఆయాసపడుతున్నట్లు అనిపించింది ఆనందరావుకు. తనలాగే ఆమెకూడా మనసులో యేమయినా ఆరాటపడుతుందేమో అనుకున్నాడు. తను చేయగలిగింది యేమీ లేదు

టీ కుర్రవా. వస్తే ఇద్దరూ టీ తాగారు.

'వేడివేడి టీ తాగితే నాకు కాస్త రిలీఫ్‌గా వుంటుంది' ఆమె అన్నది.

ఇందాకటికంటె ఆయాసం కాస్త తగ్గినట్లు అనిపించింది ఆనందరావుకు. కాని యీ రిలీఫ్ పదిపదిహేను నిమిషాలకన్నా ఎక్కువసేపు పనిచేయలేదు.

ఉన్నట్లుండి ఆమె ఎక్కువగా వగరుస్తూ సీట్లో అతలాకుతలం అయిపోతున్నట్లు అనిపించింది.

ఆనందరావు యేమీ తోచకుండా అయిపోయి 'యేమండీ, యేమయింది' అన్నాడు ఆదుర్దాగా

'దయచేసి ఆ సూట్‌కేస్ తీసి దాన్లో మందుసీసా వుంది. అందుకోండి' అంది. సూట్‌కేస్ తాళంవేసి వుంది. తాళంచెవి యెక్కడ— అనుకుంటూ వుండగా ఆమె తన చేతిలోని పర్సువంక చూచింది.

'ఇవ్వండి' అన్నాడు. ఆమె చేయి కదపలేకపోయింది.

నోట్లోంచి మాటకూడా బయట పడడంలేదు

'తీసుకోండి' అంది అమిత ప్రయాసతో.

ఆనందరావు ఆమె తొడమీద వున్న చేతిపర్సు తీసుకుని అందులోని తాళాల గుత్తి బయటకు తీశాడు. ఆ గుత్తిలో నుంచి 'సూట్‌కేస్' తాళంచెవి యేదో గమనించడం కష్టంకాలేదు.

సూట్‌కేస్ పాకెట్లోవున్న మందుల పాకెట్లు ఆమె సూచనమీద బయటకు లాగాడు. 'ఆ రంగు కాప్సూల్ ఒకటి, తెల్లమాత్ర ఒకటి త్వరలో యివతలకు తీయండి—' అంది ఆమె యింకా రొప్పుతూనే.




ఆనందరావు అలాగే చేశాడు.

ఆమె చేయి ముందుకు చాపబోయింది. అవి అందుకుందుకు కాని నిస్సత్తువగా చేయి వొడిలోనే వాలిపోయింది.

ఆనందరావు అయోమయంలో పడిపోయాడు.

'కాస్త మంచినీళ్లు అందుకోండి త్వరగా....'

బాస్కెట్‌లోంచి నీళ్ల సీసా తీసి గ్లాసులో వంచాడు.

'ఆ రెండు మాత్రలూ నా గొంతులో వేయండి ..'

ఏ మాత్రం ఆలోచించకుండా ఆ పని చేశాడు ఆనందరావు. వెంటనే గుక్కెడు నీళ్లు కూడాపట్టించాడు. ఆమె చేయి ముందుకు కదిపి అతని ఎడమ చేతిని గట్టిగా పట్టుకుంది. ఆమె చేయి వణికిపోతూవుండడం స్పష్టంగా తెలుస్తోంది.

రెండుమూడు నిమిషాలలోనే ఆయాసం కాస్త తగ్గింది.

'అమ్మయ్య' అనుకుని నిట్టూర్పు వదిలింది ఆమె.

'మీకు శ్రమ యిస్తున్నాను' అంది మళ్లీ. అతనికి యేమీ అర్థం కాలేదు. సమాధానం చెప్పలేకపోయాడు.

'కాస్త గుండెమీద చేత్తో రాస్తారా?'

ఆనందరావు బిడియంగా వుండిపోయాడు.

"నెప్పిగా వుంది. కాస్త బరువుగా

నాలుగయిదుసార్లు రాసుకుంటే తగ్గిపోతుంది. నాకు చేయి స్వాధీనంలో లేదు. మీరేం అనుకోకుండా గుండెలమీద రాయండి, ప్లీజ్–' అంది.

ఆనందరావు యిబ్బందిగా ఫీ వుతూ ఆమె ఎదురు రొమ్ముమీద వేళ్ళు అన్నాడు. 'ఇంకా కొ_స్త పక్కకి కిందికి.... ఆ ! అలా ... అలాగే నాలుగయిదుసార్లు గుండెపయిపుకు రాయండి' అంది.

మంచి, చెడు ఆలోచించుకునే వ్యవధానం లేదు. ఆనందరావు ఆమె కోరిన ఉపచర్యలన్నీ చేశాడు. దాదాపు ఒక పావుగంట . యిరవయి నిమిషాలు అయిం తరవాత ఆమె కొ_స్తలో కొ_స్త మామూలు మనిషి అయింది.

ఫ్రీగా ఊపిరి పీల్చి వదిలింది.

'అమ్మయ్య. ఇప్పుడు సర్దుకుందండీ –' అంటూ ఆమె యామాలు తానే సూట్ కేస్ మూత ఎ_త్తి మందులపాకెట్ అందుకుని అందులోంచి ఓ ఎరుపురంగు మా_త్ర తీసుకు తినగలిగింది.

టీ వెండర్ వస్తే మరోమారు టీ తీసుకున్నారు.

అరోకోణం స్టేషన్ దాటింది బృందావన్ ఎక్స్_ప్రెస్.

'ఇంకెంతసేపు పడుతుందంటారు ? మదరాసు చేరుకోవటానికి ....' అంది ఆమె.

ఆమె కళ్ళలో కూడా యింతాక వచ్చిన మార్పులు, నీరసం తొలగిపోయినాయి.

ఇప్పుడు ఆమె నవ్వుతూ వుంటే యింతసేపూ యేమీ జరగనట్లే అనిపించింది ఆనందరావుకు

"అందుకనే ఒంటరి ప్రయాణం అంటే భయం. నేను వెళ్ళగలనన్నా యింట్లోవాళ్ళు నన్ను వెళ్ళనియ్యరు. మీరు సమయానికి దేవుడిలా....'

'పదేపదే అలా అని నన్ను చిన్న బుచ్చకండి. నేను చేసిం దేముంది ?' అన్నాడు ఆనందరావు.

'మంచివాళ్లు యెప్పుడూ అంతే లెండి–' అందామె. ఇంకా ప్రొద్దుపోగానే మీకు ని_ద్రవస్తే నిరామయంగా పడుకోండి. నాకింకేం బెంగా లేదు' అంది

## 3

ప్రయాణం వివరాలు చెబుతున్నంతసేపూ సుశీల ముఖంలో వస్తున్న మార్పులన్నీ గమనిస్తూనే వున్నాడు.

'హాయిగా ఆమె వడిలో తలపెట్టుకుని తతిమ్మా దూరమంతా కులాసాగా ప్రయాణం చేసివుంటారు–' అంది ఆమె. కంఠస్వరంలో చిరుకోపం, అసూయ స్పష్టంగా అగుపిస్తున్నాయి.

ఆనందరావుకు ఇలా జరుగుతుందని తెలుసు.

"నీకేం, నీవలా తేలికగా అనేస్తావు గాని నేనెంత ఇబ్బందిపడ్డానో నీ కెలా తెలుస్తుంది?"

"కాన్తో కూస్తో ఉన్నంది పదితే మటుకేం లెండి. సుఖం దక్కిందిగా: హాయిగా పగటిపూట పూలపాన్పుమీద శయనించి ప్రయాణం_"

ఆనందరావు సహించలేకపోయాడు.

"చాల్లే, సుశీలా. అసహ్యంగా మాట్లాడకు_"

"నేను యేం మాట్లాడితే మటుకేం లెండి. అంతా అయిపోయిందిగా:_"

ఆనందరావు ఇంకేం మాట్లాడలేకపోయాడు.

భోజనాలు అయిపోయి యిద్దరూ పడకగదిలోనికి వచ్చారు.

"తరువాత యేమయిందో చెప్పరేం? మదరాసు చేరాక వాడా యింటికి రావడం యింత ఆలస్యం ఎందుకయిందో వివరించరేం?" అంది కొన్త ఎగతాళి మిళాయించి సుశీల.

'అదే చెప్పబోతున్నాను. మధ్యలో నీ అనుమానాలు, అసూయలూ_'

'అనుమాన మేముందిలెండి. స్పష్టంగా కనిపిస్తూ వుంటే_"

'ఆడవాళ్ళ ఆసూయలు అని వ్యాసం వ్రాయాలని వుంది'

'ఎన్నయినా రాస్తారు మీకేం?'

'నీ కెలా చెప్పాలి సుశీలా?' టూకీగా యేంజరిగిందో చెబుతా విను_ మద్రాసు సెంట్రల్‌లో దిగాం. ఆమెను 'రిసీవ్' చేసుకుందుకు యెవరూ లేరు. హాఫ్‌ఎన్‌అవర్ వెయిట్ చేసి యెవరూ రాలేవి నిర్ధారణ



చేసుకున్నాం. ఆమెను యేం చేయాలి? 'టాక్సీ మాట్లాడిపెట్టండి. అడ్రస్ వుంది వెళ్ళిపోతాను'_ అన్నది ఆమె. కాని రాత్రి ఎనిమిదిన్నరగను ఆమెను అలా తేలికగా యేమీ బాధ్యతలేనట్లుగా యెలా వదిలేస్తాను?'

'అవును మరి! యెలా వదిలేస్తారు?'

'సర్లే, నీ హేళన. ఆమె దగ్గర టెలిఫోన్ నెంబర్ తీసుకుని స్టేషన్ నుంచి వాళ్ళయింటికి ఫోన్ చేశాను. ఆ ఫోన్ చెడిపోయిందనీ పిలుపు అందదనీ తెలుసుకొందుకు పావుగంట పట్టింది. అప్పుడిక నాకేం మార్గంలేక టాక్సీలో

ఆ మెను వేసుకుని వాళ్ళ యింటికి వెళ్ళాను-'

'నయం ఇప్పటికయినా వచ్చారు. రాత్రంతా అక్కడ గడపి, తెల్లవారి యింటికి వద్దామనుకున్నారు గాదు!'

'కాసాకు విను. ఎక్కడో అయిన వరంలో వాళ్ళయిల్లు. టాక్సీలు ఒకంతట రావు. ఎలాగో అక్కడకు చేరుకున్నాం తీరా అక్కడ దేమయిం దనుకున్నావ్?'

'యేదో అయేవుంటుంది లెండి-'

"వాళ్ళు వూళ్ళోలే నేలేరు. ఇల్లు తాళం వేసివుంది. ఈ రోజు ఉదయమే తిరుపతి వెళ్ళారుట! తెల్లవారాక కావి రామని చెప్పారుట, పక్కయింటివాళ్ళతో."

సుశీల ఉత్సుకతతో మెడ సారించింది.

'ఆమెను యేంచేయాలా అని తట పటాయిస్తూవుండగా పక్కయింటి ఆమె బయటకు వచ్చి- "అయ్యో ఇందిరమ్మ గారా! వచ్చారా! రండి, రండి లోపలకు-' అని ఆమెను ఆహ్వానించింది. వాళ్ళకూ వాళ్ళకూ బాగా పరిచయం. ఆమె ఆ రాత్రంతా వాళ్ళయింట్లోనే గడిపి తెల్లవారాక తమ మనవడు, మనమరాలు తిరుపతినుంచి తిరిగివచ్చాక సురక్షితంగా అక్కడకుమారతానంది. పక్కింటి పిన్ని గారు 'ఇందిరమ్మగార్ని మేం వాళ్ళకు వప్పజెప్పుతాంలెండి. మీరేం బెంగ పెట్టుకోకుండా మీ యింటికి వెళ్ళండి" అంది. ఆమెకూడా అలాగే అన్నాక నేను అయినవరం నుంచి మన యింటికి ఆటో వేసుకువచ్చాను. ఇప్పటికయినా రాగలిగా నంటే యెంతో తొందరగా వచ్చినట్లు లెక్క---' ఈ డెబ్బయియేళ్ళ ముసలి దాన్ని యేమీ శ్రమ అనుకోకుండా మద్రాసుచేర్చారు. మీకుచాలా పుణ్యంవుం టుంది నాయనా' అంది ఆమె తెలుసా! కావాలి అంటే ఆ పుణ్యం అంతా నీకు ట్రాన్స్‌ఫర్ చేస్తాను' అన్నాడు ఆనందరావు' సుశీల మొహంలోకి గుచ్చిచూస్తూ.

సుశీల ముఖకవళికలన్నీ మారిపో యాయి. ఇందాకటినుంచివున్న అసూయా మేఘాలు తొలగిపోయి మామూలు ప్రశాంతత ఆవరించింది.

"పాపం. ఆ ముసలామెను యింత రాత్రిపూట అక్కడ వదిలేయకపోతే- పోనీ మన యింటికి తీసుకురాకపోయి నారా, సరాసరి స్టేషన్ నుంచే! రాత్రంతా యిక్కడవుండి రెస్ట్ తీసుకుని రేపు మధ్యాహ్నం వాళ్ళ మనమడి ఇంటికి వెళ్లేవారు గదా!" అంది సుశీల.





# రెప్పలులేని కళ్ళు

తాడిగిరి పోతరాజు

జైలు....

'నిన్న'.... కు

'నేడు'.... కు

'రేపు'.... కు వ్యత్యాసంలేని జైలు. వారం పేరుతో గానీ, తారీఖుతో గానీ నిమిత్తంలేని కారాగారం. ఘనీభవించిన కన్నీళ్ళకు, గడ్డకట్టుకుపోయిన కాలానికి నిలయమైన ప్రిజన్. 'లాకప్పు'ల వెనుక నిద్రపట్టని రాత్రిళ్ళు. లాకప్పుల బయట అర్థవిహీనమైన పవళ్ళు. ఉదయాస్తమయాల రెక్కలపై ఎగిరివెళ్ళే సూర్యుడు-జైలుతూర్పువైపు గోపురంపై ఉదయించటం- ఎత్తయిన ప్రహరీగోడ ముళ్ళతీగె వెనుక అస్తమించటం- మినహా మార్పులేని రోజులు.

జైలులో ఒక భాగం- శిక్షలు పడిన ఖైదీలు.

....రెండవ భాగం- శిక్షలు పడని ఖైదీలు.... వీళ్ళు నేరారోపణ లేని ఖైదీలు- నేర విచారణ లేని నేరస్థులు. తమ నిర్బంధానికి కారణం అడిగే హక్కు లేని నిర్భాగ్యులు. బెయిల్‌పై విడుదలయ్యే అర్హత లేని నిస్సహాయులు. డిటెన్యూలు-

వీళ్ళు... విద్యార్థులు- విప్లవ మేధావులు- అధ్యాపకులు- ఉపాధ్యాయులు- కవులూ- కళాకారులు- శాసనసభ్యులు- పెద్దపెద్ద నాయకులు- చిన్నచిన్న కార్యకర్తలు, మొదలగువాళ్ళు. వెలుగు కోసం నిరీక్షిస్తూ సంవత్సరాలతరబడిగా చీకటిలో

మ్రగ్గిపోతున్నారు.

ఆ రోజు మధ్యాహ్నం– రెండు గంటలు.

డైనింగ్ హాలులో ఇద్దరుడిపెన్యూటు ఎదురుతిరుగుతూన్న కాలాన్ని లొంగ తీసుకొనే ప్రయత్నంలో ఉన్నారు. ఒకడు కుర్చీలో కూర్చొని ఉన్నాడు. అతను టేబుల్‌పై "హిందూ" ఇంగ్లీషు పత్రిక పరచుకొని ఏకాగ్రతతో చదువుతున్నాడు. రెండవ వ్యక్తి కొద్దిదూరంలో గచ్చునేలపై కూర్చొని పలకపై వ్రాసుకొంటున్నాడు.

బయట ఎండ చిటపటలాడుతోంది.

అస్‌బెస్టాస్ రేకుల క్రింద చొక్కాలు లేని వాళ్ళ శరీరాలు చెమటతో చిటచిట లాడుతున్నాయి.

"చూడండి... ఏమైనా తప్పులున్నాయేమో ?... ఈసారి ఒక్క తప్పు కూడా లేకుండా రాశాను"... అతను లేచి లుంగీ సరిజేసుకుంటూ పలకా బలపం టేబులుపై పెట్టాడు.

పలక మీద నాలుగు ఇంగ్లీషు వాక్యాలున్నాయి. వంకరటింకరగా ఉన్న ఇంగ్లీషు అక్షరాలు. ఒక మూలనుండి మరొక మూలకు పరుగెత్తుతున్నాయి.

....'దట్ ఈజ్ ఎ టేబుల్....

......ఎ చెయిర్

... ....ఎ బుక్

.... ఎ యాపిల్.... కరెక్టు– కరెక్టు– కరెక్టు....అంటూ నాలుగోదానికి 'ఇంటు' మార్కు పెట్టాడు.

"వెంకన్నా.... మొదటి మూడూ కరెక్టు ..కానీ లాస్టది తప్పు.... 'యాన్ యాపిల్' అని ఉండాలి. 'ఎ' 'ఇ'–'ఐ' 'ఓ'– 'యు'లతో కూడిన మాటల ముందు 'యాన్' ఉండాలని చెప్పా కదా ?"...

"మళ్ళీ ఒక తప్పు పోయిందా ?.... 'ఏ'– అంటే ఒకటి అని అర్థం. మరి 'యాన్' వాడకపోతే ఏం ?.... ఈ తిరకాసేంది ?.. ఇంగ్లీషులో. " శిష్యుడన్నాడు– అనవసరమైన ఆవేశంతో.

ఉపాధ్యాయుడు తల పైకెత్తి తన శిష్యుడ్ని చిరునవ్వుతో చూశాడు. ఇంగ్లీష్ ఫస్ట్ రీడర్ పట్టుకొన్న విద్యార్థి చిన్నవాడు– చితుకువాడేమి కాదు.

ఆజానుబాహువు.

మనిషి పొడగరి .. పొడుగ్గు తగ్గ లావు. ఎండలకు, వానలకు తట్టుకొని రాటతేలిన ముఖం. దళసరి కనుబొమలు ఆ కనుబొమల క్రింద సోడా సీసాల్లోని గోలీల్లా రెండు కనుగుడ్లు. ఆ కళ్ళల్లో స్థిరత్వం, ధైర్యం, అమాయకత్వం తొంగిచూస్తున్నాయి.

"ఈ తిరకాసు నేను పెట్టింది కాదు, అది ఇంగ్లీషువాడు పెట్టిందే.... మన తెలుగులో అచ్చులూ, హల్లులూ ఉన్నట్టు ఇంగ్లీషులో కూడా 'కాన్సొనెంట్స్'– అనీ– 'వొవెల్స్' అనీ రెండు రకాలు.... వొవెల్స్ ముందు 'యాన్' ఉండాలని

ఇంగ్లీషువాడి నియమం. వాడి భాషా నియమాలు వాడివి ... వాడు మాట్లాడమన్నట్లు మాట్లాడటం మన ధర్మం...."

"ఇప్పుడు వాడు మనదేశం ఇడిసిపెట్టి ఎల్లిపోయె.... 'ఏ'- అన్నా.. 'యాన్' అన్నా 'ఒకటి'- అని అర్థమయినప్పుడు, రెండింటిలో ఒకదాన్ని తీసేసి, ఇంకొకదాన్నుంచుకొంటే తప్పేంది?..."

"అదంతా తరువాత చూద్దాంలే ముందు నేను చెప్పినట్లు వ్రాయి."

".. నేను రాయను... ఏ యాపిల్ కరెక్టని రైటుగుర్తు పెడితేనే రాస్తాను." మొండివైఖరితో ఇంగ్లీష్ రీడర్ టేబుల్ పై పెట్టాడు. ఉపాధ్యాయుడు హిందూ పైనుండి తల పైకెత్తి కోపాన్ని నటించ సాగాడు.

ఇద్దరి మధ్యా మౌనం- కొన్ని క్షణాలు. అంతలో వార్డర్ చక్రధర్ వచ్చాడు.

"రామరాజుగారూ మీ రిద్దరూ ఇక్కడున్నారా!.... దీని తల్లిసిగ దరగ.... జైలుసుట్టూ తిరగలేక సచ్చి పోయినాను మీకోసం.... మీకు ఉత్తరం వచ్చింది- మీగ్గాదు, ఎంకన్నకు" అంటూ చించి పలిగిపోయిన కవరు చేతిలో పెట్టాడు. జైలర్ ఆ ఉత్తరం చదివి, డిటెన్యూకి పంపాడు- వార్డర్ ద్వారా.

కవరు బరువుగా ఉంది. కప్పపొట్టలా ఉబ్బి.

"సరిగ్గా ఒక ఏడాది సంగతులన్నీ ఒక్కసారే రాపించి ఉత్తరం ఏసినట్టున్నారు మా వాళ్ళు...." అంటూ ఉత్తరం చదవసాగాడు.

మహారాజశ్రీ వెంకటరెడ్డి బావగారికి, బావమరిది లచ్చింపతిరెడ్డి నమస్కారములతో వ్రాయించిన ఉత్తర మేమనగా ....ఇక్కడ మనవాల్లు అందరూ మంచిగానే ఉన్నారు. మనం కౌలుకు తీసుకున్న బూవిలో పనాస జొన్నలు గిద్దెడు మాత్రమే అయినవి, ఎందుకంటే కంకి ఈనినాంక వానకురిసి సుంకంతా రాలిపోయి ఎక్కువ భాగం తప్ప కంకులయినవి. రెండు జల్లల కంకులు కొడితే ఒక గిద్దెడు జొన్నలు రాలటం గగనమయిపోయింది.

అతని కళ్ళలో తళుక్కుమంటూన్న ఆనందం.

అతని పెదవులపై చిరునవ్వులు.

అక్షరాలను పోల్చుకుంటూ మెల్లమెల్లగా చదువుకోసాగాడు- ఆ మాటలు తతిమ్మా ఇద్దరికీ వినిపిస్తున్నాయన్న స్పృహ లేకుండా. వెంటనే ఏదో స్ఫురించినట్లు ఆ ఉత్తరం రామరాజు పైకి విసిరాడు.

"మీరు సదవండి ...నేను ఈ రకంగా చదివితే పొద్దుగూకేలా గుందని"- కామెంట్ చేస్తూ.

నోటు పుస్తకంలోని రూళ్ళకాగితాలు. ఆరుపేజీల ఉత్తరం- గొలుసుకట్టు వ్రాతలో కామాలు, ఫుల్‌స్టాపులూ

కుండా కొండప్రీటి చేంతాడులా ఉంది. త్తరం మొత్తాన్ని ఒకసారి మౌనంగా చదువుకొని రామరాజు బిగ్గరగా చదవ సాగాడు.

....ఇక మాగిపైరుల ఇషయం. నీ రెండెకరాల రేగడని రెండుసార్లు దున్ని గొర్రు మూలసాలు తోలినాను. గడ్డి గాదం- నలీనలుసూ, ఏరిచ్చి మెత్తగా కుంకుమలా చేపించినాను దవియాలు చల్లుదామని. కానీ అదునులో వాన కురవలేదు. కార్తి ఎల్లిపోయినాంక ఒక్క బిట్టతడుపువాన బడ్డది. ఆ వానకు బూవి సరిగ్గా నానలేదు- ఇత్తనం పెట్టటానికి. అందుకని.... "మొలవనియ్యి.... మొల వకపోనివ్వు మనం సెడేది ఇత్త నాలేకదా"ని- ఒక్క ఎకరంలో మాగి జొన్నలు ఏసినాము- నాగటికో సాలు తోలి, రెండో ఎకరంలో ఉలవలు అలుకుడు చేసినాము.

రెండు పైర్లూ బాగా మొలిచినాయి- కాకపోతే పైరు పలచగా ఉంది. ఇప్పుడు మోకాళ్ళ ఎత్తయింది. జొన్న- ఉలవ కూడా పూతకొచ్చింది. ఇంకా నెల రోజుల్లో కోతకొస్తది...."

"ఆగండి... జర్ర- ఆగండి.... రెండున్నరయింది. 'టీ' పెట్టాలి పొయ్యి మీద-ఇగ్గో...సెక్రం, పొయ్యి అంటించి 'ఛాయి' పెట్టు...." అంటూ ఒక బీడి చక్రధర్ పైకి విసిరి తానొక బీడీ వెలి గించుకొన్నాడు. బీడీ వెలిగించుకొన్న చక్రధర్ ప్రక్కనున్న కిచెన్ భాగం వైపు వెళ్ళి పొయ్యి అంటించాడు.

"ఇక చదవండి...." ముందుకు వంగి వినయంగా అన్నాడు.

....'నీ కొడుకు బాగానే ఉన్నాడు. నువ్వు జైలు కెళ్ళినప్పుడు నీ కొడుకు' అంటాడుతుండేవాడు. ఇప్పుడు బాగానే నడుస్తున్నాడు. ఉరుకుతున్నాడు. మాటలు కూడా బాగానే వత్తన్నయి.

'నీ అయ్య ఎటుపోయిండురా' అని అడిగితే,

'అచ్చిపోయిండ'ని మబ్బులంక ఏలు సూపిత్తాడు. అడి ముద్దుముద్దు మాట లింటూంటే మీ అమ్మకు మొలమీద గుడ్డలు నిలవటం లేదు. "ఈడు అచ్చం వాడి- అయ్యాసుమంటోడు.... ఆ సూపు సూడు బొమతలు పైకెత్తుకొని.... పెద్ద పులిలాగ...." అంటూ మనవడ్ని చంక నేసుకొని తెగ మురుసుకొంటది........

....కానీ మీ అమ్మ సంగతే మాకు అనుమానంగా ఉంది.

ఈ మద్దెన మీ అమ్మకు మతి సెడ్డట్టని పిత్తంది. ఎక్కడ సూసినా నీ ముచ్చటే. రెండో మనిషి ఉన్నా ఇనకపోయినా నీ సంగతి గోడుగోడుగా మాట్లాడుతున్నది. జొన్న కోతకు బయలుదేరిపోతన్న కూలి జనాన్ని నడి బజారులో నిలబెట్టి........ "మా ఎంకన్న సంగతి ఎరికనే గదా!.... ఇంకా ఇడిసిపెట్టలేదు జైల్లోనే ఉన్నాడు. వాడి కోసమని నేను












మనాది పెట్టుకోలేదు. పెట్టుకొని మాత్తరం సాధించేదేముంది గనక. ఇగ్గో బతికిన నాల్గురోజులూ సుకంగా బతకాలని మనం అనుకుంటాం గానీ, అది కూడా కేవనే.... ఎందుకంటే పుట్టిన పెతివోడూ బండెడు కష్టాల్లో మగ్గుతూ పోవాల్సిందే. అయితే బూవిమీద బతికిన నాల్గురోజులు వాడు ఎట్టా బతికేడన్నదే ... సివరకు మిగిలిపొయ్యేది .... మన ఊరి దొర సచ్చిపోతే ఒక్కడయినా 'అయ్యో పాపం' అన్న పాపాన పోలేదు కిరాతకపు ముండాకొడుకు_ 'ఊరి పీడా పోయిం'దన్నారు. ఆడు బతికి వున్నాళ్ళూ అందమైన ఆడది కనిపిస్తే సాలు అమ్ముకోసిన అంబోతులా మోరఎత్తి పట్టుకొని సూశేవోడు. సివరకు గుడిపూజారి పెళ్ళాన్నికూడా ఇడిసి పెట్టలేదు... ఇంటున్నారు కదా వాడు చేసిన దురుమార్గాలు. నా కొడుకుని అన్యాయంగా జైలుఖానాలో పెట్టించాడు. నా కొడుకు ఏమన్నాడు?... సెప్పండి దరమం మాట్లాడిండు .. .. ....

.. "బిలాకు ఆపీసోళ్ళు ఊళ్ళో పంచిపెట్టమని ఇచ్చిన కొత్త రకం మాఁవిడిసెట్లు రెండొందలు నీ పెరటిలో పెట్టించుకొన్నావ్? . అవి, నీ తాతగాడి సొమ్మనుకొన్నావాని అడిగిండు...

"మాదిగోళ్ళకిమ్మన్న గవిడిబర్రెల్ని (ముర్రా)ను నీ దొడ్లో కట్టేసుకున్నావ్ అని దొరని దొడ్లో సెమ్మేసి నిలదీసి అడిగిండు. .

"సర్కారోడు_ సన్నకారు రైతులకు పంచిపెట్టమన్న సీమఆవుల (జెర్సీ)ను నీ సట్టాలకు తోలిపెట్టినావ్?.. అని పదిమంది ముందూ అడిగి పరువు తీసిండు....

"గవర్నమెంటోడు మేలురకం అంబోతుని ఇత్తనానికని ఊళ్లో పెంచాయితీకిత్తే దాన్ని దొంగతనంగా పదివేలకమ్ముకున్నావ్?.... నీది ఒక బతుకేనా?

అవి బొడ్డురాయి కాడ నిలదీసి అడిగిండు నా కొడుకు.... అన్ని మాటలడిగిండు కున్న ఎదవ, ఎవడయినా, సీమూ నెత్తు రూంటే ఏ గంగలోనో దూకి సచ్చి పొయ్యేవాడు.... కానీ మానం తక్కువ ఎదవ వాడు.... సిగ్గూలజ్జా పెట్టలేదు బగమంతుడు అడికి.... అడు ఏం జేసిందో ఎరికే గదా మీకు....

"ఉరుకులు పరుగులమీద సైకిలు మోటరెక్కి పట్నం పోయిండు. నా కొడుకు సంగం పెట్టిండని, పోలీసు టానాలో రిపోట్టుసేసి పోలీసులను తోలు కొచ్చిండు నా కొడుకుని జైల్లోపెట్టించి నాంక కూడ అడు అదమరిసి నిద్ర పోలేదు.... ఇంకా నా కొడుకు పార్టీ వాళ్ళొచ్చి యాడసంపుతారోనని, మిలట రోళ్ళను కాపలా పెట్టించుకొన్నాడు నచ్చేదాక.... సివరకు వాడెట్టా సచ్చి పొయ్యాడో తెలుసుగా.... నిక్కట్టపు సావు సచ్చిండు. ముద్లో అరిసెమొల్లలు బుట్టి రకతం కారి కారి సచ్చిండు. పేదు కొని, పేదుకొని సచ్చిండు. వాడికి ఒక్క రోగమా?.... నవాలచ్చ రోగాలు ....పీడి జిమ్మడ...." అని తిట్టుకుంటూ మెటికలు విరుచుకుంటూ అందరితో గంటల తరబడి చెబుతోంది.

ఆమె మాట్లాడేవన్నీ మంచిమాటలే కావీ, ఏదో పిచ్చివాలకం ఉంది. ఆ చూపులో,.... ఆ మాటల్లో. దొరసంగతి వచ్చినప్పుడు పిచ్చినవ్వు నవ్వుతుంటది. ఆమెకి మన ఊళ్ళో కొత్తవాళ్ళెవరూ లేరు. కానీ ఆమె అందర్నీ కొత్త వాళ్ళను పలక్కరించినట్లు పలకరించి సీ సంగతి చెబుతుంటది.

మొన్నమట్టికి మొన్న, కోపేరు ఏసిన ఎడ్లను తోలుకొని నేను చేనికిపోతంటే నన్ను నడిబజార్లో నిలబెట్టి మొదలు బెట్టింది ..

"ఒరేయ్ లచ్చింపతీ .. నా కొడుకుని జైల్లో పెట్టారని నాకేం దిగుల్లేదు. ఏ వాడకు పోయినా, ఎవురిళ్ళముందు నడిసి పోయినా....

"ఎంకన్న తల్లివా?.... రా.... మూసో_".... మని.

"ఎండనబడి వచ్చినట్టుంది . 'సల్ల దాగ'మని.... 'బువ్వ తిన'మని చేతులు పట్టుకొని బతిమా.డతారు ఏ తల్లికున్న దంటావ్?_ ఈ మరియాద, ఆ మరియా దంతా ఎందుకు పేత్తన్నారంటావ్? ... మా ఎంకన్న ఊరికి పేసిన మంచి పనుల మూలంగానే.... ఎవుడయినా రైతు దొరతో పేచీపెట్టుకొని.... 'ఈ యవ్వారం మాట్లాడటానికి నేను ఎంక న్నను తెచ్చుకొంటానంటే అడు వణికి పొయ్యేవాడు... నీ యవ్వ... నా కొడుకు పేరు పెబితేనే దొర ఉచ్చబోసుకొనే వాడు..." అంటూ బిగ్గరగా నవ్వింది.

వెంటనే ఆ నవ్వు టక్కున ఆపి వేసింది. మళ్ళీ కళ్ళు పెద్దగా పేసుకొని నావంక చూసింది. నాకు భయమేసింది.

మళ్ళీ మబ్బులంక సూత్తా మళ్ళీ మెల్లగా మొదలు పెట్టింది.

"ఇదంతా ఎందుకు సెబుతున్నానంటే లచ్చింపతీ.... మా ఎంకన్న పసిగుడ్డు వాడి అయ్య సచ్చిపోయ్యేనాటికి.... ఆరో నెలో, ఏడో నెలో. కాకపోతే ఆడి అయ్యను బగమంతుడు తీసికెళ్ళిండు, ఈళ్ళి పోలీసులు తీసికెళ్ళిపోయిన్రు. అంతే తేడా. ఆ రోజునుంచి నా రెక్కల కట్టం నాది. ఎవుడి ముందూ సెయ్యి సాపకుండ ఆడ్ని బతుకించు కున్నా.... ఆ రోజునుండి ఆడి అయ్య పేరు ఎవుడికీ తెలవదు.... మన ఊళ్లో గానీ, మన ఊరు చుట్టుపట్ల పది ఊళ్ళల్లో అడ్ని... "సీతమ్మ కొడుకు ఎంకన్న" అంటారేగానీ ఏరే పేరు బెట్టి పిలవరు. ఈ జలమకిది సాలు.... బతికినన్నాళ్ళూ 'పదిమందికోసం బతికినోడిదే జలమంటా నేను'.... అంటూ టక్కున మాటలాపి ...."బారెడు పొద్దెక్కినదాకా అరక కట్టనోడివి నువ్వేమి రైతువిరా- ఎదవ సన్నాసి.... అదిరించు ఎల్లనీ"- అంటూ బాటకు అడ్డంతొలిగింది.

ఇవన్నీ ఇపులంగా ఎందుకు రాపిచ్చా నంటే ఊళ్లో చిన్నా పెద్దా అంత తలా ఒకరకంగా సెప్పుకుంటున్నారు. ఏనాడో జరిగిపోయిన సంగతులను తవ్వుకొని, తవ్వుకొని మాట్లాడటం సిన్న సంగతి కాదంట. ఇదేదో 'గాలి' పట్టిందంటన్నారు కొంతమంది పెద్దమనుషులు- ఇవన్నీ పిచ్చిలచ్చనాలు. మైండు సెడిపోయింది. ఎర్రగడ్డకు తోలుకపోయి పెద్ద డాకట ర్లకు సూపియ్యమంటున్నారు. అయిదరా బాద్‌కు పోవటమంటే కరుసుతో కూడిన పని. కనీసం నూటయాభై రూపాయలన్నా కావాలి అందుకని జెత దున్నపోతుల్లో దానటదానిని వచ్చే వారం అంగడికి తోలకపోయి అమ్ముదా మను కొంటున్నాను. అమ్మమంటావో వద్దం టావో ఉత్తరం రాపియ్యి.

ఇట్లు
బావమరిది- లచ్చింపతిరెడ్డి.

రామరాజు ఉత్తరం చదవటం ముగించి నెత్తిమీద పడిన గడ్డిపరకలను విదిలించుకొని తప్పుకేసి చూశాడు.

సమతలంగా ఉన్న దూలంపై పిచ్చి కలు గూడుకట్టటానికి ప్రయత్నిస్తు న్నాయి-

ఎన్నో గడ్డిపరకలూ, ఎంతో పీచూ, ముక్కునకరచి తెచ్చినా, గూడు కుద రటంలేదు. పరకలన్నీ రాలి పడిపో తున్నాయి.

ఉత్తరం ప్రారంభించినప్పుడు అతని కళ్ళలో ఆనందం అదృశ్యమైంది. నిరా శగా నీరసంగా కనురెప్పలు వాలి పొయ్యాయి. కొన్ని నిముషాలు పిచ్చు కలను మౌనంగా పరిశీలించి పెదవులు కదిలాచ్చాడు.

"బట్టలూడదీసికోవటం- మందిని కర వటం.... ఇసుమంటివి పిచ్చిలచ్చనా

లంటారు. మా అమ్మకు పిచ్చికాదా. ఆమె మాటలన్నీ జరిగిన సంగతులే" స్వగతంలా మాట్లాడుకొన్నట్లు పొడి పొడిగా అన్నాడు.

చక్రధర్ టీ కెటిల్ తెచ్చి టేబుల్ పైన పెట్టాడు. రెండు గ్లాసుల్లో 'టీ' వంచి ఇద్దరికీ అందించాడు. వాళ్ళిద్దరూ 'టీ' చప్పరించసాగారు– ఒకరికేసి ఒకరు చూసుకొంటూ.

"మరి ఇప్పుడు ఉత్తరం వ్రాయవా? దీనికి సమాధానంగా" రామరాజు ప్రశ్న.

"రాయను నేనొకటి రాసి వాళ్ళింకొకటి రాసి అనవసర రామాయణం"

"అదేంటి గురూ, స్థిరంగా ఉంది ఉత్తరం రాయవా?– పాపం ముసలమ్మ మీ అమ్మను జైలుకొచ్చి నన్ను చూసి పొమ్మని రాయి" కప్పులో 'టీ' పోసి కాని త్రాగుతూన్న చక్రధర్ జాలిగా సూచించాడు.

"రాయను.... ఎందుకంటే మా ఊరు దగ్గరా దాపూ కాదు. కనీసం పన్నెండు రూపాయల చార్జీలు. రానూ పోనూ కనీసం ఇరవై అయిదు రూపాయలు. ఇక దారి కరుసు– తిండితిప్పలూ అటుంచండి. ఈ ఇరవై అయిదు రూపాయలు వాళ్ళకెవురిస్తారు చెప్పండి. మా చేలో పండే జొన్నలు మాకు నాలుగు నెలల గ్రాసం. మా చేలో పనిలేని రోజున నా భార్య కూలికిపోతది. మా ఊళ్ళో ఆడమనిషి కూలి మూడు రూపాయలే. ఆ మూడు రూపాయల్లోనే బియ్యం, ఉప్పు, నూనె, చింతపండు, కరుసు పెల్లాలి. దాని సంపాదన వాళ్ళు తిండికే సరిపోదు. ఇక నా దగ్గరకు రావాలంటే రోజూ అయిదుపైసలో పదిపైసలో గురిగిలో దాచి పొదుపుచెయ్యాల ఎన్ని అయిదుపైసలయితే ఇరవై అయిదు రూపాయలు కావాలి. అందుకే నా కోసం ఎవరూ రారు జైలుకు అందు కోసమనే నేను ఎవుర్నీ జైలుకు రమ్మని ఉత్తరం రాయను." అతని కంఠం అదోలా మారిపోయి గుటకలు మ్రింగుతూ మాట్లాడాడు. చివరి మాటలో ఆ కంఠం బొంగురుగా, బండగా మారిపోయింది.

నిర్జీవమైన అతని కళ్ళలో స్థిరమైన అభిప్రాయాలు.

'టైం' మూడు గంటలు. చక్రధర్ పళ్ళెంపై గరిటతో కొట్టిన శబ్దం– 'టీ' కోసం రమ్మని ఖైదీలకు పిలుపు. అప్పటివరకు శవాకారంలో ముసుగు తన్నిన ఖైదీలు గ్లాసులు పట్టుకొని డైనింగ్ హాలువైపు రాసాగారు– ఒక్కొక్కరే.

* * *

ఒక నెలరోజుల తరువాత.

ఆవేళ సోమవారం– ఉదయం పది గంటలు.

డిటెన్యూలు కొందరు సింగిల్ రూమ్ సెల్స్ ప్రక్కనున్న నీడలో కూర్చుని సుదీర్ఘమైన చర్చలలో మునిగిపొయ్యారు.

వాళ్ళ మాసిపోయిన గడ్డాలతో, లుంగీలు, బనియన్లపై ఉన్న అల్ప జీవులు.

నియంతృత్వాన్ని ఎదిరించి, నిర్బంధానికి తలవొగ్గని అత్యంత శక్తివంతులు. తమపై ఆధారపడిన కుటుంబ సభ్యుల శ్రేయస్సు విస్మరించిన నిస్వార్థ జీవులు.

....'ఇరాన్ లో కల్లోలం. ఈజిప్టు ఇ జయిల్ యుద్ధం- నమీబియా విప్లవం- మావో మరణఫలితంగా చైనాలో వచ్చిన మార్పులు-' ఇంకా ఎన్నో ఎన్నో విషయాలు.

వాళ్ళ పెదవులపై.... ఉద్యమాలు- పోరాటాలు.

వాళ్ళ కళ్ళల్లో....సుదూర అందాలను చూసే టెలిస్కోపులు.

భూమిచుట్టూ పరిభ్రమించి, పరిభ్రమించి ఇండియా కొచ్చారు వాళ్ళు. మళ్ళీ ఇండియాలో బహుళజాతి సంస్థల పెట్టుబడులను చర్చించారు. దేశంలో ఎమర్జెన్సీ కాలంలో సంభవించిన పరిణామాలు, ప్రభుత్వ ప్రకటనలలోని అంతర్యాన్ని లెక్కలువేసి ఊహాగానాలు చేయసాగారు.

"అందువలన....వచ్చే నెలలో కొందరిని విడిచిపెట్టవచ్చు"- ఒకరి ఊహ.

"మీ అంచనా తప్పు.... మీ రను కున్నట్టు ఎవర్నీ విడిచిపెట్టరు.... ఇదిసి పెట్టేవాళ్ళయితే ఈ సంవత్సరం కొత్త డిటెన్యూలను జైళ్ళల్లోకి పంపరు..." వెంకన్న గొంతు ఖండించింది.

ఆ చర్చలకు అంతరాయం కల్గింది.

"ఇదిగో మైసూర్ పాక్ ముక్కలు- అరటిపళ్ళు. డాక్టర్ సాబ్ పంపారు- తలా ఒక అరటిపండు ఒక మైసూర్ పాక్..." అంటూ పెద్దగా కేకలువేసి కొంటూ వచ్చిన వార్డర్ చక్రధర్ వాటిని పంచ్యాడం చెయ్యసాగాడు- ఎయిర్ బ్యాగ్‌నుంచి.

డిటెన్యూలను చూడటాని కొచ్చిన భార్యాపిల్లలూ, తల్లిదండ్రులూ వాళ్ళ కోసం మిఠాయిలు తీసుకొస్తారు- హాస్టల్లో ఉండే విద్యార్థులకు తెచ్చినట్లు. వాటిని అందరికీ పంచిపెడతారు.

"డాక్టర్ రఘునాధంబాబుగారి భార్యా-కొడుకూ వచ్చారు ఇంటర్వ్యూకి. ఇంటర్వ్యూలో ఆ అమ్మగారితో మాట్లాడటం మానేసి కొడుకుని పట్టుకొని కంటికి, మంటికి ఏకధారగా ఏడిశేసినాడు ....పక్కనున్న సి. ఐ డి. ఇనస్పెటర్ బాబు కూడా కళ్ళనీళ్ళు పెట్టుకున్నాడు ... ఆ బాబుకు కొక్కడే కొడుకంట ఎంకన్నకు నాగ..."

గోదావరి జిల్లాల తెలుగు యాసతో చెప్పుకుంటూ వాటిని పంచుతున్నాడు.

"పట్టు గురూ.... చెయ్యి సాపు.... ఇంకా చాలామందున్నారు.... మీ అమ్మ

మొన్న శనివారం నీకోసం ఏరికెనక్కా- లన్నా తేలేదా?. ఏటి తెచ్చిందో ఎవరికీ పెట్టెయ్యకుండ, గప్‌చిప్‌గా తినీశినావ్. ఎంకన్నా...." అంటూ వెంకన్న చేతిలో పెట్టాడు.

వెంకన్న విభ్రాంతపొయ్యాడు. కొద్ది క్షణాలు గుర్తుప్పగించి చక్రధర్ కేసి చూసి.... "మా అమ్మనా?.... ఎందు కొచ్చింది? రాలేదే?...." అన్నాడు.

"రాలేదా?.... వచ్చింది వెంకన్నా.... అయితే నిన్ను ఇంటర్‌వ్యూకి పిలవలేదా మొన్న?. "

"పరాచికా లాడకు... నిజంగా మా అమ్మ వచ్చిందా?...."

"నిజంగా వచ్చిందాంటే?.... నేను అబద్దం సెబుతున్నా ననుకొంటున్నా వేటి?... నీతో పరాచక మేటి నాకు.... వచ్చింది మి అమ్మనే.. మొన్న శనోరం నాడు నేను నల్లటోపీ వాళ్ళను ఎంటబెట్టీసు కొని గేటుబయట తోటలో పాదులు సేయించటానికి పోతున్నాను... అప్పుడు రావిచెట్టుకింద కూసోని ఉంది మీ అమ్మ ....ఈమెను ఎక్కడో చూసినట్టుందని బుర్ర గోక్కున్నా ...అప్పుడే నీ ముఖం గ్యాపకమొచ్చింది .."

"నువ్వు ఎవర్నో సూసి మా అమ్మ అనుకొంటుంటావ్.... మా అమ్మ ఎట్టుంది సెప్పు?..." వెంకన్న కళ్ళలో సందేహం.

"లేదు వెంకన్నా..." సత్తె పెమానంగా సెబుతున్నాను. .మీఅమ్మనే నయ్యా ... నీకులానే నల్లగా ఉంటది.. కానీ నీ అంత ఎత్తు లేదు. అంతే.... నువ్వు మీ అమ్మ నోటిలోనుండి ఊడి పడినావనిపిస్తది అనుమాన మెందుకని నేను ఆమె దగ్గరకు పోయి 'నువ్వు ఎంకన్న తల్లివా'వి అడిగేశినాను. 'అవ' న్నది. ఇక్కడగాదు- అక్కడ కూసో మని' సూపెట్టి నేను పలోకి ఎల్లిపో నాను .. చానా కష్టంగ అంగలేత్తూ నడి సింది గేటుకాడికి.... వంకాయరంగు ముతక సీరె కట్టుకుంది"....

"సెక్రం .. ఇక సెప్పకు.... ఇక ఇవరాలు అనవసరం మవ్వు సూసింది మా అమ్మనే .. కానీ ఆ లంజకొడుకు జెయిలర్, నాకెందుకు ఇంటర్‌వ్యూ ఇయ్యలేదు. దొంగ బాడఖోవ్ "...అనే శంతో వెంకన్న ఊగిపోసాగాడు. అరటి పండు, మైసూర్‌పాక్ విసిరి పారేశాడు. కళ్ళలో చింతనిప్పులు మండాయి.

"వెంకన్నా .. తొందరపడకు.... వాస్తవ విషయం పూర్తిగా తెలుసు కొందాం"....మిత్రులు హెచ్చరించారు- తినటం ఆపేసి

"వారానికి రెండు ఇంటర్‌వ్యూ లివ్వా లని గవర్నమెంటు రూలుంది కదా! ... మరి నా కెందు కివ్వలేదు.... రాకరాక మా అమ్మ నన్ను సూడటానికొత్తే అడు నాకు ఇంటర్‌వ్యూ ఇవ్వలేదు.... ఏమిటీ అన్యాయం!...." కోపంతో దుఃఖంతో



ఊగిపోతూ బిగ్గరగా కేకలు వేయ సాగాడు. ముఖమంతా చిరుచెమటలతో వాడిపోయింది. పెదవులపైన, ముక్కుపైన ఉన్న సన్నని నరాలు కంపించ సాగాయి

"సెక్రం. గేటులోకి పోదాం పద... వాణ్ని ఈయేళ తంతాను. మపం తప్పు చేసినా సెయ్యకపోయినా ఈడ ఉండక తప్పదు. కాబట్టి వాణ్ని తన్ని ఇక్కడ ఉండిపోతాను. జైలర్‌ను తన్నిన పేరుంటది నాకు.... ఛలో- నీ యవ్వ...." అంటూ విపరీతమైన కోపంతో ఒణికిపోతూ ఒక బీడి వెలిగించాడు.

"అంతే గురూ.... మీరు ఎలాగయినా పెళ్ళాం పిల్లలకు దూరమైపోవారు. విమ్మల్ని ఇంతలో ఇడిశిపెడతారన్న ఆశ లేదు. మరి మీరు ఈ కొడుకులకు ఎందుకు లొంగుండాలో నాకు పెప్పు, నేనంటే నేను డబుల్ మర్డర్ చేసి జైలు కొచ్చేసినాను. మరి మీరు రాజకీయం మనుషులు.... డిటెన్యూలు.... మీరెందుకుండాలిక్కడ నాకు లాగ.... జైలర్ సంగతి తేల్చుకోవాల్సిందే.... దరమం తప్పిన పతి ఎదవకూ బుద్ధి

చెప్పాల్సిందే.... ఇష్టసెక్రం ఇదిసి పెట్టాల్సిందే......" అందరికీ పంచి పెట్టగా మిగిలిన మైసూర్‌పాక్‌లూ, అరటిపండ్లూ మెత్తగా తింటూన్న చక్రధరం, ఆవేశరహితంగా, లయబద్ధంగా హుందాగా ఉపన్యాసమిచ్చాడు.

బీడీ వెలిగించిన వెంకన్న నోట్లో దమ్ములు లాగి అవతల పారేశాడు. జైలర్‌ని కొట్టాలన్న ఆలోచన నిర్ణయంగా మారినట్లు ఛాతీ ఎత్తుగా ఉబ్బింది. పిడికిళ్ళు బిగుసుకున్నాయి. పెద్ద పెద్ద అంగలు వేస్తూ ఆఫీసువైపు కదిలాడు.

"వెంకన్నా.... జైలర్‌ను ఏమీ అనకు.... అందరం పోదాం. ఉండు... మేం అడుగుతాం సూపరిండెంట్‌ని_" అని కేకలు పెడుతూన్న జంగన్న- రామరాజులు అతన్ని అనుసరించబోయ్యారు.

"మీ రెండుకూ?... ఒకవేళ ఆ మాట వాస్తవమయితే వాడు శిక్షార్హుడే ... వాడికొకసారి తన్నులు తగలాలి. . జెయిలర్ తప్పుకు యాక్షన్ తీసుకోకపోతే రేపు మనం నిరాహారదీక్ష చెయ్యాలి.... ఎన్నో అన్యాయాలు జరుగుతున్నాయి ఈ జైల్లో"... అంటూ విద్యార్థి డిటెన్యూలు వాళ్ళను ఆపివేశారు.

* * *

జెయిలర్ ఆఫీసులో జరుగుతూన్న గొడవ విని అందరూ బయటికొచ్చారు. వార్డర్స్ డ్యూటీలో ఉన్న పోలీసులు అందరూ రాబందుల్లా అక్కడ వాలారు.

జైలర్ మీదకు ఆవేశంగా పోతూన్న వెంకన్నను ఇద్దరు పోలీసులు గట్టిగా పట్టుకొన్నారు. జైల్లో నేసిన దుప్పట్లను మడతలు వేస్తూన్న ఖైదీలు ఆ గోలంతా విని, పని మానివేసి అక్కడ గుమిగూడారు.

అంతా గందరగోళ పరిస్థితి.

వాళ్ళిద్దరూ ఎందుకు ఘర్షణ పడుతున్నారో ఎవరికీ అర్థం కావటంలేదు. వెంకన్న తనమీదకు ఎందుకు దౌర్జన్యంగా వస్తున్నాడో జైలర్‌కు స్ఫురించటం లేదు.

ఆ కేకలూ అరుపులూ విని జైలు సూపరిండెంట్ ఆఫీసు బయటికొచ్చాడు_ హేట్ నెత్తిన పెట్టుకొని.వాజూగ్గా లాటీ ఊపుకొంటూ.

"సింగిల్ సెల్‌లో వేయించుతావా నన్ను... నేను మామూలు ఖైదీనను కొంటున్నావా?... నేను డిటెన్యూని గ్యాపకముంచుకో, మామూలు ఖైదీలను బెదిరించినట్లు బెదిరిస్తే నీ అంతు సూస్తా...." గాలిలో చేతులూపుకుంటూ రొప్పసాగాడు_ వెంకన్న.

"ఏమిటి సంగతి? .. ఎందుకు మీరంతా గుమిగూడారు. ఎక్కడివాళ్ళక్కడ వెళ్ళిపొండి"... అధికార కంఠంతో హెచ్చరించాడు సూపరిండెంట్.

"చూడండి సాబ్. అతను వచ్చిన విషయం ఏమిటో చెప్పకుండా నన్ను కొట్టటానికి ప్రయత్నించాడు.... నానా

బూతులూ తిట్టాడు...." జైలర్ అభి యోగం- ఉర్దూలో.

ప్రశ్నార్థకంగా వెంకన్నపై చూపు నిలిపాడు- సూపరిండెంట్.

"సార్.... నా జైలు జీవితంలో నా కోసం ఎవరూ రాలేదు. రాకరాక నా తల్లి -ముసలమ్మ నచ్చిపోవటానికి సిద్ధంగా ఉంది. నన్ను చూసిపోదామని వస్తే పర్మిషన్ ఇవ్వలేదు ఈయన.... మా ఊరు దగ్గరా దపూ కాదు. నల్లగొండ జిల్లాలో ఒక మారుమూల పల్లె ....... చదువురానివాళ్ళకూ, డబ్బులేనివాళ్ళకూ, పలుకుబడి లేనివాళ్ళకూ ఈ జైల్లో స్థానం లేదా ? పేదవాళ్ళంటే ఇతని దృష్టిలో పశువులకన్నా హీనం.... ఒక్కసారి... ఒక్కసారి, మా అమ్మను చూడటానికి నోచుకోలేదా ? నేను".... అతని కంఠం రుద్ధమై రెండు కన్నీటి బొట్లు అతని చెంపలపై జారిపొయ్యాయి.

"ఎందుకు పిలవలేదు వాళ్ళమ్మను.... మీరుచేసే తప్పుడుపనులకు నేనువిమర్శకు గురికావలసి వస్తుంది. నాకు చెడ్డపేరు తెప్పించటానికి కాకపోతే, వెంకన్న తల్లికి ఎందుకు ఇంటర్వ్యూ ఇవ్వలేదు.," అధికార దర్పం ఉట్టిపడే కంఠంతో ఉర్దూలో ప్రశ్నించాడు.

ఆ మాటలు జైలర్‌లో కొంత తొట్రుపాటును కలిగించాయి

"మొన్న వీరితల్లి ఇంటర్వ్యూకోసం రాలేదు సాబ్.... శనివారం ఇంటర్వ్యూ కోసం దరఖాస్తులిచ్చిన లిస్ట్ చూడండి... వెంకన్న కొరకు ఎవరూ రాలేదు."- ఖచ్చితంగా చెప్పాడు జైలర్.

"సరిగా చూడు మళ్ళీ ...వాతో అనవసరంగా వాదించకు. ఆ లిస్టంతా సరిగా వెదికి అమె ఉంటే ఈరోజు ఇంటర్వ్యూ ఏర్పాటు చెయ్యి".... అజ్ఞాపించాడు సూపరిండెంట్ లోనికి వెళుతూ.

"యస్ . సార్".. శెల్యూట్ కొట్టాడు జైలర్.

మామూలు వాతావరణం నెలకొన్నది. ఎవరి పనుల వారు చేసికోసాగారు. జైలర్ తన టేబుల్‌ముందు కూర్చున్నాడు. శనివారంనాటి దరఖాస్తుల ఇంటర్వ్యూల లిస్టుని గుచ్చిగుచ్చి చూశాడు. వెంకన్నకోసమై ఇంటర్వ్యూకి ఎవరూ రాలేదు.

"ఏదీ మీ అమ్మ అప్లికేషన్....నువ్వే చూసుకో లిస్టు"... జరిపాడు ఆ కాగితాలను. అతనికి ఏమీ పాలుపోలేదు. అంతా అయోమయంగా ఉంది చక్రధర్ మాటలు నమ్మి జైలర్‌పై నోరుపారేసుకొన్నందుకు తనకు తానే నిందించుకో సాగాడు.

"మీ అమ్మ పేరు సీతమ్మ కదూ ? .... ఇదిగో సార్ ఖైదీల ఫైలులో ఉంది".... టేబుల్ ప్రక్క చాపమీద కూర్చున్న వార్డర్‌లలో ఒకరు స్లిప్ అందించాడు- బొటనవ్రేలు గుర్తున్న కాగితాన్ని.

"అట్లాగా ఏదీ !" జైలర్ ఆ కాగితం అందుకున్నాడు. ముఖం వెల వెలా పోయింది మళ్ళీ వెంటనే ముఖం గంభీరంగా మారిపోయింది

"ఇదిగో వెంకటరెడ్డీ ఇందులో నీ గూర్చిన వివరాలు ఏమీ లేవు_నీ ఇంటి పేరు లేదు తండ్రి పేరు లేదు నువ్వు యావజ్జీవ ఖైదీవనిగానీ, సాధారణ ఖైదీవనిగానీ, బాల నేరస్థుడవనిగానీ వివరాలు లేవు 'ఆమె నీ తల్లి'— అని నేను కలగనాలనా "_ అన్నాడు.

తల్లి అమాయకత్వానికి, అసహాయతకు లోలోన కృంగిపోయాడు.

"మొన్న మా వెంకన్నను చూపియ్యండయ్యాంటూ నల్లని ముసలమ్మ అందర్నీ అడిగిన మాట నిజమే సార్. కాపీ మన జైల్లో ఉన్న తొమ్మిది మంది ఖైదీలలో ఈ పేరుగలవాళ్ళెవరూ లేరు అందుకని ఇక్కడ లేదని పంపించాం.. ఆమె ఒక్కమాట 'పొలిటికల్ డిటెన్యూ' అన్నట్లయితే ఈ గొడవంతా ఉండేదే కాదు దానికి మనమేం చేస్తాం" జైలర్ మాటలను సమర్థిస్తూ వార్డర్స్‌లో ఒకరు అంటున్నారు.

"ఖైదీలలో లేకపోతే డిటెన్యూలలో చూడవచ్చు కదా అన్నీ నభరాలు కాకపోతే" అంటూ దిగ్గున లేచాడు. పొంగులు వారుతూన్న దుఃఖాన్ని అణచుకుంటూ బరువైన గుండెలతో బయలుదేరాడు_తన తల్లి అమాయకత్వాన్ని ఆలోచిస్తూ.

తన తల్లికి జైలు' అంటే నేరస్థుల నిలయమన్న భావనతప్ప మరొకటి లేదు. తన కొడుకు ఏ రకమైన కారణాల వలన నిర్బంధించబడ్డాడో తెలియని అమాయకురాలు ఆమె పాపం ఆమెకు కనీసం కట్టుకోటానికి సరియైన చీరె కూడా లేకపోయి ఉండవచ్చు. ఏదో ముతక రకం పాతచీరె కట్టుకొని ఉండవచ్చు. పేదరికం ఉట్టిపడుతూన్న తన తల్లి వేషభాషలు చూసి ఆమెనొక డిటెన్యూల తల్లిగా భావించి ఉండరు జైలువాళ్ళు ఏ మర్డరర్ తల్లిగానో, ఏ జేబుదొంగ తల్లిగానో భావించి వెళ్ళగొట్టి ఉంటారు

ఆ విధంగా ఆలోచిస్తూ 'బ్యారక్స్' కేసి వెళ్ళబుద్ధి కాక అరటిచెట్ల నీడలో కూలబడిపోయ్యాడు.

* * *

పదిహేనురోజులు గడిచిపోయ్యాయి.

ఆరోజు సాయంత్రం. ఆరుగంటలు పోలీసులు డ్యూటీలు మారుతున్నారు. ఎత్తయిన ఆ జైలుగోడలమధ్య సంధ్య చీకట్లు దట్టంగా కమ్ముకోసాగాయి. పగలంతా విరగబూసిన గులాబీల రేకులు రాలిపడిపోతున్నాయి.

డైనింగ్ హాలులో వెంకన్న మెస్ లీడర్‌గా తన బాధ్యతలు నిర్వహిస్తున్నాడు. గోధుమరొట్టెలు పీటపై రుద్దు

నీతల్లికి, నీభార్యకి పోట్లాటవస్తే
నీవు ఎవరివేపు పలుకుతావు .

పోట్లాట (పొద్దున్న) వస్తే తల్లి
వేపు, రాత్రికి వస్తే పెళ్ళాంవైపు




తున్నాడు. వంట ద్యూటీపడిన నలుగురు దిటెన్యూలు పిండి పిసుకుతున్నారు.

వెంకన్నకు ఉత్తరం అందించి వెళ్ళిపోయాడు వార్డర్- చించి చదవబడిన ఉత్తరం. తెల్లటి పిండిచేతులతో ఉత్తరం మడతలు విప్పి చదువుకోసాగాడు.

మహారాజశ్రీ వెంకటరెడ్డి బావగారికి బావమరిది లచ్చుంపతిరెడ్డి నమస్కారములతో వ్రాయించిన ఉత్తరం మేమనగా....

మీ తల్లి సీతమ్మగారు, పోయిన బుధవారంనాడు కాలంచేసింది. ఆమె సచ్చిపోయినప్పుడు ఆయినవాళ్ళం మనం ఎవరమూ లేము. ఇక వారం రోజులకు సచ్చిపోతదనంగ ఆమె నిన్ను ఎతుక్కుంటూ వచ్చింది. ఆమె 'సల్ల'మ్మకాని 'పెరుగ'మ్మకాని ముప్పయి రూపాయలు బస్సుచార్జీల కోసమని ఎనకేసింది.

ఆమెకు అయిదారు నెలలనుండి, నీరు సూపించి, కాళ్ళూ సేతులూ తంబాళ్లాగ అయిపోయినయి.

"ఈ బొందిలో జీవుడు ఎల్లిపోయ్యేలోగా మా ఎంకన్నను ఒక్కసారి సూసి సచ్చిపోతా!... వాడ్ని ఎటుతిరిగి ఇడిసి పెట్టరు. నే నే ఎల్లి సూసిరావాలి.... కొడుకుని ఇడిసిపెట్టేదాక నేను బతకను" అని సెబుతూండేది ముసలమ్మ

మీ అమ్మకు సదువురాదు కానీ చాలా దయిర్నం కలది.

నిన్ను సూడాలని బయలెల్లినప్పుడు- 'దగ్గరా దాపా.... నువ్వు ఒక్కదానివే పొయ్యేరాలేవు .. ఎక్కడయినా అర్థం బడిపోతే అక్కడ మనకు దిక్కెవడని-

నాల్గురోజులు ఆగమని' మొత్తుకున్నాం. అయినా ముసలమ్మ ఇనిపించుకోకుండా వెళ్ళింది.

పదిమైళ్ళు కాలినడక నడిసి సూర్యా పేట చేరి వరంగల్లొచ్చిందట. 'మా ఎంకన్నను సూపియ్యమంది. 'మా ఎంకన్నను ఈడనే పెట్టిండంట'- అంటూ జైలుముందు ఒక రోజంతా కూసున్నదంట. అందర్నీ దణ్ణంపెట్టి అడిగిందంట. 'లేద'ని సెబితే కంటతడి బెట్టుకుంటూ ఇంటికి తిరిగొచ్చింది.

మొన్న బుదవోరం పొద్దుగాళ్ళ అమెకింత బెట్టి మేం పొలం పోయినాం. మాగినొచ్చి ఒక్క మునం కోతకోసినామో, లేదో, మా ఎనకనే మనిషొచ్చింది... ఎంకన్న తల్లి ఎల్లిపోయిందని.

మంచంలో పడుకొని ఒక్కటే ఎర్రి కేక పెట్టిందంట.

"ఎంకన్నా!... కొడుకా!.... వచ్చావా!.... నీకోసమే, ఇన్నాళ్ళు బతికినా-" అని లేచి ఎనక్కి ఇరుసుకొని పడిపోయిందంట. ఇరుగుపొరుగంతా చేరి గొంతులో నీళ్ళు పోశారంట. గుటక బడలేదంట అమె కళ్ళరెప్పలు మూతబడకుండా అట్లాగే సూత్తన్నయి- నీకోసం ఎదురుసూత్తన్నట్టుగా.

మనం అనుకుంటాంగానీ, నువ్వొత్తే మాత్రం పొయ్యేపానం ఆగుద్దా- మన పిచ్చిగానీ. అవిడ పొయ్యేరోజు వచ్చింది -ఎల్లిపోయింది. నువ్వు దిగులు పెట్టుకోమాకు. దిగులుపడి నువ్వు మాత్రం సేసేదేముంది? పోయిన మనిషి తిరిగి రాదు కదా?

ముసలమ్మ గొప్ప అదురుట్టం కలది. దాని బలగమంతా వచ్చారు. ఆమెను పారేత్తానికి. పైవచ్చే బుదవోరం పెద్ద దినం. అప్పటికి నువ్వు శెలవు తీసుకొని రావల్సింది.

నమస్కారములతో

బావమరిది- లచ్చింపతిరెడ్డి.

ఆ ఉత్తరం చదివిన వెంకన్న బావురుమని ఏడ్వలేదు.

గుండెల్లో గుబులును, సుళ్ళుతిరుగుతూన్న బాధను పెదవులమధ్యన నొక్కిపట్టాడు. కొండెకట్టిన దీపంలా ముఖం కాంతివిహీనమైపోయింది. పిండి పిసికి అరిపోయి బిగుసుకుపోయిన చేతివేళ్ళను లాక్కుంటూ కూర్చున్నాడు.

అతను ఎంతో కాలంగా- పవిత్రంగా అపురూపంగా దాచుకొన్న తల్లి స్మృతులు కళ్ళముందు పరిభ్రమించ సాగాయి. చివరిసారిగా తన కొడుకుని చూడగలిగానన్న ఆనందం మిగుల్చుకోకుండా చనిపోయిన తన తల్లి, ఆ రోజు తనకోసం జైలుఎదుట రావిచెట్టుక్రింద ఆ ముసలి హృదయం ఎంత తల్లడిల్లిపోయిందో ఊహించుకోసాగాడు.

తనకోసం జైలుఎదుట ఒక రోజంతా పడిగాపులు కాచి, కాచి ఎంత దయనీ

యంగా వెళ్ళిపోయిందో అమె. గేటు నుంచి వస్తూపోతూన్న ఖైదీల ముఖాలను పోల్చుకుంటూ తనకోసం ఎంత వెతి కాయో ఆ కళ్ళు. తన అవసాన దశలో తన కడుపుపంటను ఆఖరిసారిగా చూసి పోటానికొచ్చిన ఆ కళ్ళు తనకోసం ఎంత నిరీక్షించాయో.... తన కొడుకు ఈ జైల్లో లేడని నిర్దాక్షిణ్యంగా జైలర్ పంపినప్పుడు, ఎంత నీరసంగా తన కాళ్ళు వెనక్కి తిరిగి వెళ్ళిపొయ్యాయో– ....ఎన్నో అనుభూతులతో, జ్ఞాపకాలతో హృదయం స్పందించసాగింది. కానీ బొటబొటా కన్నీరు కార్చలేదు. అవి ఏనాడో ఇంకిపొయ్యాయి.

అతని తల్లి మరణవార్త విన్న దిపె న్యూలు ఒక్కొక్కరే ఆ డైనింగ్ హాలువద్దకు రాసాగారు.

"మీ తల్లిగారు పోయారట....పాపం ....ఏమైనా జబ్బా?...."

"ముసలమ్మ లెండి.... పండుటాకు లాగానే రాలిపోయింది..." క్లుప్తమైన సమాధానం, తడిఆరిపోయిన గొంతుతో.

"ఈ ఉత్తరం చూపెట్టి 'టెంపరరీ రిలీజ్'– కొరకు అప్లయిచెయ్యి. కనీసం దినాలకయినా చేరుకో...."

"అసలు మనిషి పోయినాంక ఈ దినాలూ, పిండాకూళ్ళు దేనికి?.... మనిషి సచ్చిపోయినమాట నిజమైనా, పోలీసోళ్ళ 'నిజమ'ని రాసేదాకా గవర్న మెంటు నమ్మదు. అదొక ఒడిసిపోని కత.... అందుకనే ఇడిసిపెట్టేదాకా నేనే పైరవీ సెయ్యదలుచుకోలేదు...." నిశ్చలమైన జవాబు.

ఆ మాటల్లో సూర్యకాంతినీ, చీకటినీ సమదృష్టితో చూసే గంభీరత.

ఆశించిన ఆశయంకోసం, అన్ని కష్టాలూ పడే ధీరోదాత్తత.

ఇంటికి వెళ్ళాలన్న ఆరాటం లేదు. తన వాళ్ళకు ఉత్తరం వ్రాయాలన్న ఉత్సాహం లేదు. అయినవాళ్ళను ఇంటర్ వ్యూకి పిలిపించుకోవాలన్న తపన లేదు.

హిమాలయాల్లా అచంచలమైన వ్యక్తిత్వం.

జైలంతా శూన్యంగా, బోసిబోసిగా ఉంది. సంధ్యకాంతులు అంతరించి పూర్తిగా చీకటి అవహించింది. నల్లని ఆకాశంలో మిణుకుమిణుకు మంటు న్నాయి– శతకోటి నక్షత్రాలు– ఉరితీయ బడిన అమరవీరుల శిరస్సుల్లా. కత్తిరించి పారవేసిన చిటికెనవ్రేలు గోరులా– పారిపోయిన చంద్రుడు తూర్పువైపు సెంట్రీగోపురంపై నిలబడ్డాడు. శవాన్ని పారవేసి వచ్చిన బంధువుల్లా వెంకన్న చుట్టూ మౌనంగా నిలబడ్డారు దిపెన్యూలు.

ఏకాకితనం నిండిన జైలు– మానవుల మధ్య నిర్మానుషత్వం నిండిన జైలు. 'నిన్న'కు– 'నేడు'కు– 'రేపు'కు– వ్యత్యాసంలేని జైలు.

# మార్చి నెల యువ

# భావ పరిచయ పోటీ

**బహుమానము రూ. 25-00**




**ఈ కార్టూనుకు హాస్యయుత వ్యాఖ్య ( Caption ) కావాలి.**

గమనిక : **వ్యాఖ్యలు పోస్టుకార్డుపై వ్రాసి మార్చి 23 వ తేదీలోగా పంపవలెను.**



# మృత్యువెరుగని మృత్యువు

పాలకూర సత్యలత

ఉదయం ఏడుగంటలయ్యిందికదా అవి 7 O' clock బ్లేడుతో అద్దంలో చూసుకుంటూ గెడ్డం చేసుకుంటున్నాను.

వంటింట్లో ఒక వైపు కాఫీ తయారుచేస్తూ ఇంకో చేత్తో పేపరు చదివేస్తోంది నా భార్యారత్నం సువర్చల. చేత్తో చదువుతోందంటే అర్థం కళ్లతో చదవటం లేదని కాదు.

"ఏమండోయ్ .." గట్టిగా అరిచింది.

ఆ అరుపుకి అదిరిపడ్డ నేను బుగ్గమీద గాటు చేసుకున్నాను. అందుకు సువర్చలమీద కోపం వచ్చినా తమాయించుకున్నాను.

"ఈ విచిత్రం విన్నారా?" అంది.

"ఏమిటి? మీ తమ్ముడికి ఈ ఏడు డాక్టర్ డిగ్రీ వచ్చేసిందా?" అన్నాను.

అవును మరి! వాళ్ల తమ్ముడు పన్నెండు సంవత్సరాల నుంచీ ఎంబీబీఎస్ చదువుతున్నాడు. ఈ ఏడు డిగ్రీ వస్తే అది విచిత్రం కాదా?

"చాల్లెద్దురూ! ఎంతసేపూ మీకు వాడిమీదే దృష్టి...." అంది చిరుకోపంగా.

"అయితే మీ బావగారు పిల్లలు పుట్టకుండా ఆపరేషన్ చేయించుకుని వుంటారు. అదేనా విచిత్రం?" అన్నాను.

వాళ్ల అక్కయ్యకి ఎనమండుగురు పిల్లలు. ఇక ఆపరేషన్ చేయించుకోమని ఆవిడ భర్తని ఎంతగా పోరినా ఎందుకనో ఆయనకు ఆ విషయం పట్టదు. అందుకావిడ బాధపడని క్షణంలేదు.

"పొద్దున్నే మావాళ్లని దుయ్యబట్టడం మొదలుపెట్టారేం?" అది కాఫీగ్లాసు అందిస్తూ.

"అయితే మీ నాన్నగారు తప్పకుండా పేకాట మానేసివుంటారు. ఇంతకంటే

విచిత్రం మరొకటి వుండదు...." అన్నాను కాఫీ త్రాగుతూ.

"నా ముఖం! మీరు నామాట పూర్తిగా విప్పించుకోరు..." అంది కోపంగా. ఆమెకు మరింత కోపం తెప్పిస్తే ఇక ఇంట్లో శాంతి కరువవుతుందనే భయంతో మరేం మాట్లాడలేదు.

"చచ్చిన మనిషి బ్రతకడమే నేను చెప్పిన విచిత్రం...." అంది.

ఆ మాటతో ఆశ్చర్యం వేసింది. గొంతులో పోసుకున్న కాఫీ క్రిందకి దిగలేదు. పైకి రాలేదు. శివుడు గొంతులో విషం వుంచుకుని గరళకంఠుడైనట్లు నేను కాఫీ కంఠుడనయ్యాను.

ఏలాగో కాఫీని మింగి విషయం ఏమిటన్నట్లు కనుబొమ్మలు ఎగరేశాను. మరేం మాట్లాడకుండా ఆనాటి పేపరు నాకిచ్చి ఒక వార్త దగ్గర వేలుపెట్టి చూపించింది.

కళ్లు అక్షరాల వెంబడి పరుగెత్తాయి.

"చనిపోయిన వ్యక్తి బ్రతికిన వైనం

హైద్రాబాదు: మార్చి 19, ఈరోజు మలక్ పేటలో సోమలింగం అనే వ్యక్తి లారీప్రమాదంలో చిక్కుకుని అక్కడికక్కడే మరణించాడు. పోలీసు తతంగం జరుగుతుండగా గెడ్డాలు, మీసాలు పెంచుకుని పట్టుపంచతో, భుజంమీద 'హరే రామ హరేకృష్ణ' రాసివున్నబట్టతో వున్న ఓ వ్యక్తి వచ్చి తను 'మృత్యుంజయస్వాములు' అనీ, చనిపోయినవారిని బ్రతికించే శక్తి హిమాలయాల్లో నేర్చుకున్నానని' అన్నాడు. తన విద్య చూపించడానికి ఇదొక అవకాశంగా భావిస్తానని అన్నాడు. ఆ చనిపోయిన సోమలింగం శరీరాన్ని ఒక్కసారి తడిమి ఆ శవం చెవిలో ఏదో చెప్పాడు. మరుదికోసం బ్రతికి వచ్చిన ప్రమదలా ఆ సోమలింగం లేచికూర్చుని తన కేమయిందని ప్రశ్నించాడు. అందరూ ఆశ్చర్యంతో నిలబడిపోయారు. ఆ లారీ డ్రైవరు పోలీసుకేసునుంచి బైటపడ్డ సంతోషంతో జేబులోవున్న రెండువందలు స్వాములవారికిఇచ్చేరు. సోమలింగంకూడా జేబులో వున్న అయిదొందలు స్వాములవారికిచ్చి నమస్కారం చేశాడు. పోలీసులుకూడా కేసు త్వరగా ముగిసినందుకు ఆనందించేరు.

ఆ తరువాత శ్రీ మృత్యుంజయ స్వాములవారితో పత్రికలు ప్రత్యేకంగా సంభాషించగా వెలువడ్డ వివరాలు ఇవి:.

ఆయన గత ఇరవై సంవత్సరాలుగా హిమాలయాల్లో తపస్సు చేస్తున్నారు. అనేక మహానుభావులకి సేవచేశారు. పూర్వజన్మ సుకృతంవల్ల చనిపోయిన వారిని బ్రతికించే విద్య అలవడింది. అందుకు వెనుక ఎన్నో సంవత్సరాల కృషి వుంది.

ఆ విద్యవల్ల ప్రజలకు మేలు కలగాలనే సదుద్దేశ్యంతో హిమాలయాలు విడిచి హైద్రాబాదు వచ్చారు. ఇక్కడికే



రావడానికి కారణం ఆయన ఆంధ్రుడు కావడమే. ప్రస్తుతం ద్వారకా హోటల్ రూము నెంబరు 116లో వున్నారు. ప్రజా సేవచెయ్యడంలో వున్న ఆనందం మరి ఎందులోనూ లేదని అన్నారు. సోమ లింగంని బ్రతికించినందువల్ల వచ్చిన డబ్బు తన కనీసావసరాలకి మాత్రం వాడుకుంటాననీ, వైభవంగా బ్రతకడం పట్ల తనకి విముఖత వుందనీ ప్రకటిం చారు.

ఏమైనా ఇలాంటి సంఘటన జరగటం సృష్టిలోనే అపూర్వం. ఈ విద్యని, సాధించిన శ్రీమృత్యుంజయ స్వాముల వారు నిజంగా అభినందనీయులు.

కలయో, నిజమో, వైష్ణవమాయో తెలిసీ తెలియని అయోమయమో అన్నట్లుగా నిలబడిపోయాను. చేతిని గిల్లుకుని చూస్తే అది కలకాదు అని తెలిసింది.

"మీరు ఇంకా రెండో పక్క గెడ్డం

గీసుకోనేలేదు." అని సువర్చల గుర్తు చేస్తేనే కానీ ఈ లోకంలోకి రాలేదు.

కాలకృత్యాలు తీర్చుకుని ఆఫీసుకి వెళ్ళినా ఆయన గురించే ఆలోచనలు. వైద్యశాస్త్రంలో ఇంతవరకూ సాధించలేకపోయిన గొప్ప విషయం ఇది. అభివృద్ధి చెందిన ఏ దేశమూ చెయ్యలేకపోయిన మహాకార్యం ఇది. ఈ మృత్యుంజయ స్వాములువారు నిజంగా దేవుడో లేక దేవదూతో అయివుండాలి.

ఆఫీసైపోయాక తిన్నగా ద్వారకా హోటల్ వైపు పోనిచ్చాను స్కూటర్‌ని. 116 నెంబరు గది తలుపులు తెరిచే వున్నాయి పేపర్లో చదివిన వివరాల వల్ల స్వాములవారిని వెంటనే పోల్చుకున్నాను. ఆయన ఎవరితోనో మాట్లాడుతున్నారు.

"బాబూ! నా చర్మం చెప్పులు కుట్టి ఇస్తాను. మానాన్నను బ్రతికించండి.." అంటున్నాడతను

"నాకు చెప్పులు అక్కర్లేదు. ఏ 'బాటా' షాపుకి వెళ్ళినా బోలెడు దొరుకుతాయి" అన్నారు స్వాములవారు. ఆయనలో హాస్యప్రియత్వం వుంది

"పెద్ద రూపాయల కంటే ఎక్కువ ఇచ్చుకోలేను," అతను అన్నాడు "మాటిమాటికీ అదే విషయం నా చేత చెప్పించకు పాతిక వేలకు తక్కువైతే కుదరదు నువ్వు మధ్య తరగతి వాడివి కనుకనే ఈ రేటు. లక్షాధికారివైతే రేటు లక్షల్లో వుంటుంది..." అన్నారు స్వాములవారు.

"నాకంత శక్తి లేదు. వస్తాను స్వామీ మరి...." అంటూ అతను బైటకు వచ్చాడు. నేను అతన్ని ఫాలో అయ్యాను.

అతన్ని ఆపి వివరాలు అడిగేను.

ఆ వ్యక్తి పేరు రాజరత్నం. మధ్య తరగతివాడు. హార్ట్ఎటాక్‌వల్ల అతని తండ్రి మరణించాడు. పేపర్లో స్వాములు వారి గురించి విని తండ్రిని బ్రతికించుకుందుకు వచ్చాడు. అందుకు పాతిక వేలు అడిగేరు ఆయన. ఇది తన వ్యాపారం అనీ తద్వారా కోటీశ్వరుడు కావాలన్న తన ఆశయం అనీ ఆయన చెప్పారట. వైభవంగా బ్రతకాలని లేదని పేపర్లో ఇచ్చిన స్టేట్‌మెంట్ అంతా బూటకమనీ తను డబ్బు మనిషిననీ ఆయన అన్నారట. ఆ తర్వాత అతను వెళ్ళిపోయాడు.

నాకు చాలా ఆశ్చర్యం వేసింది. ఈ విద్య ద్వారా బోలెడు డబ్బు సంపాదించాలన్నదే ఆయన ఆశ అన్నమాట. చచ్చినవాడిని బ్రతికించ గలిగే వ్యక్తి త్వరలోనే లక్షాధికారుల ఆశ్రయం సంపాదించగలడు. లక్షలు గడించగలడు. ప్రపంచంలో ఏ వ్యాపారంలోనైనా నష్టం, కష్టం వుండవచ్చుగానీ ఈ వ్యాపారంలో అలాంటి అవరోధాలు వుండవు. ప్రపంచంలో ఎవ్వరూ చెయ్యలేని పని చేసినందుకు కీర్తి, వ్యాపార దృష్టితో ఆ పని చేస్తున్నందుకు డబ్బూ-

రెండూ లభ్యమవుతాయి. ఈ లెక్కన ఆయన ప్రపంచంలోనే పెద్ద కోటీశ్వరుడు కావడానికి ఎక్కువ సమయం అక్కర్లేదు.

ఇలా ఆలోచించేసరికి నాకూ కూడా ఆశ పుట్టింది. ఎలాగోలా ఆయన ప్రాపు సంపాదించి ఆయనకు అసిస్టెంట్‌గా వుండే కనీసం నేనూ లక్షాధికారిని కావచ్చేమో! ఆయనకు సేవలు చేస్తూ ఆ విద్య నేను కూడా నేర్చుకుంటే కోటీశ్వరుడిని కాగలనేమో!

ఉదయం పేపర్లో వార్త చదివి ఆయనపట్ల పెంచుకున్న పూజ్య భావంతో ఆయన్ని దర్శించాలని వచ్చాను కానీ ఆయనకున్న వ్యాపారదృష్టి చూసేక ఆ పూజ్యభావం నశించి నాలో కూడా ధనదాహం బయలుదేరింది. ఇప్పుడు ఆయన్ని చూడాలన్న కోరిక లేదు. ఆయన వ్యాపారం ఎలావుందో కొన్నాళ్లు వేచి చూసి, ఆ తర్వాత ఆయన శిష్యరికం గురించి ఆలోచించాలి అనుకుంటూ తిరుగుముఖం పట్టాను.

* * *

ఈ వారం రోజులూ ఆయన గురించి వివరాలు సేకరిస్తూనే వున్నాను. హైద్రాబాదులో ఒక పారిశ్రామికవేత్తను ప్రతిష్ఠించినందుకు బంజారాహిల్స్‌లో ఒక పెద్ద భవనం బహుమతిగా ఆయన గ్రహించారు. ఒక రాష్ట్రమంత్రిని ప్రతిష్ఠించి నాల్గు లక్షలు గ్రహించి ఒక కారు కొన్నారు. విమానంలో బెంగుళూరు వెళ్ళి ఒక కన్నడ తారను ప్రతిష్ఠించి కొన్ని లక్షలు గడించారు. ఇంకా కొన్ని చిల్లర కేసులు చేపట్టాయిగానీ ఆ వివరాలు అంతగా తెలియలేదు. ఇవన్నీ జరిగాక ఇక ఆలస్యం చెయ్యకూడ దనిపించింది.

ఆ రోజు ఆఫీసుకి ఎగనామం పెట్టి బంజారాహిల్స్‌లో ఆయన ఇంటికి వెళ్ళాను ఎవరో పెద్ద పోలీసాఫీసరు పోతే ప్రతిష్ఠించడానికి వెళ్ళారట. మధ్యాహ్నం దాకా రాలేదు. సాయంత్రం నాల్గు గంటలకు వచ్చారు.

"ఇవే నా హృదయ పూర్వక నమస్కారాలు" అన్నాను రెండు చేతులూ జోడించి.

"ఎవరు పోయారు? ఈ పూళ్ళో నేనా?." అన్నారాయన వ్యాపార పరంగా.

"నేను ఆ పనిమీద రాలేదు" అన్నాను

"మరి-"

"మీరు నాతో ఒక్క పావుగంట గడపగల్గితే అంతా చెప్తాను." అన్నాను.

"సరే! " అంటూ సోఫాలో కూలబడ్డారు. నన్నూ కూర్చోమన్నారు. ఆ సోఫాలు చాలా కొత్తగా వున్నాయి. ఎవరు ఇచ్చిన డబ్బుతో కొన్నారో మరి.

"ఏ దారీ లేక మీ దగ్గరకు ఉద్యోగం కోసం వచ్చానని అనుకోకండి. నాకిప్పుడు నెలకి పదిహేను వందలు సంపా

దించే ఉద్యోగం వుంది. మరీ గొప్ప వాడిని కాకపోయినా కొంచెం పేరున్న కథా రచయితని కనుక ఆ రకంగా కూడా కొంత ఆదాయం వస్తుంది. మీరు మానవాళికి చేస్తున్న ఈ మహోపకారంలో నేను కూడా కొంత భాగం తీసుకోవాలనే ఉద్దేశ్యంతో అడుగుతున్నాను. నాకు మీ దగ్గర ఉద్యోగం ఇయ్యండి. మీకు సెక్రటరీగా వుంటాను. మీరు ముందు ముందు ఇంకా చాలా బిజీ తయారవుతారు. మీ ప్రోగ్రాములు సెట్ చెయ్యడానికీ, ఇతర విషయాలు చూసుకుందుకూ నేను ఉపయోగిస్తాను. చల్లకొచ్చి ముంత దాయడం ఎందుకని సూటిగా అడిగేను.

ఆయనేం మాట్లాడలేదు. నేనూ ఏమీ అనలేదు.

ఆ తర్వాత సన్నగా నవ్వి అన్నారు.

నువ్వు అడిగిన విషయం కన్నా అడిగిన తీరు బాగుంది. కాదని అనలేకపోతున్నాను. నువ్వు చెప్పినది నిజమే. బేరాలు కుదర్చడం, డబ్బు విషయం చూడటం, ప్రోగ్రాములు ఫిక్స్ చెయ్యడం- వీటికి మనిషి కావాలి. ఆ మనిషి నువ్వేలే.. " అన్నారు.

అంత త్వరగా విషయం ముగిసినందుకు సంతోషించాను.

ఆ మర్నాడు కలుస్తానని వచ్చేశాను.

నా నిర్ణయం పట్ల సువర్చల విముఖత చూపింది.

ఆమెకు ఇప్పుడు అర్థం కాదు. తర్వాత అదే తెలుస్తుంది.

ఉద్యోగానికి రాజీనామా ఇచ్చాను. ఇప్పుడు మృత్యుంజయస్వాముల వారి తోనే నేనూను.

రెండు నెలలు గడిచేసరికి నేను ఆయనకు కుడి భుజం అయ్యాను.

ఆయన వ్యవహారాలు అన్నీ నేనే చూస్తున్నాను. ఆయన్ని డైరక్టుగా కలుసుకోలేరు ఎవ్వరూ. డబ్బు విషయంలో ఆయన సిద్ధాంతం నాలోనూ జీర్ణించుకుంది. బేరంలో ఎటువంటి తగ్గింపులూ ఒప్పుకోను. కనికరం అనే విషయం లేదు.

కనీసపు రేటు పాతిక వేలు. ఒక్కొక్కసారి పాతిక లక్షలవరకూ రేటు వెళ్లేది.

మృత్యుంజయస్వాములవారు రావడంతో చాల గొప్ప మార్పులు వచ్చాయి దేశంలో. ఏ మంత్రిగారో చనిపోతే మిగతా అందరూ మొసలి కన్నీరు కారుస్తూ "దేశం ఒక నిష్కళంక దేశ భక్తుడ్ని, ప్రజా సేవకుడని కోల్పోయింది. ఆయన లేని లోటు తీర్చలేనిది. " అనే స్టేట్‌మెంట్స్ పోయాయి. వెంటనే స్వాములవారిని పిలిపించడం జరిగేది.

ఒకసారి ఒక విచిత్రం జరిగింది. ఒక మంత్రి చనిపోతే అలవాటుగా సంతాప దినమని శలవు ప్రకటించ

బడింది. మరో గంటలో ఆ మంత్రి స్వాములవారివల్ల బ్రతికేరు. ఆయన బ్రతికినందువల్ల శెలవు రద్దుచేసినా ఎవరూ ఆఫీసులకి రాలేదు.

సినిమా తారల అభిమానులకి చాలా ఆనందంగా వుంది. ప్రమాద వశాన తమ అభిమాన నటుడు లేదా నటి చని పోయినా పుష్కలంగా డబ్బు ధారబోసి తిరిగి బ్రతికియ్యగలడన్న నమ్మకం అభిమానుల్లో కల్గింది.

క్రానిక్ జబ్బులతో బాధపడే లక్షాధి కారులు తమకు వైద్యం చేస్తున్న డాక్టర్లని దూరంగా తరిమేశారు. "రోజూ మీరిచ్చే మందులు, ఇంజక్షన్లు తీసుకోలేం అని మానేస్తే ఏమవుతుంది? చస్తాం.... అంతేగా. లక్షలుపోసి మళ్లీ బ్రతికేస్తాం గానీ ఈ వెధవ మందులు వాడే ఓపిక లేదు మాకు." అనేవారు.

పెద్ద పెద్ద పేరుపొందిన డాక్టర్లు స్వాములవారి అద్భుత శక్తికి ఆశ్చర్య పడి, ప్రాణరక్షణ రహస్యం తెలియక ముక్కులమీద వేళ్లు పెట్టుకొని నిర్మొహ మాటంగా చెప్పాలంటే అసూయపడి పోతున్నారు.

ఆదివారం అనుబంధంతో మృత్యుం జయ స్వాములవారితో ఇంటర్వ్యూ ప్రచురించారు. "మృత్యువుకే మృత్యువు తెచ్చిన శ్రీ మృత్యుంజయ స్వాముల వారు" అంటూ ఆయన్ని ప్రశంసించారు- 'మృత్యువు అనేది ఎప్పుడూ వుండేదే. యుగయుగాలుగా వుంది. వుంటుంది. దాని ఉనికికి చావులేదు. కానీ, మృత్యువు మృత్యుంజయ స్వాములవారి చేతిలో మృతి చెందింది ... 'అంటూ రాశారు.

స్వాములవారి జీవనస్థాయిలో పెద్ద మార్పు వచ్చిందని చెప్పక్కర్లేదు. ఆయన నేలమీద నడవడు. మంచినీళ్లు కాక మధుర రసాలు సేవిస్తున్నారు, ఆయన కట్టేబట్టలతో నాల్గు మధ్యతరగతి కుటుంబాలు ఆర్నెల్లు ఈజీగా బ్రతకవచ్చు.

ఆయన ప్రాపు సంపాదించినందుకు నాక్కూడా కొద్దోగొప్పో పేరువచ్చింది. నేనూ నలుగురిలోనూ గుర్తింపబడ్డాను. మరో నెల గడిచేసరికి నాలో ఒక గొప్ప ఆలోచన వచ్చింది. అదేమిటంటే—

మృత్యుంజయస్వాములవారికి చని పోయిన వాళ్ళని బ్రతికించడం తెలుసు. బ్రతికున్నవాడికే ఏదో మంత్రం వేసి అసలు చావనేది ఆ వ్యక్తిని చేరనియ్యక పోవడం ఆయనకు తెలియదు. చావనేది వస్తుంది. ఆ తర్వాత ఆ చావుని దూరం చేస్తారు ఈయన.

అందరినీ వంచే మృత్యువు ఏదో రోజు మృత్యుంజయ స్వాములవారిని కూడా కౌగిలించుకుంటుంది. అప్పుడు ఆయనను బ్రతికించేది ఎవ్వరు? ఆయన తిరిగి బ్రతకక్కపోతే ప్రపంచానికి తీరని అన్యాయం జరిగిపోతుంది. బ్రతికించ గలిగే విద్య కనీసం మరొకర్కిరికి

ఆయన నేర్పి తీరాలి. అప్పుడే ఆయన తిరిగి బ్రతక గలిగేది. ఇతరుల్ని బ్రతికించగలిగేదీనూ. అయితే ఈ విద్య ఇంకెవ్వరికీ నేర్పుతారు . . . ఆయనకి కుడిభుజంగా వుంటూ ఉన్న నాకే నేర్పాలి. ఆయన నేర్పుతారా.

ఆయనతో మాట్లాడాలి.

ఆ మర్నాడు సాయంత్రం ఆయన తీరిగ్గా వున్నపుడు ఆయన్ని కదిపాను. నా ఆలోచనా తరంగాలు ప్రవహింప నియ్యక ముందుగా "స్వామీ! మిమ్మల్నే నమ్ముకున్న నా కూడా ఈ విద్య నేర్పండి.." అన్నాను. ఆయన గట్టిగా నవ్వారు. 'ఓరి వెర్రివాడా!' అన్న అర్థం నవేట్లు వుంది ఆ నవ్వు. అమా యకుడైన బీద పిల్లవాడిని చూసి నవ్వే భూకామందులా వుంది ఆ నవ్వు.

ఆ కర్వాత ఆ విద్యవల్ల బాగుపడేది ఆయనే ఒపి నచ్చచెప్పాను. "మీ గురించి ఆలోచించండి. మీరు చనిపోతే ఎలా బ్రతుకుతారు తిరిగి?" అడిగేను

ఆయన ఆశ్చర్యంతో తలమునక లయ్యాడు. ఆ ఆలోచన ఇంతవరకూ రానందుకు తనని తానే నిందించుకు న్నాడు. మోక్షలాంటి ఆలోచన నాలో కలిగినందుకు అబ్బురపడ్డాడు.

"శుక్రాచార్యుడు కచుడికి మృత సంజీవినీ విద్య నేర్పడానికి కారణం కూడా తను తిరిగి బ్రతికి బట్టకట్టాలనే ...." అన్నాను.

"ఆ మాట నిజమే. కానీ ఆ నాటి శుక్రాచార్యుడు వెర్రివాడు కనుక కచుడు ఆ సంగ్రతాన్ని కర్వాతకూడా ఉపయో గించుకోనిచ్చాడు. కానీ నేను అలా చెయ్యను. నేను నీకు నేర్పే ఆ విద్య కేవలం నన్ను బ్రతికించడానికే ఉప యోగించాలి. నాకు పోటీగా మరో మృత్యుంజయస్వాములు తయారు కాకూడదు...." అన్నారు ఆయన దీర్ఘంగా ఆలోచిస్తూ.

"నాకు ఏ లాభమూ లేనప్పుడు నేను ఎందుకు నేర్చుకోవాలి?" అన్నాను కొంచం తిక్కగా.

నేను ఆయనలో ఈ ఆలోచన నాట గానే తన బ్రతుకు గురించి ఆయనకే చింత పుడుతుంది. అప్పుడు నాకు లాభం కలిగేట్లుగా ఆయనే ఏదో చేస్తాను.

ఆయనకు పచ్చి వెలక్కాయ నోట్లో పడినట్లు అయ్యింది. కాల్లో ముల్లుగుచ్చు కున్నట్లు అయింది. కూర్చున్న చోట మంట పెట్టినట్లు అయ్యింది.

"ఈ విషయం గురించి రేపు మాట్లా డదాం...." అంటూ లేచిపోయాడు అక్కడ్నుంచి.

ఆ మర్నాడు ఈ విషయం ఆయనే కదిపారు.

"చూడు ప్రద్యుమ్నా! నేను పూర్తిగా మరిచిపోయిన ఒక విషయాన్ని నాకు గుర్తుచేసి చాలా మేలు చేశావు. నేను చనిపోయినపుడు నన్ను బ్రతికించే ఓ

వ్యక్తి కావాలి. ఆ వ్యక్తివి నువ్వే అవుతావు. ఆ తర్వాత నీవల్ల నా వ్యాపారం దెబ్బతిని నేను చెడిపోకుండాను, నన్ను బ్రతికించే శ్రమ తీసుకున్నందుకు నువ్వు లాభపడేట్లుగా న్యూ- ఒకలా చేద్దాం.

"నేను నీకు ఒక కోటి రూపాయలు ఇస్తాను. అది నువ్వు నన్ను బ్రతికించేందుకు నేను ఇచ్చే ఫీజు అనుకో. ఈ విద్యని నువ్వు కేవలం నీ ఫ్యామిలీ మెంబర్లు పోయినప్పుడు మాత్రమే ఉపయోగించుకోవాలి. బయటవాళ్ళకి ఉపయోగించనని నువ్వు ఒక నోటు రాసివ్వాలి.

"అలా అయితే నీకు విద్య నేర్పుతాను. ఆలోచించుకో." అన్నారు.

"ఫ్యామిలీ మెంబర్సు అంటే" అన్నాను.

"ఈ విషయంలో ప్రభుత్వంవారి L.T.C. రూల్సు అనుసరిద్దాం. నీ భార్య, పిల్లలు, ఆధారపడిన తల్లిదండ్రులు, పెళ్ళికాని చెల్లెళ్ళు, ఉద్యోగంలేని తమ్ముళ్లు .... నీ ఫ్యామిలీ మెంబర్సు. వీళ్ళు కాక ఇంకెవ్వరు పోయినా, బ్రతికించుకోవాలనుకుంటే నా దగ్గరకే రావాలి. బయటి వాళ్లతో ఈ వ్యాపారం చెయ్యకూడదని ముందే చెప్పాను. ఈ నిబంధనల మేరకు ఒక పత్రం రాసి సంతకంచేసి ఇవ్వు. ఆ తర్వాత విద్య నేర్పుతాను. నేను చనిపోయినపుడు మాత్రం ఇంకేం ఆలోచించకుండా వెంటనే నన్ను బ్రతికించాలి." ఆయన గొంతు స్థిరంగా వుంది.

ఆలోచించాను. బేరం లాభసాటిగానే వుంది. వెంటనే ఒప్పుకుని పత్రం రాసి ఇచ్చాను. రెండు రోజుల్లో ఆ విద్య నేర్చుకున్నాను. కోటి రూపాయలు స్వంతం చేసుకున్నాను.

ఇప్పుడు నా లివింగ్ స్టాండర్డు పెరిగిపోయింది. నాలుగు అంతస్థుల స్వంత భవనం తయారుచేసుకున్నాను. అంబాసిడర్ కారు కొన్నాను. ఇంట్లో అంతా ఇంపోర్టెడ్ వస్తువులు. నా పెళ్ళాను నువర్ణాల పట్టుచీరలు తప్ప కట్టదు. ఒకసారి కట్టిన చీర మళ్ళీ కట్టవద్దని చెప్పాను. మా పిల్లలు ఇద్దరూ ఇదివరకు రిక్షాల్లో స్కూలుకి వెళ్ళేవారు. ఇప్పుడు కార్లో వెళుతున్నారు.

నాకు ఈ విద్య నేర్పినప్పట్నుంచీ దాన్ని ప్రాక్టికల్‌గా చూడాలని కోరికగా వుంది. కానీ అది తీరే దారి కనిపించటంలేదు. నేను బ్రతికించగలిగిన వారి లిస్టులో వాళ్ళు ఎవ్వరూ చావటం లేదు. బయటి వాళ్లను బ్రతికించలేను.

ఒకరోజు కోర్టుయార్డులో నేను వుండగా మాధవ అంతస్తు కిటికీలోంచి మా బాబు నన్ను చూసి,

"డాడీ! ఎక్కడైనా వెళ్తున్నారా?" అన్నాడు.

"అవును. ఏం?"

"నన్నూ తీసుకువెళ్లండి. సరదాగా వస్తాను ." అన్నాడు.

అప్పుడే ఆలోచన వచ్చింది.

"అక్కడ్నుంచి క్రిందకు దూకెయ్యి, వెళ్లిపోదాం....అన్నాను.

"పడిపోనూ!" అన్నాడు భయంగా అయిదేళ్ల వెధవ.

"ఏంకాదు .. " అన్నాను. నేను అన్నదే ఆలస్యంగా క్రిందకు దూకేశాడు, తల చితికిపోయింది. వెంటనే చచ్చిపోయాడు.

నేను వాడిమీద నా విద్య ప్రదర్శించుతుండగా సువర్చల లోపల్నుంచి వచ్చింది. బాబు బ్రతికాడు.

"ఎలా పడిపోయాడు!" ఆత్రంగా అంది.

జరిగింది చెప్పాను.

నన్నో పురుగుని చూసినట్లు చూసింది, ఆ చూపుల్లో విపరీతమైన ఛీత్కారం వుంది.

"ఛీ! మీరు మనుషులు కారు...." అంది కోపంగా.

"ఏం?" అన్నాను.

"ఏ తండ్రీ తన కొడుకు చావును చూడాల: కోరుకోడు... "

"నేను వాడిని బ్రతికించ గలను కనుక అలా చేశాను...." అన్నాను.

"అయినా సరే! డబ్బు సంపాదించారు. సంతోషించాను. కానీ ఈరోజు మానవత్వపు చివరి మెట్టుమీద వున్న మిమ్మల్ని చూసి విచారిస్తున్నాను. మీ మనసు రాయి అయిపోయింది. అందుకే కొడుకు చావుని... "

"నోర్ముయ్! ఏవో పెద్ద పెద్ద డైలాగులు కొడుతున్నావు. నేనేం నీచుడ్ని కాను. నాలో మానవత్వం చావనూ లేదు."

"మీతో వాదించడం నా బుద్ధి తక్కువ .. " అంటూ బాబును తీసుకుని లోపలకు వెళ్లిపోయింది.

సువర్చల ఇంత అన్యాయంగా ఎలా మాట్లాడింది. ఇదివరకు నాతో ఎంత అన్యోన్యంగా వుండేది! ఈ మధ్య ఎలాగైనా ఆమెకు చిర్రుబుర్రులు ఎక్కువ అయ్యాయి.

ఆలోచిస్తూ కూర్చుండిపోయాను. ఇంతలో స్వాములవారి ఇంటి నౌకరు పరుగున వచ్చాడు.

"అయ్యా! బాబుగారు మిమ్మల్ని వెంటనే పిల్చుకు రమ్మన్నారు. పిట్ట గోడ ఎక్కి నిమ్మకాయలు కోస్తూ ఫెన్సింగువైరు చుట్టమీద పడ్డారు. వళ్లంతా గాయం అయింది. చర్మం అంతా చీరుకుపోయింది. చాలా ఆయాసపడుతున్నారు...." ఆత్రంగా అన్నాడు.

అతన్ని కార్లో ఎక్కించుకుని స్వాములవారి ఇల్లు చేరాను.

ఆయన అవసోపాలు పడుతున్నారు. శ్వాసకూడా సరిగ్గా ఆడటంలేదు.

"ఎలా జరిగింది ఇది....?" అన్నాను.

ఆఫీసురూం, లేడీ సెక్రటరీ, అన్ని తయారైనవి గాని ఫ్యాక్టరీ కట్టడానికి మాత్రం డబ్బులేదు.

AVM

"ఆ వివరాలు మళ్లీ బ్రతికాక.... చెప్తాను.... గుండెలదగ్గర.... చర్మం .... చీల్చుకుపోయింది.... ఆయాసం కూడా.... చచ్చిపోవడం ఖాయం...." అన్నారు ఆయాసంతో.

"భయపడకండి!.... నేను వచ్చే దాకా!.... డాక్టర్ని పిలవనా!" అన్నాను.

అదెందుకు, దండుగ... పని. నువ్వు న్నావు.... చాలు...."

ఇంకో అరగంటయినా ఆయన చావ లేదు. ఆయాసపడుతున్నారు తప్ప "నేను హాల్లో వుంటాను. ఆయన చనిపోయాక వచ్చిచెప్పు...." అని హాల్లోకి వచ్చి సిగరెట్ కాల్చుకోసాగాను.

సిగరెట్ పూర్తికాగానే, ఆయన చనిపోయాడంటూ కబురు.

వెంటనే లేవకుండా మరో సిగరెట్ వెల్గించి ఆలోచనలో పడ్డాను.

పోయినవాడు ఎలాగూ పోయేడు. ఆయన్ని బ్రతికించడం మానేస్తే ఏమవుతుంది? నా వ్యాపారానికి పోటీ ఉండదు. నేను ఆ తర్వాత ఆయన స్థానం ఆక్రమించవచ్చు. అలాగే చెయ్యనా?

కానీ.... ఒప్పందం ప్రకారం అది తప్పు. ఆయన్ని బ్రతికించాలి. ఆయన్ని బ్రతికించడం మానేస్తే దెయ్యం అయి పీక్కు తింటాడా? ఆలోచనలు ఎటూ తెగటంలేదు.

"బాబూ...." అయ్యగార్ని బ్రతికిం

చెయ్యండి... " అన్నాడు ఇంటి నౌకరు.

మా ఇద్దరి మధ్యా ఒప్పందం వాడికి తెలుసు.

"నోర్మూసుకుని అవతలకి పో .." కేక వేశాను.

"బాబూ...." ఏదో అనబోయాడు.

తీక్షణంగా చూశాను. మరి మాట్లాడక వెళ్లిపోయాడు.

ఆ రాత్రంతా ఇలాంటి ఆలోచనలతోనే గడిపాను.

మనిషిలో స్వార్థచింతన సహజం. అందుకే ఈ ఆలోచనలు నన్ను ఇంతగా పీడిస్తున్నాయి. పూర్తిగా కాక కొంత అన్యాయం ఆయనకు చేద్దామన్పించింది.

ఆయన్ని బ్రతికించుతాను. ఒంటిగా నేను ఆయనకు రాసిచ్చిన పత్రం చేజిక్కించుకుని నాశనంచేస్తాను. దాంతో ఆయన మాటలకు లోబడవల్సిన అవసరం వుండదు. ఆయనకు పోటీగా నేనూ వ్యాపారం ఆరంభిస్తాను.

అప్పటికే తెల్లవారింది. ఆ ఇల్లంతా నాకు చిరపరిచితమే. నా పత్రం ఆయన బీరువాలో దాచారు. ఆ తాళాలు ఎక్కడ వుంటాయో తెలుసు నాకు. లేచి వెళ్లి ఆ కాగితం సంపాదించి ఒక్క అగ్గిపుల్లతో దాన్ని మసిచేశాను.

తలంతా దిమ్ముగా వుంది. నౌకరుని పిల్చి ఒక కాఫీ చేసి ఇమ్మన్నాను. వాడు పాట మళ్లీ మొదలుపెట్టాడు.

"అయ్యగార్ని బ్రతికించరూ?... "

"కాఫీ తాగి ఆ పని చేస్తాను. పోరా! ..." అని కసిరాను.

సూర్యోదయం అవుతుండగా స్వాములవారు లేచి చూస్తున్నారు. కొంచెం నీరసంగా వున్నారు.

"ప్రద్యుమ్నా! ఈ వేళంతా నేను రెస్టు తీసుకుంటాను. ఏమైనా కేసులు వచ్చినా ఒప్పుకోకు. సాయంత్రం ఒకసారి రా!...." అన్నారు. ఆయనతో ఇప్పుడే దెబ్బలాడటం ఎందుకని సరేనంటూ వచ్చేశాను.

ఇంటికొచ్చి స్నానంచేసి పడుకున్నాను. రోజంతా ఇంట్లోనే వున్నాను. సాయంత్రం స్వాములవారి దగ్గరకు బయలుదేరడానికి సిద్ధం అయ్యాను.

ఇంతలో మా బాబు వచ్చి —

"నాన్నా! నువ్వు పోయావు." అన్నాడు.

"నేను పోవడం ఏమిట్రా?" అన్నాను కోటు తొడుక్కుంటూ.

"హాల్లో నేనూ, అక్కా బంతి ఆట ఆడుతున్నాం. బంతివెళ్లి నీ ఫొటోకి తగిలి అది క్రిందపడి ముక్కలయ్యింది .. " అన్నాడు.

కోపంగా సువర్చలని పిలిచాను.

"బయట ఆడుకోకుండా హాల్లో ఈ బంతి ఆట ఏమిటి? ఆ గాజుముక్కలు ఏరించి ఫొటో సరిగ్గా పెట్టు. " అని

బైటకి నడుస్తూ వెధవపని చేసినందుకు బాబును ఒక్కటి కొట్టాను.

నేను వెళ్ళేసరికి స్వాములవారు సోఫాలో కూర్చుని చాకుతో ఏపిల్ పళ్లు కోస్తున్నారు. నేను ఎదురుగా కూర్చున్నాను. పళ్లముక్కలు పోసిన పళ్లెం నా ముందుకు జరిపారు. నేను రెండు తీసుకున్నాను.

ఆయన ఒక ముక్క నమిలి –

"నాలో పరివర్తన వచ్చిందోయ్" అన్నారు.

అర్థంకానట్లు చూశాను.

"అదేనోయ్! నాలో మార్పువచ్చింది. చనిపోయినవాళ్లని బ్రతికించే ఈ వ్యాపారం ఇంకి చెయ్యకూడదు అనుకుంటున్నాను..." అన్నారు.

పక్కలో బాంబు పేలినట్లు అదిరి పడ్డాను.

"మన సంపాదన ఆగిపోదూ?" అడిగేను.

"ఇంతవరకు సంపాదించింది చాలు. దీంతో నా ఒంటరి జీవితం ఎలాగూ గడిచిపోతుంది. ఈ సారి మృత్యువు వస్తే ఇంక మళ్లీ నిన్ను బ్రతికించమని అనను."

"ఎందుకిలా చేయాలన్పించింది?" అడిగేను.

"నిన్న నేను పోయినప్పుడు నువ్వు నన్ను బ్రతికించటంలో ఆలస్యం చేసిన కారణంగా నేను యముడిని కల్సుకోవలసి వచ్చింది. ఆయనతో సంభాషించిన తర్వాత నాలో ఈ మార్పు వచ్చింది..."

"అందువల్ల మనం నష్టపోతాం..."

"ఫర్వాలేదు. ఒక ప్రశ్నకు సమాధానం చెప్పు. 50 మంది కూర్చోవల్సిన బస్సులో 500 మంది కూర్చుంటే ఏమవుతుంది?"

"బస్సు కూలి చస్తుంది పైగా ఎవ్వరికీ సుఖం వుండదు..."

"ఇప్పుడు మన వ్యాపారంవల్ల ఈ ప్రపంచం కూడా అలాగే అవుతుంది. మామూలుగానే మన దేశంలో జనాభా సమస్య అతి తీవ్రంగా వుంది. దానికి తోడు మనం చచ్చిన వాళ్లందర్నీ బ్రతికిస్తూపోతే ఆ సమస్య మరింత పెరుగుతుంది. బీదరికం, నిరుద్యోగం, ఆహార సమస్య, ఇళ్ల సమస్య మరింత పెరుగుతాయి. వైద్యశాస్త్రంలో వచ్చిన అభివృద్ధివల్ల మరణాల సంఖ్య మామూలుగా తగ్గిపోయింది. మనం ఒకరకంగా దేశానికి అన్యాయం చేస్తున్నామేమో! ...." ఆలోచిస్తూ అన్నారు.

"గోంగూరపచ్చడి కాదూ! అవన్నీ ఆలోచిస్తే మన పని సున్నా. మనం గొప్పవాళ్లనే బ్రతికిస్తున్నాం కానీ దరిద్రులని కాదు. ఇందువల్ల మీరు చెప్పిన సమస్యలు రావేమో" అన్నాను.

"అలా అనకు. బ్రతికేది గొప్పవాళ్ళే అయినా వాళ్ల అన్యాయాలకు బలి అయ్యే బీదవాళ్ల జీవితం మరికొన్నాళ్లు

అలాగే వుండిపోతుంది. డబ్బుకోసం లెక్క చెయ్యక చాలామంది మధ్యతరగతివాళ్ళు కూడా మన దగ్గరకు రావడం, మనం ప్రతిక్రించడం జరిగింది. ఎవడు ప్రతినా దేశజనాభా పెరగడం జరుగుతోంది కదా! మనం ప్రతికించిన గొప్పవాళ్ళందరూ ఇంచుమించు పేదల జీవితాలతో ఆడుకుంటున్నవాళ్ళే. పేదల పొట్టలు కొడుతున్నవాళ్ళే. మనవల్ల పేదల బ్రతుకులలో చీకటి ఎన్నటికీ దూరంఅయ్యే అవకాశం లేదన్నమాట పైగా మనం చేస్తున్న ప్రకృతి విరుద్ధమైన పనివల్ల శ్రాద్ధకర్మలుచేసే పురోహితులకు కాటికాపరులకు, కష్టైల అడితీ వాళ్ళకి నష్టం కల్గుతోంది. నాకు ఎందుకో మనసు విరిగిపోయింది, ఇంక ఈ వ్యాపారం చెయ్యను. నువ్వు కూడా ఆలోచించు. నీ కుటుంబ సభ్యుల్ని ప్రతికించినంత మాత్రాన పెద్ద సమస్యలు రావు కనుక నిన్ను అడ్డగించను." అన్నారు.

ఆయన మరో ఏపిల్‌పండు ముక్కలు చెయ్యసాగాడు కత్తితో.

"మీ వ్యవహారం నాకు నచ్చలేదు. ఆ వ్యాపారం కొనసాగించడం ఇష్టం లేకపోతే మానెయ్యండి, నాకు నష్టంలేదు. కానీ ఒక విషయం, మీరు పోయినప్పుడు నేను మీకు రాసిచ్చిన పత్రం తీసుకుని కాల్చేశాను. కనుక మీరు నన్ను ఏం చెయ్యలేరు. కనుక ఈ నేను వ్యాపారం సాగిస్తున్నాను. నాకు మీపోటీ కూడా వుండదు కనుక నాకు అది మరింత హాయి " అన్నాను

"ప్రద్యుమ్నా! " ఆయన గర్జించేరు

నేను బెదరలేదు. చిన్నగా నవ్వాను.

"నువ్వు అన్యాయం చేశావు " అన్నారు.

"పర్వాలేదు " అన్నాను నవ్వుతూ.

"అలా చెయ్యడం తప్పు కాదూ? ఆ విషయం నీకు తెలియదూ?" కోపంగా అన్నాడు.

"తప్పు అని తెలిసికూడా చాలామంది చేస్తారు తప్పు. రాత్రిపూట ఒళ్ళు అమ్ముకునే అమ్మాయికి వ్యభిచారం తప్పని తెలియదా? లంచం తీసుకునే లక్ష్మీపతికి ఆ పని కూడదనితెలియదా? కంట్రాక్టరుకు సహాయపడే ఇంజనీరు ఈశ్వరరావుకు అది తప్పు అని తెల్సు. ప్రైవేటుప్రాక్టీసు పెట్టిన ప్రభుత్వ వైద్యుడు విశ్వనాధం తప్పు అని తెలిపే ఆ పని చేస్తున్నాడు " అన్నాను.

"నల్గురు చెడ్డదారిలో నడిచినంత మాత్రాన నువ్వూ నడవాలా?"

"అంతే మరి! "

ఆయన కళ్ళలో కోపం తొంగిచూసింది. దాన్ని కంట్రోలుచేసుకుంటూ—

"ప్రద్యుమ్నా! ఆఖరుసారిగా చెప్తున్నాను. ఈ వ్యాపారం నేను చెయ్యను, నువ్వు చెయ్యకూడదు "

"అలా శాసించే అధికారం మీకు లేదు."

"మూర్ఖుడా! నన్ను అర్థంచేసుకో డబ్బు కాంక్షలో పడి నేను చెప్పిన నిజాలు మర్చిపోకు. నాకు కోపం తెప్పించకు. ఏమైనా సరే, చచ్చినవాళ్లు బ్రతకడం ఇక జరక్కూడదు అందుకు నిన్ను అర్థిస్తున్నాను "

"నా బుర్రనిండా డబ్బే నిండివుంది. మీ నీతివాక్యాలు నా బుర్రకెక్కవు. అనవసరంగా శ్రమపడకండి. ముసలి తనం మీదపడి మీ బుర్ర చెడినట్లుంది మీరు మరి మాట్లాడక కూర్చోండి. మీ స్థానం నేను ఆక్రమిస్తాను " అన్నాను

"నిన్ను ఈ డబ్బు వ్యామోహంనుంచి దూరం చెయ్యడానికి నాకు ఒక్కటే మార్గం కన్పిస్తోంది ఇదిగో ఈ కత్తి చూశావా? దీంతో నిన్ను పొడిచి చ పే స్తాను. నీతోనే నీవిద్య అంతమవుతుంది. నేను ఇక ఆ విద్య ప్రదర్శించను కనుక నా కోరిక తీరినట్లే " అంటూ ఏపిల్ పళ్లు కోసిన కత్తి చూపించారు.

నాకు నవ్వు వచ్చింది. ఆయన సీరి యస్‌గా అన్న మాటలు కావు అన్పిం చింది ఆ కత్తి కేసి చూశాను పొడుగ్గా, పదునుగా వుంది. దాంతో మనిషిని పొడిస్తే చావడం ఖాయం.

"ఇంక నేను వెళ్తాను మీకు కొంచెం కొంచెంగా మతి చలిస్తున్నట్లు వుంది. ఈ రోజుతో మన ఇద్దరి మధ్యా సంబం ధాలు తెగినట్లే" అంటూ లేచాను.

నిర్లక్ష్యంగా ఆయన వైపు చూసి ఒక సిగరెట్ వెల్గించాను.

రెండు అడుగులు వేశాను,

"ఆగు " అన్నారు అక్కడే ఆగి ముఖం వెనక్కి తిప్పి ఎందుకన్నట్లు చూశాను

ఆయన లేచి నావైపు వచ్చారు.

వెంటనే దిక్కులు పిక్కటిల్లేలా కేక పెట్టాను.

అంత గట్టిగా ఎన్నడూ అరచి వుండను.

అందుకు కారణం ఆయన నా వీపులో గుచ్చిన కత్తే కారణం

ప్రాణాలు అల్లల్లాడిపోతున్నాయి.

వెంటనే తూలి క్రిందపడిపోయాను.

ఇంకో అయిదు నిముషాయి బాధపడి తర్వాత చచ్చిపోయాను.

• • •

మోకాళ్లకి, మోచేతులకి నేల తగిలి నొప్పిపెట్టడంతో మెళకువ వచ్చింది. మంచంమీంచి దొర్లి క్రిందపడ్డానన్న మాట

బెడ్‌రూంలో జీరోబల్బు వెల్గుతూనే వుంది.

ఇంతలో పెద్ద దీపం వెలిగింది.

"ఏమయింది? అంత గట్టిగా కేక వేశారు? హడలి చచ్చాను అదేమిటి దొర్లి పడ్డారా? " సువర్చల ప్రశ్నిం చింది.

లేచి నిలబడి- "అవును. ఒక పీడకల వచ్చిందిలే.... కాసిని మంచినీళ్లు ఇవ్వు ...." అన్నాను.

మంచంమీద కూర్చున్నాను. పిల్లలిద్దరూ అమాయకంగా నిద్రపోతున్నారు. సువర్చల తెచ్చిన మంచినీళ్లు త్రాగాను. టైము చూశాను. మూడయ్యింది.

"పడుకోండి. " అంది సువర్చల లైటు తీసేస్తూ.

కానీ నాకు నిద్ర రాలేదు. కళ్ల ముందు మృత్యుంజయస్వాములవారు కన్పడుతున్నారు. తొలికూత విన్నాను కోడిది.

ఆఫీసుకు వెళ్లాను మామూలుగా. రాత్రి నిద్ర చాలక కళ్లు ఎర్రగా వున్నాయి.

"ప్రద్యుమ్నా రాత్రి నిద్రమాని కథ ప్లాటు కోసం ఆలోచించేవా?" అడిగేడు కొలీగ్ కోదండం.

నవ్వి ఊరుకున్నాను.

రాత్రి వచ్చిన కలనే కథగా రాయాలన్పించింది.

సాయంత్రం ఇంటికి వచ్చేక కాఫీ త్రాగి కథ రాయడం ప్రారంభించేను.

"రాత్రి మీకు ఏం కల వచ్చింది?" అడిగింది సువర్చల.

"దాన్నే కథగా రాసి యువ కథల పోటీకి పంపుతున్నాను. అచ్చయ్యాక చదువు", అంటూ కథ రాసుకో సాగాను.

సాధారణంగా నా కథలు మొదట చదివేది సువర్చల. కానీ ఇందులో వున్న స్పెషాలిటీ కారణంగా ఆమె చదువకుండానే పోస్టు చేశాను. సువర్చల నా ఎదురుగానే కూర్చొని ఏదో బట్టీపడుతోంది.

"ఏమిటీ?" అన్నాను.

"మా మహిళామండలి వార్షికోత్సవ సందర్భంగా వేస్తున్న నాటకంలో నాపాత్ర తాలూకు డైలాగు లివి. ఒక డైలాగు చదువుతాను. వినండి " అంది.

చదవమన్నాను.

"మృత్యువుకు మృత్యువు లేదు. అది చిరంజీవిలా ఎల్లకాలం వుండి సకల ప్రాణులను పీడిస్తుంది. మృత్యువుకు మృతి తెద్దామని ప్రయత్నించినవారు మృత్యుముఖంలోకి వెళ్లడం తథ్యం గానీ మృత్యు వెరుగనిది మృత్యువు.

నిజమే అన్పించింది నాకు.

మళ్లీ కథ రాయడం ఆరంభించాను



సీరియల్

# అగ్నిశిఖ

వాసిరెడ్డి సీతాదేవి

(గత సంచిక తరువాయి)

వీడు అవసరమైన పుస్తకాల్ని చదువుతాడు అందుకే ఈ పిచ్చి ఆలోచనలన్నీ

"ఏమిటి ఆలోచిస్తున్నావ్?"

"ఆఁ ఏమీలేదు చెప్పు"

"ఇక్కడ్నుంచే బలి ప్రారంభం అయింది మనిషికి ఆకాశాన్ని చూసి భయం- భూమిని చూసి భయం- ఆకలి భయం- మనిషి భయం - సమాజ భయం- జీవితం ఎదుర్కోడానికి భయం బలి. బలి నరబలి స్త్రీబలి ... బలి ఇదే ప్రవృత్తి ఈనాటికీ మనిషిలో ఉంది నా రాత్రి అదే చేశాను"

"ఏం చేశావ్?"

"నేను బలవంతుడ్ని మగవాడ్ని. ఒక స్త్రీ శీలాన్ని బలితీసుకున్నాను. నా మనసులోని బాధకు భయపడి- నా ఒంటరితనానికి భయపడి" రాహుల్ కంఠం బాధతో పూడిపోయింది

"ముందు నువ్వు ఆ మంచం దిగు. ముఖం కడుక్కో. అంతలో నేను కాఫీ తయారుచేస్తాను ఆ తరువాత మాట్లాడుకుందాం."

"నేను చెప్పేది వినవా?"

"వింటాను ముందు కాఫీ తాగు"

"నా తలలో నొప్పిగా ఉంది"

"హాంగ్ ఓవర్। రాత్రి బాగా తాగావు"

"ఎప్పుడూ తాగను. ఎందుకో తెలుసా?"

"ముందు నువ్వు ముఖం కడుక్కునిరా తర్వాత వింటాను" అంటూ రమేష్ లేచి స్టౌదగ్గరకు వెళ్ళాడు.

"పాలు వచ్చాయా ?"

"పాలపొడి ఉందిగా !"

రాహుల్ మంచం దిగాడు. తూలుతూ వెళ్ళి బ్రెష్‌మీద పేస్టు వేసుకొని బాత్ రూంలోకి వెళ్ళాడు.

రాహుల్ వచ్చేసరికి రమేష్ కాఫీ తయారు చేశాడు.

కాఫీ సిప్‌చేస్తూ కూర్చున్నాడు రాహుల్.

ఇద్దరూ మౌనంగా చాలాసేపు ఉండిపోయారు.

రాహుల్ ముఖం తేటపడింది.

కళ్ళల్లో మత్తు వదిలింది.

"ఊఁ ఇప్పుడు చెప్పు !" అన్నాడు రమేష్.

"ఏం చెప్పను ?"

"రాత్రి ఎందుకు తాగావు ?"

రాహుల్ మాట్లాడలేదు.

"చెప్పవేం ?"

"నేను ఇప్పుడు చెప్పలేను."

"నా దగ్గిర దాచే రహస్యాలు కూడా నీకు ఉన్నాయా ?"

"రమేష్ ప్లీజ్ అలా అనకు."

"అయితే చెప్పు ! నువ్వు ఊరికే తాగవు. ఏదో నీ మనసుకు పెద్ద గాయం తగిలిఉండాలి."

రాహుల్ అదోలా నవ్వాడు.

"నీ నవ్వే చెబుతోంది నువ్వెంతగా బాధపడుతున్నావో ! ఏం జరిగిందో చెప్పు."

రాహుల్ సమాధానం చెప్పలేదు.

"పోనియ్ ఇది చెప్పు ! రాత్రి ఈ గదికి ఎవర్ని తెచ్చావ్ ?" రమేష్ కంఠం తీవ్రంగా ఉన్నది.

"నేను ఎవర్నీ తీసుకురాలేదు. ఆమే వచ్చింది."

"ఎవరు ? భావనా ? ఇంతకాలం ఎక్కడ ఉంది ? ఎందుకు చెప్పకుండా అజ్ఞాతవాసానికి వెళ్ళిపోయింది ?"

"ఆ పేరు ఎత్తకు !" కరకుగా ఉంది రాహుల్ కంఠం.

రమేష్ అతని ముఖంలోకి ఆశ్చర్యంగా చూశాడు.

ఏదో అడగబోయి ఆగిపోయాడు.

"నా పతనం ప్రారంభం అయిందిరా. నేను ఒక ఆడపిల్ల శీలాన్ని దోచుకున్నాను "

"నేను నమ్మను– నువ్వు బలవంతంగా ఏ స్త్రీనీ...." అంటూ ఆగి రాహుల్ ముఖంలోకి చూశాడు.

"ఆమె ఇష్టంతోనే కావచ్చును. ఆమె నన్ను ప్రేమిస్తున్నది. తాగిన మైకంలో ఆమెచేత కూడా బలవంతంగా తాగించాను. అందువల్లనే ఆమె నాకు లొంగిపోయింది. ఎంత నీచంగా ప్రవర్తించానో చూశావా ?"

"తాగించావా ? ఏ స్త్రీ అంతకుముందు అలవాటు లేకపోతే ఒక పురుషుడు బలవంతం చెయ్యగానే తాగుతుందని నేను అనుకోను."




"నువ్వు అనుకోనంత మాత్రం చేత వాస్తవం అబద్ధం కాదుగా?"

"ఆమె ఎవరు?"

"నన్ను మీరంతా చాలా బుద్ధిమంతుణ్ని అనుకుంటారు కదూ? మీ అందరి కంటే దుర్మార్గుణ్ణి. ఆదర్శాలు వల్లించేవాణ్ణి. బహుశా అదంతా మంచి పేరు కోసమే నాకు తెలియకుండానే చేశాననుకుంటాను."

"ఏడ్చావు గాని అసలు సంగతి చెప్పు! నువ్వు దుర్మార్గుడివైతే ఇంత బాధపడవు. అసలు ఏం జరిగిందో చెప్పు!"

"కాదురా! నేను మృగాన్ని-మృగం లాగే ప్రవర్తించాను."

"లేదురా రాహుల్. నువ్వు మనిషివి. మనసున్న మనిషివి.

రాహుల్ వేదాంతిలా నవ్వాడు.

"ఇది సహజం! నువ్వు వయసులో ఉన్నావు. ఒక స్త్రీ తనకు తానై వస్తే.... అసలు ఆ స్త్రీ ఎవరో చెప్పనే లేదు."

"సుమతి!"

రమేశ్ తృళ్ళిపడి రాహుల్ ముఖంలోకి చూశాడు.

"సుమతా? అయితే నువ్వు బాధపడనక్కర్లేదు."

"అదేమిటి?"

"అవున్రా! నీకు ఆమె గురించి తెలియదు. సీతాకోకచిలుక. బాగా డబ్బుంది. అందమైనది. అందమైనదాన్ననే గర్వం ఉంది. మగవాళ్ళను రెచ్చగొట్టి చుట్టూ తిప్పుకోవడం ఆమెకు సరదా."

"మరీ అన్యాయంగా మాట్లాడకు."

"నేను అబద్ధం చెప్పడంలేదు."

"నేను బాధపడుతున్నానని ఆ అమ్మాయి గురించి చెడుగా చెబుతున్నావు గదూ?"

"కాదు. నువ్వంటే ఆమెకు ప్రేమ లేదు."

"ఆమె నన్ను ప్రేమిస్తున్నది. నేను తాగమంటే తాగింది. తనను నాకు మనస్ఫూర్తిగా అర్పించుకున్నది."

"కాదు, నేను చెప్పేది విను. నువ్వు ఆమెకేసి తలెత్తి చూసేవాడివి కాదు. నీస్నేహం వల్లనే మహాగర్వం అనేది, భావన నీకు దగ్గిరగా వచ్చాక మరీ పట్టుదల ఎక్కువైంది."

"ఎందుకూ?"

"చెప్పానుగా ఆమెకు తన అందం మీద గర్వం అని! ఆ అందంతో ఏ మగాడినైనా తన చుట్టూ తిప్పుకోగలననే అహం ఉంది. ఆమెలో ఆ అహంమీద నువ్వు దెబ్బకొట్టావు. 'భావన నాకంటే అందమైందా?' అని నాతో ఎన్నోసార్లు అన్నది."

రాహుల్ ఆశ్చర్యంగా చూశాడు.

"సుమతికి అన్యాయం చెయ్యను"

"సుమతికి న్యాయం చేస్తావా? ఏం చేస్తావు?"

"ఆమె నన్ను ప్రేమించింది. దెబ్బ తిన్న ప్రేమ ద్వేషంగా మారుతుంది."

"పుస్తకాల్లో చదివిన డైలాగ్పు చెప్పకు."

"ఆమె అంతకు ముందు ఏం చేసిందో నాకు అనవసరం. నేను తప్పు చేశాను. అందుకే...."

"ఏం చేస్తావ్?"

"పెళ్ళి చేసుకుంటాను".

రమేశ్ పకపక నవ్వాడు,

"ఎందుకలా నవ్వుతావ్?"

"సుమతి నిన్ను పెళ్ళిచేసుకుంటుంది అనుకుంటున్నావా?"

రాహుల్ ముఖం కోపంతో ఎర్రబడింది.

"ఆమెకు నువ్వు ఒక్కడివే స్నేహితుడివి కాదు."

"నీమాటలు నమ్మను. నువ్వు ఆమెను ప్రేమిస్తున్నావ్. నీ కోసం ఎప్పుడూ గదికి వస్తూఉండేది."

"నీకు మత్తు పూర్తిగా వదలలేదు. ఒక వైపు నిన్ను ప్రేమిస్తున్నదంటు న్నావ్. రెండో వైపు నాకోసం గదికి వచ్చేది అంటున్నావ్?"

"అది కాదు అమే చెప్పింది."

"ఏమని?"

"నన్ను చూడటానికే, నాతో స్నేహం పెంచుకోవడానికే, ఏదో వంకతో మన గదికి వచ్చేదాన్నని చెప్పింది."

"ఆమె ప్రేమిస్తున్నట్టు చాలామందికి భ్రమలు కల్పించింది."

"నీకు కూడానా?" వ్యంగ్యంగా అన్నాడు రాహుల్.

## పాపాయికి పుట్టుకతోనే మీరిచ్చిన కానుక- 3 నెలలకు సరిపడే ఐరన్



## 3 నెలలు నిండాక, కేవలం పాలే అతడికి కావలసిన ఐరన్‌ను సమకూర్చలేవు

అతడికి ఇవ్వండి **ఫారెక్స్** పుష్కలంగా ఐరన్ గలది

"తల్లినుంచి పెద్ద ఐరన్ నిల్వతో సహా పుడతాడు పాపాయి అంతే పుట్టిన తర్వాత ఈ నిల్వ క్రమేపీ తరిగిపోతుంది పాలు మంచి ఆహారమే అయినప్పటికీ, ఐరన్ లేనందువల్ల అది సంపూర్ణ ఆహారం కాదు అందుకే పాపాయికి ఐరన్ గల ఆహారాలు కావాలి."

డాక్టర్ సుభాష్ సి ఆర్య "ఇన్‌ఫెంట్ అండ్ చైల్డ్ కేర్ ఫర్ ది ఇండియన్ మదర్"

డాక్టర్లు ఫారెక్స్ ఎందుకు సిఫార్సు చేస్తారు?,

ఫారెక్స్‌లో పుష్కలంగా ఐరన్ కూడా ఉంది — అది మీ పాపాయి రక్తానికీ, అతడి శరీర ఆరోగ్యానికీ, అతడి పెరుగుదలకూ, వికాసానికీ అతి ముఖ్యం.






**డాక్టర్లు సిఫార్సు చేస్తారు ఫారెక్స్**
**సత్వరమైన, సంపూర్ణమైన పెరుగుదల కోసం పాపాయికి ఆదర్శవంతమైన ఘన ఆహారం**

CASGLF-30-163 Tel

రమేశ్ ఓ క్షణం రాహుల్ ముఖం లోకి చూశాడు.

"నేను ఆ భ్రమలో పడనని ఆమెకు తెలుసు, ఆమెతో తిరగడానికి నాకు అభ్యంతరం లేదనికూడా తెలుసు."

రాహుల్ మౌనంగా చూస్తూ ఉండి పోయాడు.

"రఘురాం తెలుసుగా?"

"ఏ రఘురాం?"

"అదే విచ్చాసుపత్రి పాలైనవాడు."

"ఆఁ."

"అతనికి ఆ గతి పట్టించింది ఈ సుమతేనని నీకు తెలియదు."

రాహుల్ ఆశ్చర్యంగా రమేశ్ ముఖంలోకి చూశాడు.

"నువ్వు ఇందాక నీలో నువ్వు మాట్లాడుకున్నావే అది అక్షరాలా నిజం."

"ఏమిటి? ఏం మాట్లాడాను."

"లిప్‌స్టిక్ వేసుకున్న ఆ పెదవుల్లో రక్తదాహం ఉన్నదన్నావే. అది కరెక్టు."

రాహుల్ అయోమయంగా చూశాడు

"మరో మాట కూడా అన్నావ్."

"ఏమన్నాను?"

"నీకు గుర్తు లేదా?"

"లేదు."

"అందమైన ఆడది నవ్వినప్పుడు బుగ్గలు గుంటలు పడితే, ఆ గుంటలు కొండలోయల్లాంటివి అన్నావ్. నువ్వు నిజంగానే గుంటలో పడిపోతున్నావ్."

రాహుల్ ఆలోచిస్తూ ఉండిపోయాడు.

---

జనవరి నెల యువ భావపరిచయ పోటీ

రు. 25-00 బహుమతి పొందిన వ్యాఖ్య

రేఖాచిత్రంలో ప్రగతి

ఊహాచిత్రంలో ఉన్నతి

బండారు కొండలరావు

వాల్తేరు



# హై పవర్ సర్ఫ్ అమిత తెల్లగా ఉతుకుతుంది...

అమిత తెల్లగా కనువిందుగా

హై పవర్ సర్ఫ్‌లోని గొప్ప డిటర్జంట్ శక్తి
మురికినీ, జిడ్డు మరకల్నీ మటుమాయం
చేస్తుంది బాగా మాసిపోయిన దుస్తుల్ని
కూడా, తెల్లగా మిలమిల మెరిసేలా
చేస్తుంది సర్ఫ్ ఎక్కువ మంది
తల్లులు మరే ఇతర వాషింగ్
పౌడర్‌కు బదులు సర్ఫ్‌నే
వాడటంలో ఆశ్చర్యం
ఏముంది గనక !




ఎక్కువ మంది తల్లులు మరే ఇతర
వాషింగ్ పౌడర్‌కు బదులు సర్ఫ్‌నే వాడతారు

హిందూస్థాన్ లీవర్ వారి విశిష్ట ఉత్పత్తి

లింటాస్—SU-224

"ఏమిటి ఆలోచిస్తున్నావ్?"

"నేను సుమతితో మాట్లాడతాను గతాన్ని తవ్వడం నాకు యిష్టం లేదు. ఆమెకు ఇష్టం అయితేనే పెళ్లి చేసుకుంటాను"

"ఎప్పుడు మాట్లాడతావు?"

"ఈ సాయంత్రమే!"

"ఎక్కడ?"

"ఇక్కడే!"

"ఈ సాయంత్రం మళ్లీ వస్తుందనే అనుకుంటున్నావా?"

"వస్తానన్నది. వస్తుంది."

"సరే మాట్లాడు."

"నాకు విస్కీ కావాలి."

"తాగితే కాని మాట్లాడలేవా?"

రాహుల్ మాట్లాడలేదు.

"తాగితే ఇంకేం మాట్లాడతావో? రాత్రిలాగే ప్రవర్తిస్తావు."

"అయితే వద్దులే. నేను తాగను."

"ఇక లేచి స్నానం చెయ్యి కాలేజీకి టైం అవుతోంది"

"ఇవ్వాళ నేను కాలేజీకి రాలేను"

రమేశ్ లేచి టవల్ తీసుకొని బాత్ రూంలోకి వెళ్ళాడు.

7

ఏడుగంటలకు ఊరికి వెళ్ళి వంట కుర్రాడు వచ్చాడు.

రమేశ్ భోజనం చేసి కాలేజీకి వెళ్ళాడు

"అసలు నిన్న సాయంత్రం నీకు ఎందుకు తాగాలనిపించింది" వెళ్ళబోయే ముందు రమేశ్ ప్రశ్నించాడు.

"ఆ విషయం ఇప్పుడు చెప్పలేను" అన్నాడు రాహుల్

రాహుల్ అన్నం తినగానే నిద్ర పోయాడు.

రమేశ్ కాలేజీనుంచి వచ్చేవరకూ నిద్రపోతూనే ఉన్నాడు

రమేశ్ రాహుల్‌ను లేపాడు.

ఇద్దరూ కాఫీ తాగారు.

"సినిమాకు వెళ్దాం వస్తావా?"

"నీ స్నేహితులేమైనారు?"

"వాళ్లను ఇవ్వాళ రావద్దన్నాను"

"ఎందుకని?"

"నీ వాలకం వాళ్ళ కళ్ళబడటం నా కిష్టంలేదు"

రాహుల్ మౌనంగా ఉండిపోయాడు.

"మర్చిపోయాను. నువ్వు సుమతి కోసం ఎదురుచూస్తున్నావు గదూ? నేను వెళ్ళివస్తాను" రమేష్ బయటికి వెళ్ళి పోయాడు.

రాహుల్ అశాంతిగా గదిలో తిరగ సాగాడు.

ఉండి ఉండి భావన గుర్తు వస్తున్నది. భావనను తను ఎంత గొప్పగా ఊహించు కున్నాడు?

తనకు చెప్పకుండా వెళ్ళిపోయి నందుకు ఎంతో కుమిలిపోయాడు

అయినా ఏనాటికైనా కన్పిస్తుందనే ఆశ పెంచుకున్నాడు. తన మనసులో

# రెక్సోనా మీ చర్మాన్ని సంరక్షిస్తుంది...





## మృదువుగా మెరిసేలా ఉంచుతుంది

రెక్సోనాలో ఉంది సహజసిద్ధమైన
నాలుగు నూనెల సమ్మేళనం—
కాపుషా (దేవదారు జాతి) లవంగ పత్రి, లవంగ, వరాళ
రెక్సోనాతో స్నానం
చర్మాన్ని మృదువుగా
మెరిసేలా ఉంచుతుంది.
మీరెంతో ఇష్టపడే
పరిమళాన్ని చర్మంపై
నిలిపి గుబాళింపజేసే
రెక్సోనా మీ చర్మ
సంరక్షణ కోసం
సహజమైన సాధనం




## రెక్సోనా మీ చర్మ సౌందర్యం కోసం

హిందుస్థాన్ లీవర్ వారి విశిష్ట ఉత్పత్తి

లింటాస్ RX.76-170

భావనకు తప్ప మరొకరికి చోటు లేదనుకున్నాడు.

భావన తనను మోసగించింది.

సుమతి తన సర్వస్వం తనకు అర్పించింది.

సుమతిని సీతాకోకచిలుక అన్నాడు రమేష్.

ఆడపిల్ల సోషల్‌గా ఉంటే చాలు ఎన్ని పుకార్లయినా పుట్టిస్తారు. ఇది మన సంస్కారం.

చీకటి పడింది.

సుమతికోసం ఎదురుచూడసాగాడు.

ఎనిమిది అయింది.

సుమతి రాలేదు.

రమేశ్ చెప్పింది నిజమేనా?

ఇంతమాత్రానికే అలా ఎందుకు భావించాలి. ఆమెకు ఇవ్వాళ రావడానికి వీలు చిక్కకపోయి ఉండవచ్చుగా?

రాత్రి తొమ్మిదిన్నరకు రమేష్ వచ్చాడు

రాహుల్ పడుకుని ఉన్నాడు.

"నిద్రపోతున్నావా?"

"లేదు."

"భోజనం చేశావా?"

"లేదు."

"లే భోజనం చేద్దాం!"

"నాకు ఆకలిగా లేదురా!"

"ఏం సుమతి రాలేదనేనా?"

రాహుల్ మాట్లాడలేదు.

"సుమతి సినిమాకు వచ్చింది."

రాహుల్ సమాధానం ఇవ్వలేదు.

"ఎవరితోనని అడగవేం?"

"చెప్పు!"

"హనుమంతరావుతో."

"ఏ హనుమంతరావు?"

"ఇంకే హనుమంతరావు! ఆ కోటీశ్వరుడి కొడుకు—నీ క్లాస్‌మేట్‌తో."

రాహుల్‌కు పెద్దగా బాధ అనిపించలేదు.

"బాధపడుతున్నావా?"

"లేదు."

"మరి అలా ఉన్నావేం?"

"ప్లీజ్ రమేష్! ఇప్పుడు నన్నేమీ అడక్కు."

రాహుల్ పక్కకు తిరిగి పడుకున్నాడు.

రమేశ్ రాహుల్‌కేసి జాలిగా చూశాడు.

వీడి బాధ సుమతికోసం కాదు. ఏదో జరిగింది. భావనను వీడు ప్రేమిస్తున్నాడు. ఆ అమ్మాయి చెప్పకుండా ఊరు విడిచి వెళ్ళిపోయినప్పుడు దాదాపు పిచ్చివాడిగానే తిరిగాడు. అయినా నిందు కుండలా తొణకలేదు. ఆమెను ఒక్కమాట అనలేదు.

ఇప్పుడు ఏమైంది.

భావన కనిపించిందా?

భావన మరెవర్నయినా పెళ్ళి చేసుకుందా?

రమేష్ పరిపరి విధాల ఆలోచిస్తూ పడుకున్నాడు.

## 8

రెండో రోజు రాహుల్ కాలేజికి బయలుదేరాడు.

రమేశ్‌కు ఎన్నో అడగాలని ఉన్నది. కాని అడగలేకపోయాడు.

రాహుల్‌కు కాలేజీలో సుమతి కన్పించింది.

రాహుల్‌ను చూసీ చూడనట్టే వెళ్ళిపోయింది.

రాహుల్‌కు రోషం వచ్చింది. మళ్ళీ తనను తనే విమర్శించుకున్నాడు.

ఆమెకు తనమీద కోపం వచ్చి ఉంటుంది, బాధపడుతుందేమో! ఏ ఆడపిల్లయినా ఇంత జరిగాక ఆ మగవాణ్ణి క్షమిస్తుందా?

నాలుగ్గంటలకు యూనివర్సిటీ గేట్‌లో నిల్చున్నాడు రాహుల్.

సుమతి, రమతో మాట్లాడుతూ వస్తోంది.

"సుమతిగారూ!" తనను దాటిపోతున్న సుమతిని పిల్చాడు రాహుల్.

సుమతి తక్కున ఆగింది.

"మీరా? ఏమిటి?"

"మీతో మాట్లాడాలి."

రమ ముందుకు సాగిపోయింది.

సుమతి మగపిల్లలతో సోషల్‌గా ఉంటుందని యూనివర్సిటీలో అందరికీ తెలుసు.

"రండి!" అన్నది కారుకేసి దారితీస్తూ.

సుమతి స్టీరింగు ముందు కూర్చుంది.

రాహుల్ పక్కసీట్లో కూర్చున్నాడు.

"ఎక్కడికి వెళ్దాం!" అడిగింది సుమతి నిర్లిప్తంగా.

ఆమె ప్రవర్తన రాహుల్‌లో ఆశ్చర్యాన్నీ, జంకునూ కలిగిస్తున్నది.

"మీ ఇష్టం."

కారు ఓ పోష్ హోటల్ ముందు ఆగింది.

ఆమె వెనకే రాహుల్ హోటల్‌లో ప్రవేశించాడు.

అలా ఆమె వెనక వెళ్ళడం రాహుల్‌కు ఎలాగో అన్పించింది.

ఇద్దరూ ఓ మూలగా ఉన్న బల్ల ముందు కూర్చున్నారు.

"ఏం తీసుకుంటారు!" సుమతి రాహుల్ ముఖంలోకి చూస్తూ అడిగింది.

"కాఫీ!"

"రెండు కాఫీ!" బేరర్‌తో చెప్పింది.

"రాత్రి జరిగినదానికి బాధపడుతున్నాను."

"ఇది చెప్పడానికేనా- ఏదో మాట్లాడాలన్నారు."

ఆమె స్వరంలో కోపం లేదు. ఏ భావమూ లేదు.

ఏమి జరగనట్టే మాట్లాడుతోంది.

"నేను అడిగే ప్రశ్నలకు సరైన సమాధానాలు కావాలి. ఇస్తారా!"

"అడగండి."

ఓ క్షణం సుమతి ముఖంలోకి చూశాడు.

ఆ ఎర్రటి పెదవుల- అప్పుడే లేడి రక్తంతో తడిచిన చిరుతపులి పెదవుల్లా కన్పించాయి రాహుల్‌కు.

ఈమేనా మొన్న రాత్రి తనతో 'నిన్ను ప్రేమిస్తున్నాను' అవన్నది?

"మీరు జీవితాన్ని గురించి ఎప్పుడైనా ఆలోచిస్తారా?"

"ఎందుకు ఆలోచించను?" నవ్వుతూ అన్నది.

"ఏమి ఆలోచిస్తారు?"

"ఆలోచించడానికి లక్ష విషయాలుంటాయి. ఏదని చెప్పను?"

రాహుల్ ఆమె ముఖంలోకి చూశాడు.

ఆమె కళ్ళు కొంటెగా చూస్తున్నాయి.

రాహుల్‌కు వళ్ళు మండింది.

రెండు రోజులుగా అతనిలో చోటు చేసుకున్న పిరికితనం వదిలింది. ముఖం గంభీరంగా మారింది.

"అఁ అదీ అలా ఉండాలి?"

"ఏమిటి?" ఆశ్చర్యంగా సుమతి ముఖంలోకి చూశాడు.

"ఇప్పుడు మీరు మీరుగా కన్పిస్తున్నారు."

"అంటే?"

"అంతసేపూ ఏదో జంకు జంకుగా- పెంపుడు పిల్లిలా--" కిలకిల నవ్వింది.

రాహుల్‌కు కోపం వచ్చింది. లేచి వెళ్ళిపోవాలనిపించింది. అయినా తమాయించుకున్నాడు.

"మీకు పిల్లలంటే ఇష్టం అటగా?"

"ఎవరు చెప్పారు? పిల్లలంటే నాకు అసహ్యం!"

రాహుల్ మౌనంగా ఆమె ముఖంలోకి చూశాడు.

"సరే! అసలు సంగతి చెప్పండి."

"మీ జీవిత ధ్యేయం ఏమిటి?"

"బాబోయ్ ఇంత పెద్ద ప్రశ్నా? మీరు ఎన్నో పుస్తకాలు చదువుతారు. మీకు ఆ ప్రశ్నకు సమాధానం దొరకలేదా?"

"లేదు."

"నేను చెప్పగలననుకున్నారా?"

"అడగాలనిపించింది."

"మరోసారి ఎప్పుడైనా చెబుతాను."

"కాదు. ఇప్పుడే సమాధానంకావాలి."

"జీవిత లక్ష్యం ప్రేమ!"

"ఎందుకని?"

"నాకు అలా అనిపిస్తుంది. అంతే!"

"వివాహం!"

"వివాహం ఒక అవసరం. అది జీవిత లక్ష్యం కాదు."

రాహుల్ ఆశ్చర్యంగా ఆమె ముఖంలోకి చూశాడు.

"వివాహం అవసరమా? ఎవరికి?"

"ప్రస్తుత సమాజంలో సురక్షితమైన స్థానం సంపాదించుకోడానికి."

"అంటే పెళ్ళి సమాజం కోసమా?"

"అవును"

"మరి ప్రేమ?"

"వ్యక్తి కోసం? మనిషి కోసం-మనసు కోసం."

మీలాంటి
మగవానికి
తృప్తినిచ్చేది- చార్మినారే !

CHARMINAR

VAZIR SULTAN TOBACCO CO LTD

10 CIGARETTES

విశ్రాంతి పొందండి! చార్మినార్ తాగండి.

చట్టబద్ధమైన హెచ్చరిక సిగరెట్ తాగడం ఆరోగ్యానికి హానికరం
STATUTORY WARNING CIGARETTE SMOKING IS INJURIOUS TO HEALTH

90 పైసలకు 10*

CASVS 253 183 TEL

"అసలు మీ దృష్టిలో ప్రేమంటే-?"

"ఇద్దరు స్వతంత్ర వ్యక్తుల మనసుల మధ్య ఏర్పడే అనురాగం- ఆకర్షణ- అనుబంధం."

"అవి వివాహం చేసుకున్న ఇద్దరి మధ్యా ఉండవా?"

"ఉండవు."

"ఎందుకని?"

"వివాహంలో బంధం ఉన్నది. దాన్ని అనుబంధం అని నేను అనుకోను. పెళ్ళితో వ్యక్తిస్వాతంత్ర్యం పోతుంది. దాంతో ప్రేమకూడా క్రమంగాపోతుంది."

"ప్రేమలో శారీరక సంబంధం కూడా ఒక భాగమే అని నా భావం."

"నేను కాదనడం లేదు."

"అంటే పెళ్ళికీ ప్రేమకూ సంబంధం లేదంటారా?"

"అవును!"

"మీకు పెళ్ళి అవుతుందనుకోండి. మీకు మీ భర్తమీద ప్రేమ తగ్గిపోతే ఏం చేస్తారు?"

సుమతి ఎర్రటి పెదవులమీద హాస్య రేఖ లీలగా కదిలింది.

"వివాహం తర్వాత మీరు మరొకర్ని ప్రేమించగలరా?"

"ఎందుకు కాకూడదూ? ఎందరో స్త్రీలు పెళ్ళయాక మరొకర్ని ప్రేమించడం నాకు తెలుసు."

"అలా చెయ్యడం అనుచితం అన్పించదా?"

"ప్రేమ ఉచితానుచితాలను బేరీజు వేసుకొంటూ కూర్చోదు."

"అందువల్ల జీవితంలో సంఘర్షణ తలఎత్తదా?"

"ఎత్తుతుంది. ప్రేమకోసం మానవుడు సమాజంలోనే కాదు, తనతో కూడా ఘర్షణపడతాడు."

"ఎందర్నయినా ప్రేమించడం సంభవమా?"

"ఒకే సమయంలో సంభవం కాదు." అన్నది సుమతి కాఫీ సిప్‌చేస్తూ.

"ప్రేమ మరణిస్తుందా?"

"ప్రేమ ఒక భావం. మనసు ఉన్నంత వరకూ అదిచావదు. కాకపోతే ప్రేమించబడే వ్యక్తి దూరంకావచ్చు. ఆ స్థానాన్ని మరో వ్యక్తి ఆశ్రయించవచ్చును."

రాహుల్‌కు తల తిరిగినట్టు అయింది. తలవంచుకొని కాఫీ తాగసాగాడు. రమేష్ చెప్పింది అక్షరాలా నిజం! తనే ఫూల్ అయ్యాడు.

"ఏమిటి ఆలోచిస్తున్నారు!"

"మొదట ఒక వ్యక్తిని ప్రేమించారనుకోండి. రెండో వ్యక్తి ఆ స్థానంలోకి ఎలా వస్తాడు?"

"మొదటి వ్యక్తిని తను నిజంగా ప్రేమించడంలేదని తెలుసుకున్నప్పుడు, నాకు కావాల్సిన వ్యక్తి, నేను కోరుకున్న వ్యక్తి ఇలాంటివాడు కాదనే భావం కలిగినప్పుడు."

రాహుల్ ఆలోచనలోపడ్డాడు. (సశేషం)

Printed and Published by A. Chandra Seker Rao at 5-9-88, Public Garden Road, Hyderabad, for YUVA Publications and Printed at Dolton Press, Public Garden Road, Hyderabad-500 001. Editor ; A. SUDHAKARA RAO

# ఫోర్‌హాన్స్—పళ్లడాక్టరు సృష్టించిన టూత్‌పేస్టు






## పళ్లను శుభ్రపరచడమేకాక చిగుళ్లను దృఢపరచడానికి తోడ్పడుతుంది

**చిగుళ్ల బాధల వల్ల ఆరోగ్యమైన పళ్లు కూడా ఊడిపోవచ్చు**



పళ్ల డాక్టర్లు ఏమంటున్నారంటే పళ్లను చక్కగా శుభ్రం చేసుకోకపోతే పళ్లు, చిగుళ్ల చుట్టూ పాచి అనబడే సూక్ష్మజీవుల పొర ఏర్పడుతుంది. దీన్ని అశ్రద్ధ చేస్తే పళ్లు గారకడతాయి. ఇది చిగుళ్లను బలహీనపరుస్తుంది. ఫలితంగా ఆరోగ్యమైన పళ్లు కూడా పట్టు తప్పి పడిపోవచ్చు. చిగుళ్ల బాధలు అనారోగ్యానికి దారి తీయవచ్చు.

**ఫోర్‌హాన్స్ చిగుళ్లను రక్షిస్తుంది**



డాక్టర్ ఫోర్‌హాన్స్ యొక్క అద్వితీయమైన ఫార్ములా లోని ప్రత్యేకమైన ఆస్ట్రింజెంట్ చిగుళ్లను దృఢపరచి, చిగుళ్ల బాధలు నివారించడానికి తోడ్పడుతుంది. అంచేత, ఫోర్‌హాన్స్ టూత్ పేస్టు, ఫోర్‌హాన్స్ డబుల్ యాక్షన్ టూత్‌బ్రష్‌తో మీ పళ్లను బ్రష్ చేసుకొని చిగుళ్లని మాలిష్ చేసుకోండి.




2675-127 TEL

# ఫోర్‌హాన్స్—చిగుళ్లకోసం

## FORM IV

(SEE RULE 8)

| | | |
|---|---|---|
| Place of Publication | ... | 5-9-88, Public Garden Road, Hyderabad-500 001. |
| Periodicity of its publication | ... | Monthly + Deepavali Special Number |
| Printer's Name | ... | A. Chandra seker Rao |
| Whether Citizen of India? | ... | Yes |
| Address | ... | 5-9-88, Public Garden Road, Hyderabad-500 001. |
| Publisher's Name | ... | A. Chandra seker Rao (For Yuva Publications) |
| Whether Citizen of India? | ... | Yes |
| Editor's name | ... | A. Sudhakara Rao |
| Whether Citizen of India? | ... | Yes |
| Address | ... | 5-10-194, Saifabad |
| | ... | Hyderabad-500 004 |
| Names and addresses of individuals who own the newspaper and partners or shareholders holding more than one percent of the total capital. | ... | Smt. A. Sarada 5-10-194, Saifabad Hyderabad-500 004 |
| | ... | Sri A. Chandra seker Rao 5-10-194, Saifabad Hyderabad-500 004 |
| | ... | Sri A. Rajasekara Rao 5-10-194, Saifabad Hyderabad-500 004 |
| | ... | Sri A. C. Chakrapani (Minor) 2 & 3 Arcot Road, Vadapalani Madras-600 0026 |

I, A. Chandra seker Rao, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

Dated: 1-3-'82

Sd. *A. Chandra seker Rao*
Signatue of Publisher

